# ఋషితుల్యుడు

## (జీవిత చరిత్ర)



రచన:

మోత్కుపల్లి దమయంతీదేవి

ఉపాధ్యాయురాలు

గవర్నమెంట్ మహబూబియా జూనియర్

కళాశాల గన్‌ఫౌండ్రి

హైదరాబాద్-1 (ఆం. ప్ర.)

# మా ఇందిరమ్మకు మందారమాల



మా ఇందిరమ్మకు మందారమాల ॥మా ఇందిరమ్మ॥
మా కల్పవల్లికి నీరాజనాలు
మనసులో మమకారము, మమతల మకరంధము
నవ్వులో వెన్నెలలు వెదజల్లు ఇందిరమ్మ ॥మా ఇందిరమ్మ॥

గల గల గంగమ్మ ప్రవహింమతుంటేను
ఘల్లు ఘల్లు కృష్ణమ్మ కనువిందు చేస్తుంటే
పసిడి పైరులే పండుతాయీ
ఇరవై అంశాలే ఫలింపతాయీ ॥మా ఇందిరమ్మ॥

అజంతా, ఎల్లోరా వెలలేని చిత్రాలు
ఇక్బాల్ కలములో మధుర రాగాలు
రవీంద్రుని రచనలో మకరంధ భావాలు
మా పథమే నింగి చేరేదాకా ॥మా ఇందిరమ్మ॥

గాంధీజీ త్యాగంబు, నెహ్రూజీ ఘనత,
సరోజిని సేవ, ఇందిరమ్మ సమైక్యత
ఇలలోన ఇందిరమ్మ దేవతై నిలిచే
ఇందిరమ్మ రూపమే తొలిదీపమై వెలిగె
జై ఇందిరాగాంధీ! జై ఇందిరాగాంధీ! ॥మా ఇందిరమ్మ॥

## మానవాళి మహానాయకుడు
## (APOTIE OF WORD PEACE)

1) చిరునవ్వుల చిరంజీవి
తల్లిని మించిన తనయుడు
యువకుల వనంలో
వికసించిన పారిజాతము —

2) వెన్నెల చిందు, కన్నుల విందు
రాజకీయ సాగరంలో
దొరికిన రత్నాలలో
అపురూప రత్నము —

3) రాజకీయాల్లో రారాజు
కాంగ్రెస్ పార్టీలో మారాజు
అలీనదేశాలలో హృదయాధిరాజు
భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ! —

శ్రీ రాజీవ్‌గాంధీ రాజ్యం అనురాగాలకు నిలయం.

Rushitulyudu Shree Rajiv Gandhi
Written by
Mothukupally Damayanthi Devi

ఋషితుల్యుడు శ్రీ రాజీవ్‌గాంధీ

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 1987
ప్రతులు : 1000

ప్రతులకు :

మోత్కుపల్లి దమయంతిదేవి
ఇంటి నెం. 16-1-121 సైదాబాద్
హైదరాబాద్, ఆం. ప్ర.

వెల రూ॥ 20-00

---

ముద్రణ :
~~రఘుమోహన్ ప్రింటర్స్,~~
రాంకోట్, హైదరాబాద్.

# విషయసూచిక




మోత్కుపల్లి దమయంతిదేవి (రచయిత్రి)ని సత్కరిస్తున్న శ్రీ టి. బాలగౌడ్ ఎం.పి. బలహీనవర్గాల అధ్యక్షులు. మరియు శ్రీ విజయశిఖామణి మాజీ ఎం.ఎల్.ఎ., జాయింట్ కన్వీనర్ మైనారిటీసెల్ ఏ.పి.సి.సి శ్రీ గజ్జెల నరహరి కన్వీనర్ హైదరాబాద్ సిటి కాంగ్రెస్ కమిటి ఎస్.సి./ఎస్.టి. సెల్. వ్యవస్థాపక కార్యదర్శి.

Shri D. Munu Swamy Ex. Minister, Shri Pothukuchi Sambashiva Rao President, All India Writers Association, G. Venkata Swamy, Ex. Minister, President A. P. Scheduled Castes United Front, Shri M, Kodanda Reddy General Secretary, City Congress Committee (I) Author Smt. Mothuku Pally Damayanthi Devi.



Mother of Non-Aligend

అశేష ప్రపంచ దేశాల ఆదరాభిమానాలు చూరగొని
మతసమైక్యతా కోసం ప్రాణత్యాగం చేసిన భారత దేశం
మాజీ ప్రధాన మంత్రిణి సమైక్యతాస్ఫూర్తి.

స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధీగారు శ్రీ రాజీవ్ రత్న గాంధీకి జన్మ నిచ్చి. తమ ప్రాణం కన్నమిన్నగా ప్రేమించి జీవితంలో నవ్వుల వెలుగుల నింపి, ప్రధానమంత్రిగా పెంచిన మాతృమూర్తి. శ్రీ రాజీవ్ నీ తలపుల ఆమని ధామం అందుకే ఈ గ్రంథం అంకితము.

Artist: Smt. Mothuku Pally Damayanthi Devi.




प्रधान मन्त्री, भारत
PRIME MINISTER,
INDIA.

Thank you for your sympathy.

In his short life Sanjay braved an unprecedented and sustained campaign of calumny. His integrity and deep concern for India's problems endeared him to all who came to know him, as was witnessed by the countrywide outpouring of grief on his passing away.

Yours sincerely,

Indira Gandhi

(Indira Gandhi)



ఆంధ్రప్రదేశ్ గవర్నరు కుమారి కుముద్ బిన్ జోషి మరియు
శాసన సభ స్పీకర్ జి. నారాయణరావు,
రచయిత్రి శ్రీమతి మోత్కుపల్లి దమయంతిదేవి.

# తొలి పలుకు

ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, దక్కన్ క్రానికల్ పత్రికల ద్వారా శ్రీ రాజీవ్‌గాంధీ రాజకీయ చరిత్రలోని వివిధ సభలు, సమావేశాలు, సంఘటనలు, ఉపన్యాసాలు సేకరించి వీలైనంత వరకు ఒక నిర్దుష్టస్వరూపం శ్రీ రాజీవ్ గాంధీ జీవిత చరిత్రకు ఇవ్వగలిగాననే సంతృప్తి నాకు కలిగింది.

నేను వ్రాసిన శ్రీ రాజీవ్‌గాంధీ జీవిత చరిత్రలో మానవతావాది శ్రీ రాజీవ్‌గాంధీ అనే ముఖ్యమైన లక్ష్యాన్ని ప్రస్ఫుటింప చేయడానికి ప్రయత్నం చేసాను. రాజకీయ చరిత్ర వివాదాస్పదం కాకుండా జరిగిన సంఘటనలు యథాతథంగా పత్రికల నుంచి ఈ గ్రంథములో ప్రచురించాను.

ఈ గ్రంధానికి "ఋషితుల్యుడు" అని నామకరణం చేసాను. పరిశోధకులకు, చరిత్రకారులకు ఈ గ్రంథం ఉపకరించవచ్చు. ఎన్నో కష్టాలను, ఆర్థిక బాధలను ఎదుర్కొంటూ ఈ గ్రంథరచన సాగించాల్సి వచ్చింది. ఆ కారణం చేతనే 1987 లో విడుదల గావలసి యుండిన గ్రంథాన్నింతకాలం జాగుచేయడం జరిగింది.

నేను చేసిన కృషిలో కాలపరిమితి లేకుండా గ్రంథరచనా కాలంనుండి ఎదుర్కొన్న ఆర్థిక బాధలన్నింటిలోను, పాలుపంచుకొంటు, అన్ని విధాల సహాయకారిగా, శుద్ధప్రతులు వ్రాయడంలోను, ప్రూపులు దిద్దడంలోను, "ఋషితుల్యుడు" పుస్తక ప్రచురణ కరగా నిలిచినందులకు శ్రీ గజ్జెల నరహరిగారికి నా ధన్యవాదాలు.

నేను వ్రాసిన ఈ గ్రంథానికి అడగగానే అమూల్యమైన అభిప్రాయాలను తెలియజేసిన శ్రీ పోతుకూచి సాంబశివరావుగారికి నా కృతజ్ఞతలు.

అల్పజ్ఞతవల్ల కొన్ని ఒడుదుడుకులు రచనా వ్యాసంగంలో దొర్లుట సహజము. తప్పొప్పులుండొచ్చు. ఉండగూడదని తప్పులుంటే తెలియజెప్పిన వారికి కృతజ్ఞురాలునై సరిదిద్దుకుంటాను. ఒప్పులు మీ మెప్పుపొందితే ధన్యురాలను. సహృదయంతో ఆలోచించండి.

శ్రీ రాజీవ్‌గాంధీ గురించి ఇంకా ఎన్నో వివరాలు సేకరించవచ్చు అన్న అభిప్రాయం నాలో మిగిలింది. బహుశా అద్వితీయమూర్తి అయిన శ్రీ రాజీవ్ గాంధీ ద్వితీయ ముద్రణలో మరికొన్ని సంఘటనలు చేర్చే అవకాశం ఉంది.

ఈ గ్రంథం సర్వజనులకు ఆదరపాత్రం కాగలదని నా విశ్వాసము.


రచయిత్రి

మోత్కుపల్లి దమయంతిదేవి

ఇంటి నెం. 16-1-121

సైదాబాద్,

హైదరాబాద్ - 500 659

# పీఠిక

ఇందిరాగాంధీ తరువాత రాజీవ్‌గాంధీ భారతదేశ పరిపాలనా సారధ్యం స్వీకరించారు. తెలుగు గ్రంథాలలో బహుశా ఇంత విపులంగా రాజీవ్‌గాంధీ గురించి వెలువడిన గ్రంథం ఇదే మొదటిది కావచ్చు. ఇందిరాగాంధీ మరణం వలన ఎంతో కదిలిపోయిన జనం ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) కే విజయం చేకూర్చారు. తద్వారా రాజీవ్‌గాంధీ పరిపాలనా సుస్థిరమైనది.

ఈ గ్రంథంలో రచయిత్రి శ్రీమతి మోత్కుపల్లి దమయంతిదేవి ఎన్నికల తీరుతెన్నులు ప్రస్ఫుటం చేస్తూ రాజీవ్‌గాంధీ ఆత్మ సౌందర్యమే ఆకర్షించినది అని ఆనాడు విజయానికి భేరీలు మ్రోగించి నాయకుల ప్రకటనలు పొందుపరిచారు. అంతర్జాతీయంగా నెహ్రూ, ఇందిరా స్థానాలు దాటి, అతి ఉన్నతంగా రాజీవ్ ఎదగగలరని ఆమె చెప్పారు.

ఈ గ్రంథంలో నవంబరు 19 జాతీయ సమైక్యతా దినంగా ప్రకటించటం, రాజీవ్ పట్టాభిషేకం వెనుక జరిగిన పదవీ కాంక్ష ప్రయత్నాలు, ప్రథమంగా నూతన మంత్రి వర్గ నిర్మాణం రష్యా టి. వి. లో ఇందిర మరణ వార్తలు మున్నగునవి రచయిత్రి పొందుపరిచారు. రాజీవ్‌గాంధీ ప్రధానిగా పరిపాలన చేపట్టగానే పేదల సంక్షేమానికి దీక్ష వహించారు. ఏడవ ప్రణాళిక కొత్తమెరుగులతో రూపు దిద్దుకొంది. పంజాబ్‌లో శాంతి నెలకొల్పటానికి ఒక ఒప్పందం కుదిరించి అకాలీలు సమైక్యంగా, స్నేహంగా ఉండాలని రాజీవ్ కోరారు. రాజీవ్ రాజనీతికి అమెరికా హారతి పట్టినది. అస్సాం సమస్యకు పరిష్కారం కనుగొన్నారు. అగ్ర రాజ్యాల మధ్య అణువస్త్రాల గురించి శాంతి సూచన చేసారు. కామన్‌వెల్త్ శిఖరాగ్ర సభలో దక్షిణాఫ్రికా దేశంపై తమ స్వంత భావాలు ప్రకటించారు. అణువస్త్రాలు తాము తయారు చేయమని రాజీవ్ గాంధీ స్పష్టంగా చెప్పారు. నూతన విద్యా విధానం ప్రకటించారు. కాంగ్రెస్‌పార్టీ

అధ్యక్ష పదవి కూడా రాజీవ్ చేపట్టారు. పాకిస్తాన్ బాంబు భయ ప్రకటనలు రాజీవ్ ఎదిరించారు. కమ్యూనిస్టులు, రాజీవ్ పరిపాలనా విధానం సమర్థించారు. జాతీయ కాంగ్రెస్ శతాబ్ది ఉత్సవాలు ఘనంగా జరిపారు. అలీన దేశాలతో సంధి కొనసాగించారు, ఫ్రాన్స్, రష్యా ఇతర ప్రపంచ దేశాల పర్యటనలు విజయ వంతమైనవి. లండన్‌లో కొందరు తీవ్రవాదులు రాజీవ్ హత్యకు చేసిన కుట్రలు విఫల మయ్యాయి. రాజీవ్ రాజకీయ చరిత్ర అనేక సంఘటనలతో చరిత్రాత్మక మైనది.

శ్రీమతి మోత్కూవల్లి దమయంతిదేవి ఈ గ్రంధాన్ని సరియైన సమ యంలో ప్రచురించారు. దేశంలో ప్రతిపక్షాలు ఎదురు తిరిగి రాజీవ్‌గాంధీ భారత దేశానికి ఏమి చేసారు, అని ప్రశ్నిస్తున్న ఈ రోజులలో ఈగ్రంధం సమాధానం చెప్పగలదు. అనేక పత్రికలలో వెలువడిన వార్తలు సేకరించి క్రోడీకరించి ఈ గ్రంధం తయారు చేసారు. ఇందులో కొన్ని ఆంగ్ల వార్తా వ్యాసాలు కూడా ఉన్నాయి. విషయ సేకరణలో దీక్ష, వార్తలు కుదించి చరిత్రగా రూపొందించ టంలో నేర్పు, చారిత్రక సత్యాలు ఈ గ్రంధంలో స్పష్టంగా కనిపిస్తాయి. స్వాతంత్ర్య పోరాటంలో అనుభవం నెహ్రూకు ఉంది. తండ్రి పరిపాలన పరి శీలన ఇందిరకు ఉంది. ఈ రెండు లేకున్నా రాజీవ్‌గాంధీ హఠాత్తుగా రాజకీయా లలో ప్రవేశించి ఎన్నో అనుభవాలు స్వయంకృషితో నేర్చుకొన్నారు. ఈ సత్యాలు రచయిత్రి మోత్కూవల్లి దమయంతిదేవి చాల చక్కగా తెలిపారు,

రాజకీయ చారిత్రిక గ్రంధాలలో దీనికి ప్రత్యేకమైన విశిష్టత ఉంటుంది. రచయిత్రి మోత్కూవల్లి దమయంతిదేవికి అటు చారిత్రక రంగంలో, ఇటు సాహిత్య రంగంలోను ప్రత్యేకమైన కీర్తి లభిస్తుంది. ఈమె కృషి ప్రశంసనీయం, అభినందనీయం.

పోతుకూచి సాంబశివరావు



"ఋషితుల్యుడు"
పుస్తక ప్రచురణకర్త
శ్రీ గజ్జెల నరహరిగారు



రచయిత్రి
మోత్కుపల్లి దమయంతిదేవి

# విజయోత్సవం

ఒక భారతావనిలో - ఒక వోటరు మదిలో - కనిపించే మమకారం - రాజీవ్ ప్రభంజనం' పట్టాభిషేకం ప్రజల పట్టాభిషేకం.

ఒక వోటరుమదిలో ఒక భారతావనిలో కనిపించే మమకారం-రాజీవ్ ప్రభంజనం ఇరవై అంశాలు చేపట్టిన దేశంలో - తిరుగులేని విజయం సాధించిన విజేతకి విజయోత్సవం - విజయోత్సవం మనస్సు వికలమైన - సమైక్యత మరువనీ రథసారధికి పట్టాభిషేకం - ప్రజల పట్టాభిషేకం.

రాజనగరులో - సుకరంధల మదిలో మధురమైన భావాలతో - వోటర్ల హృదయాలలో నిలిచినా రాజీవ్‌కు అమృతాభిషేకం, జయించిన విజయభేరికి విజయోత్సవం - పట్టాభిషేకం.

పట్టాభిషేకం రాజీవ్‌కు పట్టాభిషేకం అమ్మనీడలో - ఎన్నికల ఘట్టంలో అఖండ మెజారిటీ సాధించిన రథసారధికి ప్రజల పట్టాభిషేకం.

మమతపోయినా - గుండెచెదరని ఇందిరా (పుడమి) పుత్రునికి - ప్రజల పట్టాభిషేకం.

బంగరు పుడమిలో - ఇందిరమ్మ వెలుగుబాటలో-ఇందిరా కాంగ్రెస్ పార్టీలో అద్భుత విజయం సాధించిన విజేతకి - ప్రజల పట్టాభిషేకం.

గెలిచిన విజేతకి - ప్రజల పట్టాభిషేకం - భారత ప్రధానమంత్రికి - పట్టాభిషేకం - పట్టాభిషేకం.

## కాంగ్రెస్‌కు ప్రజల పట్టాభిషేకం :

దేశ సమైక్యత, సుస్థిరత పరిరక్షణకై విశ్వాసంతో ప్రజలు శ్రీ రాజీవ్ గాంధీకి అఖండ మెజారిటీతో పట్టాభిషేకం చేశారు. సంక్షోభిత భారతంలో ప్రజలను గట్టెక్కించి గట్టిమేలు తలపెట్టగలదీ, సంక్షేమానికి మరింత సత్వర ప్రగతికి

దోహదపడగల సత్తాగలదీ కాంగ్రెస్ - ఐ మాత్రమేనని అందరు గ్రహించి అపూర్వ ఆదరణతో గెలిపించి తమ అభీష్టాన్ని నెరవేర్చుకొన్నారు.

8 వ లోకసభకు జరిగిన ఎన్నికలలో పాలుగింట మూడువంతుల మెజారిటీని మించి కనీ వినీ ఎరుగనిరీతిలో అఖండవిజయం సాధించిన కాంగ్రెస్ - ఐ పార్టీ కొత్తమంత్రివర్గాన్ని ఏర్పాటుచేశారు. భారత పార్లమెంటరీ ఎన్నికల చరిత్రలో ఎన్నడు ఏ పార్టీ ఇన్ని స్థానాలను గెలుచుకోలేదు. 1957 లో కాంగ్రెస్ (ఐ) అత్యధికంగా 371 సీట్లు గెలుచుకొంది.

**శతజయంతి సంవత్సరం :**

జాతి సమైక్యత నినాద స్ఫూర్తితో ప్రజలచేత అత్యంతఘనంగా పట్టాభిషేకం చేయించుకున్న ఈ తరుణంలో కాంగ్రెస్ - ఐ శతజయంతి సంవత్సరంలోకి అడుగు పెట్టింది.

99 సంవత్సరాల క్రితం బ్రిటిష్ సివిల్ ఉద్యోగి అలెను అక్టావియన్ హ్యూమ్ ఆయన భారతీయ మిత్రులు బొంబాయిలో సమావేశమై కాంగ్రెస్‌ను స్థాపించారు. ప్రభుత్వ ఉద్యోగుల సమస్యలను బ్రిటిష్‌రాణికి నివేదించే ఏకైక ఉద్దేశంతో నాడు అలా ఏర్పడిన కాంగ్రెస్ మరి రెండు శతాబ్దాలకే జాతీయ విమోచనకు శక్తివంతమైన ఉపకరణగా రూపు దిద్దుకొంది. కాంగ్రెస్ శతజయంతి ప్రాంగణాన హిమాచల్‌ప్రదేశ్, హర్యానా, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీలో ఆ పార్టీ ప్రతిపక్షాలను పూర్తిగా ఏరివేసింది. మహారాష్ట్రలో 43, సమీప గుజరాత్‌లో మొత్తం 28 స్థానాలు గెలుచుకుంది.

**సూత్రాలు గాలికెగిరిపోయాయి :**

ఎప్పుడూ వినవచ్చే రెండు మాత్రికలు ఈ పారి కాంగ్రెస్ - ఐ ప్రభంజనంలో పడి కొట్టుకుపోయాయి. పోలింగ్‌శాతం ఎక్కువగా ఉంటే కాంగ్రెస్ - ఐ కి లాభించదన్నది వమ్మయిన మొదటిసూత్రం తమ వోట్లు చీలకుండా ప్రతిపక్షాలు జాగ్రత్తపడితే కాంగ్రెస్ - ఐ కి గడ్డుపరిస్థితి ఎదురవుతుందనే సూత్రంకూడ ఈసారి వమ్మయింది. ఈసారి దేశమంతటా సగటున 60 శాతం పోలింగ్ జరిగింది. కానీ కాంగ్రెస్-ఐకి అవి అధిక అర్థికస్థానాలు పాప్రింగణాన్ని తెచ్చిపెట్టింది. 250 నియోజక

వర్గాలలో రాజస్థాన్‌లో, ముఖాముఖి పోటీ జరిగింది. ఐనా ప్రతిపక్షాలు కాంగ్రెస్-ఐ ప్రభంజనాన్ని అడ్డుకోలేక చతికిలబడ్డాయి.

## మధ్యప్రదేశ్‌లో అన్నిసీట్లు కాంగ్రెస్‌వే :

40 సీట్లకు ఎన్నికలు జరిగిన మధ్యప్రదేశ్‌లో 39 సీట్లను గెలుచుకొని అక్కడ ప్రతిపక్షాలను కాంగ్రెస్ - ఐ పూర్తిగా తుడిచిపెట్టింది. ఒకప్పుడు మధ్యప్రదేశ్ 'జనసంఘ్‌కు' కంచుకోటగా ఉండేది. 1980 లో ఈ రాష్ట్రంలో కాంగ్రెస్ ఐ కి 35 సీట్లు వచ్చాయి. 1977 లో ఒకేఒక సీటు వచ్చింది. 1971లో 73 గెలుచుకొంది. అదేవిధంగా 1977 లో మొత్తం అన్నిసీట్లు జనతాపార్టీకే దక్కిన ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెస్ - ఐ ఎన్నికలు జరిగిన 84 సీట్లలో 82 సీట్లను గెలుచుకొంది. అరుణాచల్‌ప్రదేశ్ అసెంబ్లీలో 30 సభ్యులుగల కాంగ్రెస్ - ఐ సంపూర్ణ మెజారిటీ సాధించింది. గోవా అసెంబ్లీలో 30 మంది సభ్యులుగల కాంగ్రెస్ - ఐ కూడ పూర్తి మెజారిటీ సాధించింది. 18 సీట్లకు కాంగ్రెస్ - ఐ గెలుపొందగా మహారాష్ట్ర గోవా గోమంతక్ పార్టీ 8, కాంగ్రెస్ (గోవా) ఐ ఇండిపెండెంట్లు 3 సీట్లు గెలుచుకున్నారు.

ఇంచుమించు అంతటా మొత్తం స్థానాలు అన్నిటినీ కైవసం చేసుకొన్న కాంగ్రెస్ - ఐ కర్ణాటకలో మునుపు కోల్పోయిన ప్రాబల్యాన్ని తిరిగి సాధించుకొంది. ఆంధ్రప్రదేశ్‌లో 34 సీట్లను కోల్పోయినప్పటికి తమిళనాడులో యధాతధంగా ప్రాబల్యాన్ని నిలుపుకొంది.

దేశమంతట ఇదే మొదటిసారిగా 50 శాతం వోట్లు పార్టీకి పోలయ్యాయి. ఈ ఎన్నికల్లో చెట్టుకొకరు పుట్టకొకరు కకావికలై కొనప్రాణంతో మిగిలిన ప్రతిపక్షాలు ఈ ఫలితాలపట్ల ఆగ్రహంనుండి ఆవేదనదాకా అనేక రీతుల్లో ప్రతిస్పందించాయి. కాంగ్రెస్ - ఐ గెలుచుకున్న తొలి 348 స్థానాలలో 72 దాకా సీట్లు జనతా, కమ్యూనిస్టు పార్టీలు, బి. జె. పి. నుండి చేజిక్కించుకున్నవి.

కాంగ్రెస్ - జె అధ్యక్షుడు శ్రీ జగజీవన్‌రామ్ అతి తక్కువగా 1300 మెజారిటీతో మాత్రమే గెలుపొందగలిగాడు. కాంగ్రెస్ - ఐ ప్రభంజనంలో కొట్టుకొని పోకుండా నిలదొక్కుకున్న కొద్దిమందిలో లోక్‌దల్ అధ్యక్షుడు శ్రీ చరణ్‌సింగ్ ఒకరు. తనకు గట్టిపట్టువున్న బాగ్‌పత్ నుంచి అయన ఎన్నికయ్యారు. కాంగ్రె-యస్

నాయకులు శ్రీ కె. పి. ఉన్నికృష్ణన్ ఉదాగరా నుంచి, శ్రీ శరద్‌పవార్ బారామతి నుంచి గెలుపొందారు.

తమిళనాడు లోక్‌సభ ఎన్నికలలో కూడా కాంగ్రెస్ - ఐ విజయఢంకా మ్రోగించింది. ఈ రాష్ట్రములోని మొత్తంస్థానాలు 39. ఒక స్థానంలో ఎన్నిక వాయిదా పడింది. మిగిలిన 38 స్థానాలలో 25 కాంగ్రెస్ - ఐ గెలుచుకొంది. ఎ. ఐ. ఎ. డి. ఎం. కె. 12 స్థానాలు సంపాదించగా, డి. ఎం. కె. పార్టీకి ఒకే ఒకస్థానం వచ్చింది.

ఈ ఎన్నికలలో శ్రీ రాజీవ్‌గాంధీ పార్టీపరంగానే కాకుండా వ్యక్తిగతంగా కూడా అందరికంటె ఎక్కువ మెజారిటీతో ఘనవిజయం సాధించడం మరో చెప్పుకో తగ్గ విశేషం. ఆయన అమేథీ స్థానాన్ని మళ్ళీ గెలుచుకొన్నారు. ఆయనకు 314878 వోట్ల ఆధిక్యత లభించింది. కేంద్ర సమాచార, ప్రసారశాఖ మంత్రి శ్రీ హెచ్. కె. ఎల్. భగత్ 312180 వోట్ల మెజారిటీతో సృష్టించిన రికార్డును శ్రీ రాజీవ్ అధిగమించారు.

ప్రతిపక్షాల మద్దతుతో శ్రీ రాజీవ్‌పై పోటీచేసిన ఆయన మరదలు శ్రీమతి మేనకాగాంధీ డిపాజిట్ గల్లంతయింది.

### సామరస్య పరిరక్షణే నా ప్రథమ సంకల్పం :

దేశ సమైక్యతా పరిరక్షణ కోసమే ప్రజలు కాంగ్రెస్ ఐని గెలిపించారని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ పత్రికాగోష్టిలో చెప్పారు. ఐక్యతను పటిష్టం చేయడం, మత సామరస్యం పరిరక్షించడం, మైనారిటీలను, బలహీనవర్గాలకు న్యాయం చేకూర్చడం తన ప్రథమ కర్తవ్యమని ఆయన అన్నారు. కొత్త ప్రభుత్వ ఆర్థిక, పన్నుల విధానాలు బడ్జెట్ సమావేశంలో ప్రకటితమవుతాయని ఆయన చెప్పారు.

### 'ఆంధ్రలో చేయవలసింది చాలా వుంది' :

ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ - ఐ పరాజయం గురించి అడగ్గా "చేయవలసినది చాలా ఉన్నది" అని రాజీవ్‌గాంధీ వ్యాఖ్యానించారు. కొత్త ప్రభుత్వం విదేశీ విధానంలో మార్పు ఉంటుందా అని విలేకరులు ప్రశ్నించగా, మొత్తం మీదప్రస్తుత విధానమే కొనసాగుతుందని ఆయన సమాధానమిచ్చారు. ప్రపంచంలోని అన్ని ఇతర

దేశాలతోను సత్సంబంధాలు కలిగి ఉండటమే భారత్ లక్ష్యమని, "విదేశాంగ శాఖను ఇకముందుకూడా మీరే నిర్వహిస్తారా?'' అని అడగ్గా "మంత్రివర్గం ఏర్పాటయ్యే వరకు వేచిచూడండి" అని ఆయన అన్నారు.

భారత్, పాకిస్తాన్ సంబంధాలగురించి ప్రశ్నించగా సంబంధాలు మెరుగు పరుచుకోవాలని పాకిస్తాన్ అధ్యక్షుడు జియా ఉల్ హక్ చిత్తశుద్ధితో కోరుకుంటు న్నట్టే కనిపిస్తున్నదని, అయితే ఆయన మంత్రివర్గంలో కొందరు ఇందుకు విరుద్ధ మైన వైఖరి వ్యక్తం చేస్తున్నారని రాజీవ్‌గాంధీ చెప్పారు. అవినీతికి తావులేని సమర్ధ వంతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాననే తన హామీని నిలబెట్టుకునేందుకు పరిపా లనా యంత్రాంగం ప్రక్షాళన చేస్తానని ఆయన సూచనప్రాయంగా చెప్పారు. ప్రజలు తమ బంగారు భవితవ్యంకోసమే కాంగ్రెస్ - ఐని గెలిపించారని ఆయన చెప్పారు.

శ్రీలంక తమిళుల సమస్య పరిష్కారానికి కొత్త ప్రతిపాదనలను చేయదలచు కున్నారా అని అడగ్గా, శ్రీలంకలో పరిస్థితిని తాము సమీక్షించవలసి ఉన్నదని, ఎన్నికలదృష్ట్యా ఆ సమస్యను నిశితంగా పరిశీలించే వ్యవధి తనకు లేకపోయిందనీ ఆయన సమాధానమిచ్చారు. అలీనవిధానం కొనసాగిస్తారా అని అడగ్గా, అలీనవిధానా లలో తనకు గట్టి నమ్మకం ఉన్నదనీ, వాటికి పూర్తి మద్దతు ఇస్తాననీ, ఆయనచెప్పారు. తక్షణ పరిష్కారం సాధించడానికి మీరు చేపట్టే సమస్య ఏమిటి? అని ప్రశ్నించగా, సమస్యలు చాలా ఉన్నాయనీ, ప్రతి సమస్యను దాని పరిధిలోనే పరిశీలించవలసి ఉంటుందనీ, సాధ్యమైనంత త్వరలోనే ఆ సమస్యలను పరిష్కరించడానికి కృషి చేస్తామనీ, తమ ప్రతిపాదనలను ఈ దశలోనే వెల్లడించడం విజ్ఞత అనిపించుకోదని రాజీవ్‌గాంధీ అన్నారు.

ఎన్నికలలో ప్రతిపక్షాల ఘోర పరాజయంపై మీ అభిప్రాయం ఏమిటని అడగ్గా, "నేను ఇంతకుముందే చెప్పినట్లు దేశమంతటా అన్నిరంగాల ప్రజల మద్దతు మాకున్నది'' అని ఆయన అన్నారు. ఎన్నికల్లో తమ పార్టీ అపూర్వ విజయం సాధించిన ఫలితంగా కొత్త ప్రభుత్వానికి బాధ్యతలు పెరుగుతాయని రాజీవ్‌గాంధీ చెప్పారు. దేశం ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నదంటు, ప్రజల సహకారంతో ఆ సమస్యలను పరిష్కరించగలనని ఆయన ఆశాభావం వ్యక్తంచేశారు. భారతీయ జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించి నూరేళ్ళయిందని ఆయన అన్నారు.

**ఆనందోత్సాహాలు :**

ఢిల్లీనుంచి గెలిచిన కాంగ్రెస్ - ఐ అభ్యర్థులు హెచ్. కె. ఎల్. భగత్, కె. సి. పంత్ లలిత్ మకాన్ తదితరులు సభాస్థలివద్ద రాజీవ్‌గాంధీకి స్వాగతం చెప్పారు. వందలాది మంది ప్రజలు నాట్యంచేస్తూ, డప్పులు వాయిస్తూ వచ్చారు. రాజీవ్‌గాంధీ జిందాబాద్ అని వారు నినాదాలు చేశారు. వేదికపై వెనుక ఇందిరాగాంధీ ఫోటో ఉంచారు. వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యలను, తన ప్రభుత్వ విధానాలను అరగంటసేపు పత్రికాగోష్టిలో రాజీవ్‌గాంధీ ప్రస్తావించారు. ఆంధ్రప్రదేశ్ విషయంలో కేంద్రప్రభుత్వం ఎటువంటి విధానం అవలంబిస్తుందని అడగ్గా, ఆ రాష్ట్ర ప్రజల స్థితిగతులు మెరుగుపరచడానికి తమ ప్రభుత్వం చర్యలు తీసుకొంటుందని ఆయన చెప్పారు. అవినీతి నిర్మూలనకు వ్యూహం రూపొందించడానికి తమకు కొన్నిరోజుల వ్యవధి యివ్వాలని ఆయన అన్నారు. 8 వ లోక్‌సభ ఎన్నికలకు, కాంగ్రెస్ - ఐ గత రెండున్నర ఏళ్ళనుంచే సన్నాహాలు చేసుకొంటు వున్నదని కానీ, ఈ ఎన్నికల్లో గెలుపుగురించి తమకు సందేహమే లేదని ఆయనచెప్పారు. ఎన్నికల ప్రచారం సందర్భంగా తాను దేశమంతటా 500 సభలలో ప్రసంగించానని ఆయన తెలియజేశారు. ఆంధ్రప్రదేశ్‌లో కేంద్రమంత్రుల పరాజయం దృష్ట్యా రాజకీయంగా ఇకపై వారితో ఎటువంటి సంబంధాలు కలిగి ఉంటారని అడగ్గా, "ఎన్నికలలో ఓడిపోయినంత మాత్రాన వారు కాంగ్రెస్ - ఐ తరఫున పని చేయరని నేను అనుకోను" అని ఆయన సమాధానమిచ్చారు. అయితే, ఓడిపోయిన మంత్రులు ప్రభుత్వంలో కొనసాగజాలరని రాజీవ్‌గాంధీ స్పష్టం చేసారు. ప్రతిపక్షాలతో రాజీ ధోరణి అవలంబిస్తారా అని ప్రశ్నించగా జాతీయ సమస్యల పరిష్కార కృషిలో ప్రతిపక్షాల సహకారం స్వీకరిస్తామని ఆయన చెప్పారు. ఎన్నికల ప్రచారం సందర్భంగా తాము ప్రస్తావించిన సమస్యలు జాతీయ సమస్యలు కావనీ, పార్టీపరమైన వివాదాలనే ప్రతిపక్షాలు గ్రహించాయని ఆయన అన్నారు. మతంలో రాజకీయాల ప్రమేయం లేకుండా చేయడానికి కొన్ని చర్యలు తీసుకొంటామని ఆయన చెప్పారు. దేశంలోని సిక్కుల భద్రతకు చర్యలు తీసికొన్నది "నా ప్రభుత్వమే" అని ఆయన అన్నారు. మంత్రివర్గంలో పాతవారికి స్థానం కల్పిస్తారా అని ప్రశ్నించగా "కొన్ని రోజులు వేచిచూడండి'' అని ఆయన సమాధానమిచ్చారు.

విదేశాలు పర్యటించే యోచన ఉన్నదా అని అడగ్గా, ఇంకా ఏమీ అనుకోలేదనీ అయితే కొన్ని దేశాలనుంచి తనకు ఆహ్వానాలు వచ్చాయనీ, పర్యటన తేదీలుమాత్రం నిర్ణయించలేదని ఆయన అన్నారు.

**రాజీవ్ అభయం :**

ఎన్నికల వాగ్దానాలన్ని తమపార్టీ నెరవేరుస్తుందని ప్రధాని రాజీవ్‌గాంధీ దేశ ప్రజలకు హామీ ఇచ్చారు. తన నివాసం సమీపంలోని మేతచౌక్‌లో జరిగిన కాంగ్రెస్ - ఐ విజయోత్సవంతో ఆయన ప్రసంగించారు. ఎన్నికల్లో కాంగ్రెస్ ఐకి అత్యధిక మెజారిటీ సంపాదించి పెట్టిన ప్రజలను ఆయన అభినందిస్తూ వారికి నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేశారు. ''ఎన్నికల్లో నా పార్టీకి మద్దతునిచ్చిన ప్రజలకు నా కృతజ్ఞతలు'' అని ఆయన అన్నారు. కాంగ్రెస్ - ఐ విధానాలు, కార్యక్రమాలపట్ల దేశప్రజలకు అచంచల విశ్వాసం ఉన్నదనడానికి ఎన్నికల ఫలితాలే నిదర్శనమని ఆయన అభిప్రాయపడ్డారు. కాంగ్రెస్ - ఐ విధానాలను కొనసాగిస్తే దేశం మరింత శక్తివంతమవుతుందని కూడా ఎన్నికల ఫలితాలు రుజువు చేశాయని ఆయన అన్నారు,

**'రాజీవ్ ఆత్మసౌందర్యమే ఆకర్షించింది'**

**(సోనియా మధురస్మృతులు)**

బొంబాయి – కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో సోనియా, రాజీవ్‌గాంధీ చదువుతున్నప్పుడే, ఇందిరాగాంధీకి సోనియా మొదటిసారిగా లండన్‌లోని భారత హైకమిషన్ కార్యాలయంలో కలుసుకున్నారు. ఈ తొలిసమావేశం మరుపురానిదని హిందీ వారపత్రిక ధర్మయుగ్ కు ఇచ్చిన ఇంటర్వ్యూలో శ్రీమతి సోనియాగాంధీ చెప్పారు.

సోనియా ఒక పత్రికకు ఇంటర్వ్యూ ఇవ్వడం ఇదే ప్రథమం. 'సోనియా' నేను బిడ్డలుకన్న తల్లిని. నాకు నువ్వు భయపడవద్దు. నీ వయసులో నేను పరమత యువకుని ప్రేమించాను. నీ ప్రేమను నేను అర్థం చేసికోగలను. దిగులుపడవద్దు". అని తనతో ఇందిరాగాంధీ అప్పుడు చెప్పారని సోనియా తెలిపారు. హైకమిషన్ కార్యాలయంనుంచి సోనియా వెళ్ళబోతుండగా ఆమెను ఇందిరాగాంధీ వెనక్కిపిలిచి, తనవద్దనున్న చిన్న పెట్టె తెరచి, సూదిదారం తీసికొని సోనియా దుస్తులపై చింపిరిగా ఉన్న భాగాన్ని కుట్టారు. "ఈ సంఘటన నన్ను ఎంతగానో కదిలించి వేసింది. నిజానికి మమ్మి (ఇందిరాగాంధి) నుంచి నాకందిన తొలికానుక అదేనని సోనియా ఇంటర్వ్యూలో అన్నారు.

"రాజీవ్‌గాంధీ అందగాడనో, ఉన్నత కుటుంబానికి చెందినవాడనో ఆయనను నేను ప్రేమించలేదు. ఆయనలోని "ఆత్మ సౌదర్యం నన్ను ఆకర్షించింది. రాజీవ్‌లో ఇతరులలో లేని ప్రత్యేకతలు, బాహ్య సౌందర్యాన్ని మించిన నిగూఢశక్తి. వివేకం ఆయనలో ఉన్నాయనిపించింది" అని ఆమె వివరించారు. ఉన్నత కుటుంబీకుడైన, సమాజంలో అత్యున్నత స్థానం ఉన్నా రాజకీయంగా తిరుగులేని పలుకుబడి కలిగి ఉన్నా కేంబ్రిడ్జిలో రాజీవ్ ఎప్పుడు అహంభావం ప్రదర్శించలేదని, నిజాయితీగా, ఉదారంగా వ్యవహరించే వారని సోనియా చెప్పారు.

## ప్రపంచ హీరోగా ఎదిగిన రాజీవ్ ,

అంతర్జాతీయంగా తాత, తల్లి స్థానాన్ని, స్థాయిని మించిపోతాడు ఈ యువకుడు అని మరికొందరు జోస్యం చెప్పారు. నెహ్రూజీ ఇందిరాజీలనుంచి గుణాలన్ని ఆయనలో ఇమిడియున్నావి.

అంతర్జాతీయ వేదికలపై హేమాహేమీల ప్రక్కన అదేస్థాయిలో ఆయన హుందాగా, గంభీరంగా చేసిన ప్రసంగాలు అందరి దృష్టిని ఆకర్షించాయి. చలాకీగా చలోక్తులు వేస్తూ విలేకరుల ప్రశ్నలకు సమాధానాలు చెప్పడంవల్ల పాత్రికేయులకు అత్యంత ప్రియమైన నాయకుడయ్యాడు. ఆయన కార్యదక్షతకు, దీక్షకు కామన్వెల్తు సమావేశంలో నిర్వహించిన పాత్ర మచ్చుతునక. దక్షిణాఫ్రికా జాత్యహంకార ప్రభుత్వంపై ఆంక్షలువిధించే విషయంలో బ్రిటన్‌కు, ఇతర దేశాలకు మధ్యగల అభిప్రాయ బేదాలను సరిదిద్ది ఏకాభిప్రాయాన్ని సాధించడానికి ఆయన చూపిన శ్రద్ధ, నెరపిన దౌత్యమ్మే కారణము.

దక్షిణాఫ్రికాపై ఒక మోతాదులో ఆంక్షలు విధించడానికి గడువును నిర్ణయిస్తూ ఏడుపుటల కామన్వెల్తు ఒప్పందం వెలువడ్డానికి శ్రీ రాజీవ్‌గాంధీ ఆస్ట్రేలియా నాయకుడు బాబ్‌హక్, కెనడా నేత బ్రైన్‌ముల్రోని, జాంబియా అధ్యక్షుడు కెన్నత్‌కాండా ప్రభుతులతో రెండురోజులపాటు నిర్విరామంగా చర్చలు జరిపారు. "అందరికి ఆమోదయోగ్యమైన నూతన ప్రపంచ వ్యవస్థ రూపొందాలని, మానవాళి మనుగడకు, దారిద్ర్యం, ఉగ్రవాదం నిర్మూలనకు ఇది తప్పనిసరి అని శ్రీ రాజీవ్ గాంధీ అన్నారు. పరస్పర సహకారం, సఖ్యత, సమైఖ్యత కలిగిన సరికొత్త ప్రపంచ వ్యవస్థగా ఇది తయారు కావాలని శ్రీ రాజీవ్ అన్నారు. కొన్ని దేశాలు గొప్ప ప్రజా

స్వామ్య దేశాలమంటు గొప్పలు చెప్పుకునే కొన్ని దేశాలు, తోటి దేశాలపట్ల అప్రజా స్వామిక, అనాగరిక విధానాలను అనుసరిస్తున్నవని, ఇది సిగ్గుచేటుగా సభ్యసమాజం కలవంచుకోవలసిన విషయం అని శ్రీ రాజీవ్ నిష్కర్షగా కామన్వెల్తు సమావేశాల్లో స్పష్టం చేశారు.

ఉగ్రవాదం ప్రజాస్వామ్య మౌలిక సూత్రాలకే విరుద్ధమని, దీన్ని ఎవరు పెంచి పోషించినా అవివేకమే అవుతుందని, ప్రపంచంలో ఎక్కడ, ఏమూల జాత్యహంకారం ఉన్నా దానికి చరమగీతం పాడాల్సిందే అని శ్రీ రాజీవ్ ఉద్ఘాటించారు. కేవలం అనడమే కాదు అందర్నీ ఒప్పించి, ఆ దిశగా ఒక పటిష్టమైన ఒప్పందానికి రూపకల్పన చేశారు కూడా. ఇది ఆయన కార్యదక్షతకు ప్రబల నిదర్శనం. నాసా నుండి హవానా వెళ్ళిన ప్రధానికి అక్కడ అఖండమైన స్వాగత సత్కారాలు అందు కున్నారు. విమానాశ్రయంలో క్యూబా అధినేత ఫ్రిడెల్ క్యాస్ట్రో రాజీవ్‌ను ఆప్యాయంగా ఆలింగనం చేసుకొని స్వాగతం చెప్పారు. తాత మందాతనం తల్లి రాజనీతిజ్ఞత కలగలిసిన నేతగా రాజీవ్ పేరు తెచ్చుకున్నారు. వేలాదిమంది క్యూబా వాసులు "వీవా వీవా" అంటూ హర్షాతిరేకంగా నినాదాలు చేస్తుంటే శతఘ్ని దళాల గౌరవ వందనం శ్రీ రాజీవ్ రత్న అందుకున్నారు. భారత్ - క్యూబా మైత్రికి రాజీవ్‌పట్ల ఆ దేశస్థులకు గల గౌరవాభిమానాలకు ఆ సన్నివేశం దర్పణంగా నిలిచింది. ఆ తర్వాత జరిగిన ఒక కార్యక్రమంలో క్యూబా అత్యున్నత గౌరవ సత్కారాన్ని స్వర్గీయ ప్రధాని ఇందిరా ప్రియదర్శిని తరపున శ్రీ రాజీవ్ అందుకున్నారు. సజలనయనాలతో క్యాస్ట్రో ఆ దృశ్యాన్ని తిలకించారు. మహారాజకీయ శక్తి విజయేందిరా మరణించినందున ఆమె స్వయంగా సత్కారాన్ని అందుకోలేకపోయారు తల్లికి తగ్గ తనయుడు శ్రీ రాజీవ్‌గాంధీ. రాజీవ్‌కు తల్లితరపున ఆ సత్కారాన్ని అందుకున్నపుడు ఆనంద బాష్పాలు జారిపడినవి.

ఆ దృశ్యం క్యాస్ట్రోకు భారతదేశమన్నా, భారత ప్రధాని అన్నా గల ప్రత్యేక ప్రేమవాత్సల్యాలకు దృష్టాంతంగా నిలిచింది. క్యూబాలో గడిపింది ఇరవైనాలుగు గంటలే అయినా నిజమైన మిత్రదేశం అంటే ఏమిటో తెలిసింది మాకు. భారత ప్రధానికి లభించింది లాంఛనప్రాయపు స్వాగత సత్కారాలుమాత్రమేకాదు అందులో నిజమైన ఆత్మీయత ఉంది. నిండైన ఆదరణ ఉంది. శ్రీ రాజీవ్ తిరుగు ప్రయాణమైనపుడు విమానాశ్రయంవరకు 15 కిలో మీటర్ల దారి పొడవునా లక్షలాదిమంది

చేతులూపుతూ స్పానిష్ భాషలో నినాదాలిస్తూ పతాకాలతో, ప్లెకార్డ్సుతో వీడ్కోలు చెప్పారు.

శ్రీ రాజీవ్‌గాంధి న్యూయార్క్‌లో ఐక్యరాజ్యసమితి 40 వ వార్షికోత్సవ సమావేశాల్లో చేసిన గంభీరోపన్యాసం ప్రపంచ ప్రముఖులందరిని ఆకట్టుకుంది మానవాళి మనుగడకే సవాలుగా పరిణమించిన ఆయుధపోటీని అరికట్టడానికి, ఆ వివక్షతను అంతమొందించడానికి దీక్షను వ్యక్తంచేశారు.

కావలసినన్ని వనరులున్న ఈ జగతిలో వస్తుయుండే దుర్వ్యవపరిస్థితి ఎందుకు సమతాయుగంలో సభ్యసమాజానికే తలవంపు కలిగించే జాతి వివక్షత ఏమిటి? అని ప్రశ్నించారు. శాంతి, సమానత్వం, స్వాతంత్ర్యంకోసం ఉద్యమిద్దాం. అసమానతలు అన్యాయాలు, మన మనుగడకే ప్రమాదాలు. మానవుని సృజనాత్మక శక్తియుక్తులు విజ్ఞానాన్ని వదునుపెట్టాలే తప్ప విశ్వవినాశనానికి దోహదపడరాదు. అణుయుద్ధ మేఘాలు కమ్ముకుంటున్నాయి. భారతీయుడు నాగేంద్రసింగ్ నాయకత్వానగల అంతర్జాతీయ న్యాయస్థానాన్ని కూడా ఆయన దర్శించారు. ఆమేస్టర్ డామ్‌నుండి ఢిల్లీ రావలసిన శ్రీ రాజీవ్ ఆఖరు నిమిషంలో మాస్కో వెళ్తున్నట్లు ప్రకటించి అందరిని ఆశ్చర్యంలో ముంచెత్తారు. ఏదో విశేషముంది. ఈ ఆకస్మిక పర్యటనలో అందరూ ఊహాగానాలు చేశారు. అయితే శ్రీ రాజీవ్ సోవియట్ అధినేత గోర్బచేవ్‌తో జరిపిన చర్చలు వివిధ అంశాలపై పరస్పరం అభిప్రాయాలు తెలుసుకోడానికే అని ఒక రకంగా అది ప్రపంచ పరిస్థితిని మదింపు వేసే సమీక్షా సమావేశమని, ఆ తర్వాత వెల్లడయింది.

కార్యక్రమంలోలేని ఆకస్మిక పర్యటన అయినప్పటికి మాస్కోలో శ్రీ రాజీవ్‌కు ఘనమైన స్వాగత సత్కారాలు లభించాయి. ఆరుదేశాల పర్యటనతో అంతర్జాతీయ రంగంలో భారతదేశ ప్రతిష్ఠను ఇనుమడింపజేసి, భారత ప్రధాని హుందాను, స్థాయిని మరోమెట్టు పైకితీసుకువెళ్ళిన ఘనుడిగా శ్రీ రాజీవ్ రుజువు చేసుకున్నారు. పన్నెండు నెలల్లోనే జాతీయస్థాయిలో ఎదురులేని హీరోగా ఎదిగిన రాజీవ్ ప్రపంచ స్థాయిలోకూడా ఎవరికి తీసిపోనని నిరూపించుకున్నారు.

ఆయుధాల ఆధిక్యతతో సుస్థిరత కాదు. మున్ముందుకి రాదు అని నిర్ద్వంద్వంగా, నిక్కచ్చిగా ప్రకటించారు. ఆయుధపోటీ, ఆర్థిక సంక్షోభం పేదదేశాలకే ప్రమా

దంగా పరిణమించిందని స్పష్టంచేశారు. అలీనోద్యమ నాయకునిగా, తృతీయ ప్రపంచవాణిగా ప్రపంచంలోని పెద్ద ప్రజాస్వామ్య దేశనేతగా అన్నిటిని మించి శాంతి సంధాతగా ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో ఆయన ఇచ్చిన అనర్గళ ఉపన్యాసం అందరిలోను ఆలోచనలు రేకెత్తించింది. ఆయన వేదికదిగి నడిచి వెళ్ళు చున్నంతసేపు కరతాళధ్వనులతో జనరల్ అసెంబ్లీహాలు మార్మోగిపోయింది. శ్రీ రాజీవ్ ప్రపంచ సమస్యలను ప్రముఖంగా ప్రస్తావించబడడమే కాక వివిధ దేశాల నాయకులతో ఉపఖండం సమస్యపై ఆయన సమగ్రంగా చర్చలు జరిపారు. పాక్ నియంత జియాతో ఇస్లామిక్ బాంబ్ నిర్మాణ యత్నాలను, బంగ్లాదేశ్ అధ్య క్షుడుఎర్షాద్‌తో గంగాజలాల వివాదాన్ని, చైనా ప్రధాని జావోజియాంగ్‌తో సరిహద్దు తగాదాను, శ్రీలంక నేతతో తమిళుల సమస్యను క్షుణ్ణంగా చర్చించడానికి ఈ పర్య టన దోహదం చేసింది. అమెరికా అధ్యక్షుడు రీగన్‌తో కూడా అరమరికలు లేకుండా చర్చలు జరిపారు.

నెదర్లాండ్స్‌లో రాజీవ్ ఉన్నది కొన్నిగంటలే అయినా ఆదేశ ప్రధానితో జరిపిన సంభాషణలు ఇరుదేశాలమధ్య ఆర్థిక. వాణిజ్య సహకారంలో నూతన అధ్యా యానికి నాంది పలికాయి.

—o—

# ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ జాతీయ ఐక్యతాదిన ప్రసంగం

## న్యూఢిల్లీ బోటుక్లబ్బులో ఇచ్చిన తొలి ఉపన్యాసపాఠం నవంబర్ 19, 1984:

మంత్రివర్గసభ్యులారా. సోదరసోదరీమణులారా! ఈరోజు శ్రీమతి ఇందిరా గాంధీ పుట్టినరోజు. ఆమెమనమధ్యలేని పుట్టినరోజు, ఒకవ్యక్తి స్త్రీఅయినా, పురుషుడైనా మహోన్నతు లయినపుడు వారికిమృతి అంటుఉండదు. గాంధీజీ ఒకహంతకుని తుపాకి గుండుకు బలిఅయ్యారు. అయినా అదిమరణంకాదు. ఆయన ఆశయాలు, ఆదర్శాలు మనకుదారి చూపుతునేఉన్నాయి.

అదేవిధంగానే మూడువారాలక్రితం ఇందిరాజీని హత్యచేశారు. ఆమె మరణించ లేదు. ఆమె అమరజీవి. నేటికీఆమె ఆత్మ మనతోనే ఉంది. దేశానికిశక్తి సామర్థ్యాలను సమకూర్చుతు, మహాచైతన్యమై ముందుకు నడిపిస్తుంది. ఇందిరాజీలాంటి మహోన్నత స్థితికి చేరుకున్న ఏవ్యక్తి భౌతికశరీరానికి ఎక్కువ ప్రాముఖ్యం ఉండదు. ఆమె మహామనిషి ఆదర్శాలు. ఆశయాలు, సిద్ధాంతకార్యక్రమాలు, విధానాలేముఖ్య పాత్ర వహిస్తాయి. ఆమెమనదేశానికి అప్పగించిన వారసత్వసంపద గురించిమనం ఆలోచించాలి.

శ్రీమతి ఇందిరాగాంధీ 17సంవత్సరాలు ప్రధానిగా ఉన్నపుడు, అంతకు ముందు స్వాతంత్ర్య సంగ్రామసమయంలో జరిపినపోరాటాలు, ఎలాంటివో మనం చర్చించుకోవాలి.

మనదేశంసాధించిన అభివృద్ధిని, దానిగమనాన్ని, ఇతరదేశాలలో జరుగుతున్న దానితోపోల్చి చూసుకున్నప్పుడు మనదేశం ఏమిసాధించిందో అవగతమవుతుంది. ప్రపంచంలోని అనేకశక్తులు భారతదేశాన్ని కదిపివేయాలని ఎంతోప్రయత్నించాయి. ఇందిరాగాంధీ హత్యకేవలం ఒకవ్యక్తినిచంపడంకాదు. దేశాన్నివిచ్ఛిన్నం చేయ

డాయడానికి: జాతిఐక్యతను భగ్నంచేయడానికి పన్నినకుట్రఅది. మనలోమనం కొట్లాడుకోవాలని ఆకుట్రదారుల అభిలాష. కాని మహాత్మాగాంధీ, పండిట్ నెహ్రూ, ఇందిరాగాంధీ వేసినపునాదులు హంతకుల తుపాకిగుండ్లతో కూలిపోయేటంతటి బల హీనమైనవికావని మనం ప్రపంచానికి చాటిచెప్పాలి. మనదేశం వారితుపాకి తూటాల కన్నా శక్తివంతమైందని మనం ప్రపంచానికి రుజువు చేశాం. ఎంత తీవ్రమైనవత్తిడి వచ్చినా మనం మనస్థైర్యం కోల్పోమనికూడా నిరూపించాం.

మనదేశానికి స్వాతంత్రంవచ్చి 37ఏండ్లుగడిచాక మనది నిజమైన సర్వతంత్ర దేశమని మనం గర్వంగా చెప్పుకోగలుగుతున్నాం ఇతరదేశాల్లో ఎన్ని ఈవిధంగా చెప్పుకోగలవు? మనచుట్టుఉన్న ప్రపంచాన్నిచూడండి. మనపొరుగుదేశాలను, అభి వృద్ధి చెందుతున్నదేశాలను, ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఖండాల్లోని అనేకదేశాలను గమనించండి. అక్కడ ప్రజాస్వామ్యం సజీవంగా ఉన్నదేశాలు ఎన్నోకనిపించవు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు గల కొద్దిదేశాలల్లో మనభారతదేశంఒకటి, పండిట్ నెహ్రూ, ఇందిరాగాంధీల మహత్తరమైన కృషివల్లనే మనదేశం నేడుఈస్థాయికి చేరుకో గలిగింది. ఇప్పుడుమనం బయటనుంచివచ్చే ఏసవాల్ నైనా ఎదుర్కొనగల పటిష్ట మైన స్థితిలోఉన్నాం. నిజానికి ప్రతిఘటనాశక్తి కేవలం సైనికబలంమీదనేకాదు, సమైక్యప్రజాశ ధారపడుతుంది. అదేఅసలయిన మూలబలం.

ఇందిరాగాంధీ అశేషప్రజానీక శ్రేయస్సుకోసం అహరహం శ్రమించారు. అందుకోసం అనేకకార్యక్రమాలు అమలుపరిచారు. మనం ఆకార్యక్రమాలను ముందుకుతీసుకుపోవాలి. అందువల్ల ఒనకూరే ఫలితాలను ప్రతిఇంటికి, సక్రమంగా అందేటట్లుచూడాలి. హరిజనులకు, గిరిజనులకు, సమాజంలో వెనుకబడిన అన్ని వర్గాలకు మనం అమలు జరిపే పథకాలు పూర్తిగా ఉపయోగపడేట్లు జాగ్రత్త వహించాలి. ఇపుడుచేనేత కార్మికులను ఆదుకునేందుకు ప్రభుత్వ తీసుకొంటున్న చర్యలు అందులోభాగమే. చేనేతబట్టలకు మీటరుకు సబ్సిడి 2రూ॥లు ఇస్తున్నాం. బలహీనవర్గాల అభ్యున్నతికి చేయూతఇచ్చే 20సూత్రాల కార్యక్రమాన్ని మరింత దీక్షతో అమలుజరుపుతాం. ప్రభుత్వసంస్థల్లో పాలనావ్యవస్థలో, రాజకీయరంగంలో నీతి, నిజాయితీ, సమర్థత వర్ధిల్లేట్లుచూస్తాం.

మనం ఎదుర్కొంటున్న సమస్యలు ఎంతో జటిలమైనవి. ఆర్థికవనరులు తగి నంతగా లేవందువల్ల ఎన్నోమంచి కార్యక్రమాలను ఆచరణలో పెట్టలేకపోతున్నాం. కొన్నిసందర్భాల్లో నిధుల దుర్వినియోగం జరిగి బలహీనవర్గాలకు సహాయం అంద

లేదని మేము చాలావిచారించాం. అలాంటిఅవకతవలు, అక్రమాలు, ఇకమీద జరగ కుండా గట్టిచర్యలు తీసుకుంటాం, మనదేశాన్ని విచ్ఛిన్నంచేయాని, ల మనఐక మత్యాన్ని భగ్నంచేయాలని ఎవరుకంకణం కట్టుకున్నారో, మనదేశం దుర్బలం కావాలని ఎవరు కోరుకుంటున్నారో, ఇందిరాజీహత్య వెనకఉన్న ప్రచ్ఛన్నహస్తం ఎవరిదో మాకుతెలుసు. విదేశాల్లో స్థిరనివాసంఏర్పర్చుకున్న కొందరు మనదేశంలో అరాచకాన్ని సృష్టించడానికి ఏవిధంగా సహాయంఅందిస్తున్నది మీరు రోజూ పత్రి కల్లో చదువుతునే ఉన్నారు. ఇలాంటి దుష్టశక్తులు బలంపుంజుకోకుండా మేం జాగ్రత్తవహిస్తాం. వాటినిసమూలంగా ఏరివేసేందుకు సకలశక్తులను ధారబోస్తాం. ఈకర్తవ్యనిర్వహణలో ప్రజలందరి సహాయసహకారాలను అర్థిస్తున్నాం. మొదటమీరు మాకుశక్తిని ప్రసాదించాలి అతర్వాత ప్రశాంతంగాఉండి విధ్వంసక శక్తులను క్రమ శిక్షణతో ఎదిరించాలి. కోపంతో, ఉద్రేకంతో, ఆవేశంతో, ఏమిచేసినా దేశాన్ని విచ్ఛినంచేయడానికి ప్రయత్నించేమురాలకు తోడ్పడతాయి. ఈవిషయాన్ని అందరు గ్రహించాలి. ప్రస్తుతంఉన్న పునాదుల మీద మనసమిష్టిశక్తితో బ్రహ్మాండమైన సౌధాన్ని నిర్మించుకోవాలి.

ఇపుడు ఎక్కువవ్యవధిలేదు. దేశంకోసం, ప్రజలఅభ్యుదయం కోసం ఆత్మ బలిదానంచేసిన ఇందిరాగాంధీని మీమనస్సుల్లో సజీవమూర్తిగా ప్రతిష్టించుకోవాలని ఆమెఆశయాల సాధనకు ఉద్యమించాలని మీఅందరికీ విజ్ఞప్తిచేస్తున్నాను. ఆమెరక్త తర్పణం వృధాకాదు కారాదు. ఆమెదారుణహత్యకు ప్రతీకారంచేయాలి. అయితే ఆగ్రహావేశాలతో. ద్వేషభావంతోకాదు. కాకూడదు పటిష్టమైన: శక్తివంతమైన, సమైక్యభారత నిర్మాణమే సరైనప్రతీకారం అవుతుంది. ఇందిరాజీపవిత్రస్మృతికి అదేనిజమైన నీరాజనం అవుతుంది. ఇందిరాజీ హత్యానంతరం కల్లోలంచెలరేగింది. ప్రజలు కోపోద్రేకాలను అణచుకోలేక పోయారు. దీనితో దేశమేనంక్షుభితమైంది. ఒక మహావృక్షం పిడుగుపాటున కూలిపోయినప్పుడు భూమిదద్దరిల్లుతుంది. ఇప్పుడు అలాంటిదేజరిగింది. కాని త్వరలోనే ప్రజలు ఆఉద్రేకావస్థనుంచి కోలుకున్నారు. దేశంలో శాంతినెలకొన్నది. జాతిఐక్యతకు దాపురించిన ముప్పుతప్పింది. భారతదేశం నిజమైన ప్రజాస్వామ్యదేశమని, ఎలాంటిసంక్షోభం దాన్ని విచ్ఛిన్నంచేయజాలదని ప్రపంచంగుర్తించింది. ఒకఅగ్నిపరీక్షలోనెగ్గి మనప్రజాస్వామ్య వ్యవస్థనెగ్గిదేలింది,

ఈమహత్తరదేశాన్ని మనంమరింత శక్తివంతంగా రూపొందిస్తాం. ప్రగతి పథంలో ముందుకునడిపించి ఏసవాల్నైనా ఎదిరించి ముందుకుసాగిపోయేట్టు చేస్తాం. పండిట్నెహ్రూ, ఇందిరాగాంధీలు కలలుగన్న సమైక్య, సమృద్ధ భారతనిర్మాణానికి, దారిద్ర్యనిర్మూలనకు మేం అంకితమవుతాం.

అందరికీ ధన్యవాదాలు.

జైహింద్.

# రాజీవ్ పట్టాభిషేకం తెరవెనుక

అఖిలభారత వైద్య విజ్ఞానసంస్థలో హంతకుల తుపాకి గుళ్ళకు స్పృహ కోల్పోయిన శ్రీమతి ఇందిరాగాంధిని బ్రతికించడానికి డాక్టర్లు శాయశక్తులా కృషి చేసినారు. కాని ఆమె శరీరంలో పదిహేనుగుళ్ళుచొచ్చుకుపోవడం మూలాన బ్రతికే ఆశలు ఏమాత్రం లేవని తెలిపారు. ఆ సమయంలో హాస్పిటల్‌లో మరొకగదిలో క్యాబినెట్ మంత్రులు వేచియున్నారు. శ్రీమతి గాంధీ అనంతరం ప్రధానమంత్రి ఎవరు అనేప్రశ్న వాళ్ళలో అప్పుడే ఉదయించింది. తాత్కాలిక ప్రధానిగా ఎవరు వ్యవహరించాలి? ఆ తర్వాత ప్రధానిగా ఎవరిని ఎన్నుకోవాలి? ఆ స్థానాలు తమకు చెందాలని ధీమాగా అనగలిగిన వాళ్ళెవరూ ఆ సమయంలో ఢిల్లీలో లేరు. శ్రీ రాజీవ్ గాంధీ, ప్రణబ్ ముఖర్జీలు పశ్చిమ బెంగాల్‌లో పర్యటిస్తున్నారు. మూడవ స్థానంలో ఉన్న శ్రీ నరసింహారావు హైదరాబాదులో ఉన్నారు. రక్షణమంత్రి శ్రీ ఎస్. బి. చవాన్ మాస్కో వెళ్ళారు. రాష్ట్రపతి శ్రీ జయిల్‌సింగ్ కూడా విదేశీ పర్యటనలో ఉన్నారు.

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మరణించినప్పుడు, రాష్ట్రపతి డాక్టర్ రాధా కృష్ణన్ ఒక సంప్రదాయాన్ని నెలకొల్పారు. పాలకపార్టీ కొత్తనాయకుణ్ణి ఎన్నుకు నేంతవరకు క్యాబినెట్‌లో అందరికంటే సీనియర్ మంత్రి తాత్కాలిక ప్రధానిగా వ్యవహరిస్తారని శ్రీ రాధాకృష్ణన్ నిర్ణయించారు. ఆ ఉదంతాన్ని దృష్టాంతంగా తీసుకుని, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మరణించినప్పుడు కూడా అవిధానాన్నే అవలంబించడం జరిగింది. ఆ పద్ధతినే ఇప్పుడుకూడా ఆచరణలో పెట్టాలంటే, శ్రీ ప్రణబ్ ముఖర్జీని ప్రధానిగా నియమించాలి. ఆ పనిచెయ్యడమే సమంజసంగా ఉంటుందని కొంతమంది మంత్రులు వాదించారు. శ్రీ ప్రణబ్ రాజ్యసభ సభ్యుడు కాబట్టి ఆయ నకు తాత్కాలిక ప్రధానిగా నియమించడం సబబుగా ఉండదని మరికొందరు మంత్రులు అభిప్రాయం వెల్లడించారు. శ్రీ నరసింహారావు లోకసభ సభ్యుడు, వయ స్సులో శ్రీ ప్రణబ్‌కంటె పెద్దవాడు, పైగా ఆయన దక్షిణభారతానికి చెందినవాడు. కనుక ఆయనను ప్రధాని చేయడం ఉచితంగా ఉంటుందని ఒకమంత్రి వివరించారు.

ప్రధాని నియామకం విషయంలో చర్చలు ఆవిధంగా కొనసాగుతుండగా, రాజీవ్‌గాంధీ, శ్రీ నరసింహారావులు ఢిల్లీచేరుకుని, హాస్పిటల్‌కు వచ్చి ఆ చర్చలో పాల్గొన్నారు. అప్పటికి శ్రీ ప్రణబ్ ముఖర్జీనే ప్రధాని చేయాలని మంత్రులలో ఎక్కువమంది అభిప్రాయపడ్డారు. తాత్కాలిక ప్రధానిగా వ్యవహరించాలనే ఆసక్తి తనకు లేదని చెప్పి శ్రీ రాజీవ్ ఆ నిర్ణయాన్ని మంత్రులకే వదిలేశారు.

శ్రీమతి గాంధీ మంత్రివర్గంలో ఎరువుల శాఖా మంత్రిగా ఉన్న శ్రీ వసంత సాఠే ఆ సమయంలో ఒక కొత్త ప్రతిపాదన తెచ్చారు. తాత్కాలిక ప్రధానిని నియమించాల్సిన ఆగత్యంలేదని, వెంటనే శ్రీ రాజీవ్‌ని ప్రధానిగా ఎన్నుకోవడమే మంచిదని సూచించారు. శ్రీ నెహ్రూ, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మరణించినప్పుడు పరిస్థితులు వేరు ఆ సమయాల్లో అనేకమంది క్యాబినెట్ మంత్రులు ప్రధాని పదవికి పోటీగా వున్నారు.

తాత్కాలిక ప్రధానిని నియమించాల్సిన అవస్యకత అందువల్ల ఆ రోజుల్లో ఏర్పడింది. శ్రీ రాజీవ్ గాంధీని తర్వాత ఎలాగు పార్టీ ఎన్నుకుంటుంది. కనుక శ్రీ రాజీవ్‌గాంధీని ప్రధానమంత్రిగా నియమించడం సమంజసమని శ్రీ సాఠే వాదించారు. రాజ్యాంగానికి సంబంధించిన విషయాలలో శ్రీ సాఠే ఆరితేరిన వ్యక్తి. లోక్‌సభలో మెజారిటీకల పార్టీ ఎన్నుకున్న నాయకుణ్నే ప్రభుత్వం ఏర్పాటు చేయమని రాష్ట్రపతి ఆహ్వానించాలని భారత రాజ్యాంగంలో ఎక్కడా లేదు. తాత్కాలికంగా వ్యవహరించాల్సిన ప్రధానమంత్రి గురించి రాజ్యాంగంలో లేనేలేదు. రాజ్యాంగం 75 వ అధికరణ ప్రకారం "ప్రధాన మంత్రిని రాష్ట్రపతి నియమిస్తారు. ప్రధాని సలహాలననుసరించి ఇతర మంత్రులను కూడా రాష్ట్రపతి నియమిస్తారు. అని శ్రీ సాఠే వివరించి, తన వాదాన్ని సమర్థించుకొన్నారు. శ్రీమతి గాంధి మంత్రివర్గంలో కొంతకాలం న్యాయశాఖా మంత్రిపదవి నిర్వహించిన శ్రీ శివశంకర్, శ్రీ సాఠే వాదాన్ని బలపరిచారు. రాజీవ్‌ని నమ్ముకుంటేనే ముక్తిమోక్షం ఉంటాయనే అభిప్రాయం మంత్రులకు, కాంగ్రెస్ (ఐ) నాయకులకు ఏర్పడింది. పార్టీలో ఇతరులందరికంటే జనాన్ని ఆకర్షించగల శక్తి ఆయనకేవుంది. శ్రీమతి గాంధీ దారుణహత్యకారణంగా దేశవ్యాప్తంగా ప్రజలు సానుభూతి చూపించారు. ఓట్లు సంపాదించడంలో అందెవేసిన నెహ్రూ కుటుంబానికి చెందిన వాడవడం శ్రీ రాజీవ్‌కొక అర్హత. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మనుమడు, శ్రీమతి ఇందిరాగాంధీ కొడుకైన శ్రీ రాజీవ్



(విమాన చోదకుడు (పైలెట్)
భారత ప్రధాన మంత్రి శ్రీరాజీవ్‌గాంధీ



1984 అక్టోబరు 31వ తేదీన భారత దేశపు ఆరవ ప్రధాని
శ్రీ రాజీవ్‌గాంధీని ప్రమాణ స్వీకారం చేయిస్తున్న రాష్ట్రపతి.



The Prime Minister, Shri Rajiv Gandhi and Smt. Sonia Gandhi with the President of Srî Lanka, Mr. J.R. Jayewardene and Mrs. Jayewardene when they called on them in colombo on July 29, 1987.



బోట్స్వానా అధ్యక్షుడు మసైర్, మొజాంబిక్ అధ్యక్షుడు సమోరా
మెషెల్‌లతో ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ



వాంకోవర్ కామన్వెల్త్ సభలకు బయలుదేరిన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి
టోక్యోలో ఆగినప్పుడు జపాన్ ప్రధాని యాసుహిరో నకసోనేతో
ఇష్టాగోష్ఠి చర్చలు జరుపుమన్న దృశ్యము.

గాంధీ ఎన్నిక తరాలవారీగా పరిపాలన అవిచ్ఛిన్నంగా కొనసాగ గలదని ప్రజలు విశ్వసించారు.

ప్రధాని ఎవరని చర్చలు జరిగిన సమయంలో ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ కూడా శ్రీ రాజీవ్ పక్షాన్నే మాట్లాడారు. ముందు తాత్కాలిక ప్రధాని, ఆ తర్వాత శాశ్వత ప్రధాని అనే ప్రశ్న ఉండకూడదని అనుకున్నారు. రాష్ట్రపతికి ఆ సమాచారాన్ని ఎలా వ్రాసి తెలియచేయాలా అనే విషయం ఒక్కటి మిగిలింది. పార్టీ జనరల్ సెక్రటరీ శ్రీ జి. మూపనార్‌కు ఆ పనిని అప్పగించారు. కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీబోర్డు శ్రీ రాజీవ్‌గాంధీని నాయకుడుగా ఎన్నుకున్నారని, ఆ నిర్ణయాన్ని కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీ పార్టీ ధృవపరచిందని రాష్ట్రపతికి రాసిన లేఖలో పేర్కొన్నారు. అయితే పార్లమెంటరీ బోర్డు నిర్ణయం తీసుకున్నప్పుడు శ్రీ ప్రణబ్, శ్రీ నరసింహారావు లిద్దరు మాత్రమే హాజరయ్యారు.

ఆ సమయంలో శ్రీ రాజీవ్‌గాంధీ సన్నిహితులు పట్టుదలతో పనిచేశారు. శ్రీ అరుణ్‌నెహ్రూ చాల చురుకుగా వ్యవహరించారు. స్వర్గీయ సంజయ్‌గాంధీకి ఆప్త మిత్రుడైన శ్రీ కమల్‌నాథ్ కూడా శ్రీ రాజీవ్‌కోసం శ్రమపడ్డారు. వేరే ఎవరైనా తాత్కాలిక ప్రధానిగా నియమితులైతే ఆ వ్యక్తి తన హోదాను ఉపయోగించి తిమ్మిని బమ్మిచేసి ఆ తర్వాత కూడా ప్రధాని పదవి నాక్రమించేస్తాడని వాళ్ళ భయం. ఎన్నికలు రానున్న తరుణంలో ప్రధానుల మార్పిడి వాంఛనీయం కాదని వాళ్ళకు తెలుసు. రాష్ట్రపతి విదేశ పర్యటన నుంచి ఢిల్లీకి ఇంకా తిరిగిరాలేదు. శ్రీ రాజీవ్‌ను ఎన్నుకున్నట్లు రాసిన లేఖ ఆ లోపుగానే శ్రీ మూపనార్ రాష్ట్రపతి భవన్‌కు పంపారు. ఆ లేఖతోపాటు రాష్ట్రపతి భవన్‌లో శ్రీ రాజీవ్, ప్రణబ్ ముఖర్జీ, పి. వి. నరసింహారావు, బూటాసింగ్, లోక్‌సభ స్పీకర్ శ్రీ జక్కర్ రాష్ట్రపతి రాకకు ఎదురు చూచారు. దేశానికి తిరిగి రాగానే రాష్ట్రపతి నేరుగా అఖిలభారత వైద్య విజ్ఞాన సంస్థకు వెళ్ళి, సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో రాష్ట్రపతి భవన్‌కు చేరుకున్నారు.

శ్రీ రాజీవ్‌ని నాయకుడుగా ఎన్నుకున్నట్టు రాష్ట్రపతి భవన్ చేరకముందే ఆయనకు తెలుసు. శ్రీమతి గాంధీ పర్సనల్ అసిస్టెంటు ఆర్. కె. ధావన్, అరుణ్ నెహ్రూలు శ్రీ జెయిల్‌సింగ్‌ను ఢిల్లీ విమానాశ్రయంలో కలుసుకుని ఆ సంగతి తెలి

పారు. రాష్ట్రపతి భవన్‌లో శ్రీ జయిల్‌సింగ్‌కు రాజ్యాంగ సూత్రాలేమిటో సాతే తెలిపారు. కాంగ్రెస్ (ఐ) పార్టీ నుంచీ లేఖకూడా వచ్చింది. కాబట్టి శ్రీ రాజీవ్‌చేత ప్రమాణస్వీకారం చేయించడం మినహా వేరేమార్గం లేకపోయింది. రాష్ట్రపతి నలభై అయిదు నిమిషాల వ్యవధిలో శ్రీ రాజీవ్ చేతనే కాకుండా, ప్రణబ్, నరసింహారావు, శివశంకర్, బూటాసింగ్‌ల చేత కూడా రాష్ట్రపతి ప్రమాణస్వీకారాలు ముగించారు. శ్రీ రాజీవ్‌గాంధీ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అంతా సవ్యంగా జరిగిపోయింది. శ్రీ రాజీవ్ ఎన్నికపట్ల అసమ్మతి లేకపోలేదు. కాని అగ్రనాయకులందరు ఏకగ్రీవంగా ఒక వ్యక్తిని నాయకుడుగా నిర్ణయించలేకపోయారు. శ్రీ రాజీవ్‌గాంధీతో పోటీపడే నాయకులు లేకపోవడం, ఆయనకు మరింత కలిసొచ్చింది. మంత్రివర్గంలో పెద్ద మార్పులేమీ చేయకుండా పాత మంత్రులనే తిరిగి తన మంత్రివర్గంలో శ్రీ రాజీవ్ చేర్చుకున్నారు. ఎన్నికల తరువాత మంత్రివర్గంలో కొత్త వాళ్ళకు అవకాశమవ్వాలని రాజీవ్ సంకల్పము. శ్రీమతి గాంధీ హత్య జరిగిన రోజునే సాయంత్రము ఆరుగంటలకు కాంగ్రె పార్లమెంటరీ పార్టీ ఉపనాయకుడు శ్రీ ఎన్. జి. రంగా, సెక్రటరీ శ్రీ మూల్‌చంద్‌డాగా ఎవరిని సంప్రదించకుండానే పార్టీ సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశానికి 50 మంది సభ్యులు హాజరయ్యారు. ఆ సమావేశంలో శ్రీమతి గాంధీ మృతికి సంతాప తీర్మానాన్ని ఆమోదించడం మినహా మిగతా విషయాలేవి చర్చించలేదు.

## జెట్ స్పీడులో ప్రధాని కార్యసరళి

భారత ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ, ఊపిరిసలపనంత పనితో సతమతమవుతు తన కుటుంబసభ్యులతో గడిపేది రోజుకు రెండు మూడుగంటలే. ఒక పక్క రాజకీయాల చిక్కుముడులు మరోపక్క వైళ్ళ పద్మవ్యూహం ఈ వలయాల మధ్య మనస్సు పొరల్లో తారాడే దౌత్య విషయాలు ఇంకా ఇలాంటివే ఎన్నో.

కాశ్మీరునుండి కన్యాకుమారివరకు వ్యాపించిన సువిశాలదేశంలో ప్రతి సంఘటనకు ప్రతిస్పందించవలసిన శ్రీ రాజీవ్‌గాంధీ దినచర్య జెట్ స్పీడులో ఉంటుంది.

ప్రస్తుత భారత ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ కార్యసరళి మారిపోయింది. కొన్ని విషయాల్లో ఆయనకు శ్రీమతి ఇందిరాగాంధీకి సారూప్యంఉంది. ఆమె రోజుకు పద్నాలుగునుంచి పద్దెహారుగంటలపాటు పనిచేశారు. శ్రీ రాజీవ్‌గాంధీ కూడా

రమారమి ఇన్నిగంటలే శ్రమిస్తున్నప్పటికి బాధ్యతలభారంలో అప్పటికి, ఇప్పటికి ఎంతో తేడాఉంది. 1984 చివర్లో జరిగిన విషాదసంఘటన వలఛాయలు ప్రధాని కార్యక్రమములపైన ఆయన సచివాలయంమీద అలుముకున్నాయి. ప్రధానికి భద్రతా ఏర్పాట్లు భారీగా చేయవలసి వచ్చింది. ఆయన నివాసం రేసుకోర్సురోడ్డుకు మారింది. అదో చిన్న ప్రపంచం,

ప్రధాని పిల్లలు రాహుల్, ప్రియాంకలు భద్రతా సంబంధమైన కారణాలవల్ల స్కూలుకువెళ్ళడం మానుకోవలసివచ్చింది. రేసుకోర్సుప్రాంగణంలోనే వారిద్దరికి ప్రత్యేకంగా చదువుచెప్పిస్తున్నారు. గట్టిభద్రతాఏర్పాట్లు ఉంటేగాని వారిద్దరూ బయట కెళ్ళి తమ స్నేహితులను కలవడానికి వీలులేదు.

ఆదివారమే ప్రధానికి కొంచెం ఆటవిడుపు. అప్పుడప్పుడు ఆయన మెహ్రౌలీలోని తనతల్లి వ్యవసాయక్షేత్రానికి కుటుంబసమేతంగా వెళుతుంటారు. నగర శివారులో ఉన్న ఈ ప్రాంతానికి ఆయన ఒక్కొసారి స్వయంగా జీపునడుపుకుంటూ వెళ్తారు. వెనుక ఒక సెక్యూరిటీకారు మాత్రమేఉంటుంది. ఉదయం ఏడుగంటలకు ప్రారంభమయ్యే ఆయన దినచర్యలో టీ తర్వాత స్థానం దినపత్రికలదే. ఆతర్వాత అధికారిక కార్యకలాపాల్లో ఆయన నిమగ్నమైపోతారు. తననుకలుసుకోవడానికివచ్చే సామాన్యులతో మూడురోజులకొకసారి ముచ్చటిస్తారు. వారు ఏకరువు పెట్టే విషయాలను ప్రధాని ఓపికగా వింటారు. కార్యదర్శులు వాటిని రాసుకొంటారు.

ప్రధాని పనిభారంలో అధికభాగాన్ని ఆయన పార్లమెంటరీ కార్యదర్శి, శ్రీ అరుణ్‌సింగ్ మోస్తారు. ప్రధాని భద్రతా ఏర్పాట్లను పర్యవేక్షించడమేగాక ఇతర కీలక విషయాలను కూడా శ్రీ అరుణ్ చూసుకొంటారు.

## రాజీవ్ జోస్యం ఫలించినవేళ

అత్యధిక మెజారిటీతో తమపార్టీ ఘన విజయం సాధిస్తుందని ప్రధాని శ్రీరాజీవ్ రత్న గాంధీ అన్న మాటలు అక్షరాలా నిజమైంది. కర్నాటకలో ఎన్నికలప్రచారాన్ని ముగించుకొని వచ్చినప్పుడు విలేకరులతో మాట్లాడుతూ ఆయన పై విధంగా దృఢ విశ్వాసం వ్యక్తంచేసారు. కర్నాటకలోకూడా తమపార్టీ విజయావకాశాలు మెరుగుగా ఉన్నాయని కూడా అన్నారు, శ్రీ రాజీవ్‌గాంధీ మాట పొల్లుపోలేదు.

## రాజీవ్ గాంధీ రత్నకు ప్రజల అండ

1984 వ సంవత్సరములో భారతజాతి అనేక అగ్ని పరీక్షలు తట్టుకుని నిల్చింది. పంజాబ్‌లో సైనిక చర్య అనంతరం సైన్యంలో అంతర్యుద్ధం వస్తుందన్న అంచనాలను శ్రీమతిగాంధీ హత్య తర్వాత దేశం ముక్కచెక్కలయి పోతుందన్న భయాలను భారతజాతి వమ్ముచేసింది. లోకసభ ఎన్నికల్లో పరస్పరం కొట్లాడు కుంటున్న ప్రతిపక్షాలను చిత్తుచేసి యువకుడైన రాజీవ్‌గాంధీ నేతృత్వంలోని కాంగ్రెస్‌పార్టీకి జాతిపట్టం కట్టింది. లోక్‌సభలో నాలుగువందల సీట్లు ఇచ్చి కాంగ్రెస్ పార్టీకి ప్రజలు అప్రతిహత అధికారాన్ని కట్టబెట్టారు. ప్రజల బాధ్యతను ప్రజలు సక్రమంగా నిర్వహించారు. ఇక నాయకులు పార్టీలు తమవిధి నిర్వహణ సక్రమంగా చేయాల్సివుంది.

దేశాన్ని ప్రధానంగా వేధిస్తున్న రాజకీయ సమస్యలు రెండు (1) పంజాబ్ సమస్య (2) అస్సాం సమస్య.

## రాజీవ్‌గాంధీ నూతన మంత్రివర్గం

శ్రీరాజీవ్‌గాంధీ డిసంబర్ 28 సాయంత్రం ఎన్నికల ఫలితాలు బయటకు రావడం ప్రారంభమైన 72 గంటల వ్యవధిలో తన మంత్రివర్గం జాబితాను రూపొం చారు. ఏర్పాటు చేయనున్న నూతన ప్రభుత్వం గురించి స్పష్టమైన అవగాహన లేనిదే ఇంతవేగంగా మంత్రివర్గ నిర్మాణంపై నిర్ణయం తీసుకోవడం సాధ్యంకాదు. అంటే తీవ్రమైన ఎన్నికల ప్రచార కార్యక్రమంలో పాల్గొంటూనే ఆయన ఇదే విషయంపై తనదృష్టిని కేంద్రీకరించారు. నూతన మంత్రిమండలితోసహా డిసంబర్ 31న ప్రమాణస్వీకారం చేస్తారన్న వార్తలు వెలువడినవి.

ఎన్నికల్లో గెలిచిన అనేక మంది పార్లమెంటు సభ్యులు డిసంబర్ 29 సాయంత్రానికే ఢిల్లీచేరి శ్రీ రాజీవ్‌గాంధీతో పైరవీలు జరిపేందుకు ప్రయత్నించారు. అయితే ఆయన మర్యాదపూర్వకంగానే వారితో ఇంటర్వ్యూలు నిరాకరించారు. కొత్త మంత్రిమండలి ఏర్పాటుపై రాజీవ్, తన అభిప్రాయాలు రాజకీయ సహచరులెవ్వరితో సంప్రదించినట్లు కనబడలేదు. ఈ విషయంలో ఆయన తన పర్సనల్ కార్యదర్శి పి. సి. అలెగ్జాండర్, విధాన నిర్ణాయక కమిటీ చైర్మన్ జి. పార్థసారథిల సూచనలను పరిగణనలోనికి రాజీవ్‌గాంధీ తీసుకున్నారు. నూతన మంత్రివర్గంలోకి ఎవరిని తీసు

కుంటారు. ఎవరెవర్ని తొలగిస్తారు అన్న విషయం తెలుసుకునేందుకు చివరి నిమిషం దాకా అంతా ఉత్కంఠతతో ఎదురుచూశారు. అయితే కొత్త మంత్రిమండలిలో రాజీవ్ చేసిన మార్పులు రాజకీయ పరిశీలకులకు అంత ఆశ్చర్యం కలిగించలేదు. కె. సి. పంత్‌కు మంత్రిపదవి లభించడం, ప్రణబ్, ఘనిఖాన్ చౌదరీలను తొలగించడం లాంటి పరిణామాలను కొందరు ముందే వూహించారు. యువనాయకత్వంలో, పటిష్ఠ మైన పథకంతో అన్ని విషయాలను విస్తృతంగా పరిశీలించి నిర్ణయం తీసుకున్నా, ఏదో ఒక విధంగా రాజకీయ నాయకులు వాటిని ప్రభావితం చేయగలరని ప్రమాణ స్వీకారం సందర్భంగా రుజువైంది.

పంజాబ్ సమస్యకు ప్రాధాన్యం ఇవ్వడం, పేదరికం నిర్మూలనకు, నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కృషి చేయడం తమ ప్రభుత్వ కర్తవ్యమని రాజీవ్‌గాంధీ ప్రకటించారు. అలాగే ఆర్థిక విధానాలను సులభతరం చేయడం ద్వారా దేశ ప్రగతికి కృషి చేస్తామని రాజీవ్ హామీ ఇచ్చారు. ఇది దృష్టిలోనుంచుకొనే ఆయన తన మంత్రి వర్గం జాబితాను రూపొందించారు.

ఒకవైపు ఎన్నికల ఫలితాలు పూర్తిగా రాకముందే రాజీవ్‌గాంధీ ఆర్థిక వ్యవహారాల సలహా సంఘం చైర్మన్ సుఖమో చక్రవర్తి, డాక్టర్ కె. ఎస్. రాజ్‌లతో సమావేశమై ఆర్థికరంగానికి సంబంధించి తమ సిఫార్సులను సాధ్యమైనంత త్వరలో అందించమని వారిని కోరారు. అలాగే ప్రభుత్వరంగ పరిశ్రమలపై అరుణన్ సేన్ గుప్తా నాయకత్వంలోని సంఘం చేసిన సిఫార్సులను, ఎగుమతి దిగుమతులపై ఆబిద్ హుసేన్ కమిటీ సమర్పించిన నివేదికను కూడా రాజీవ్‌గాంధీ పరిశీలించారు. కేంద్ర ఆడిటర్ జనరల్ గ్యాని ప్రకాశ్‌లను కూడా ఆర్థికవిషయాలపై రాజీవ్‌గాంధీ సంప్రదించారు.

## తుఫాన్ బాధితులకు సహాయం

ఆంధ్రప్రదేశ్‌లో తుఫాన్‌వల్ల దెబ్బతిన్న ప్రాంతాలను ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ వెంటనే సందర్శించి తక్షణ సహాయంగా ప్రధానమంత్రి సహాయనిధి నుండి ఏడుకోట్ల రూపాయలు ప్రకటించారు.

—o—

# భారత యువ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ

శ్రీ రాజీవ్‌గాంధీ భారత తొలి ప్రధాని శ్రీ పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ మనుమడు. ఆకారణంగా ఆయన బాల్యం ప్రధాని నివాసంలోనే గడిచింది. పట్టుదలకు ప్రతిరూపమైన ఇందిరాగాంధీకి, సద్గుణములకు ప్రతిరూపమైన ఫిరోజ్‌గాంధీకి 1944 వ సంవత్సరము అతిలోక సుందరమైన ఆగష్టు 20వ తేదీన జన్మించిన భానుకిరణ సంవర్కమయుడే శ్రీ రాజీవ్‌గాంధీ. ఆయన ఒక జంటయొక్క పుణ్యఫలమే గాదు, ఒక జాతియొక్క తపఃఫలము.

జాబిల్లికి మచ్చగలదు గాని శ్రీ రాజీవ్‌గాంధీకి మచ్చలేదని జగజగాలు కీర్తించడం భారతజాతికి నిజంగా గర్వకారణం.

ఆస్తులనే కాక, అసువులను సైతం దేశానికి అర్పించిన సద్వంశమది. శక్తియుక్తులనే కాక జాతి సమైక్యత కొరకై ప్రాణాన్ని బలిచేసిన ఆదర్శకుటుంబమది. సర్వరంగాలలోను తల్లినిమించిన తనయుడు హరివిల్లు. హరితధవళ పరిపూర్ణమయుడు, ఋజుప్రవర్తనలో నిత్యప్రసన్నుడు ఆయన. హృదయం వెన్నపూస, వాక్కు పుట్టతేనె, రూపం బంగరువెన్నెల, రాజీవ్‌గాంధీ శరీరవర్ణం మేలిమిబంగరు మరపించు పసిడివర్ణం. మృదువాత్సల్య దరస్మిత వదనం. కాంతివంతములగు నేత్రములు, లలితములైన చెక్కిళ్ళు, పెదవులపై విదియనాటి చంద్రునివంటి చిరునగవుకల చిరంజీవి. ఆలోచనాన్వితమైన బల్లపరుపు నుదురు. ఉక్కులాంటి దృఢత్వం, వర్చస్సు, పసిడివంటి లక్షణములుగల నవ్యపుష్పము, వెన్నెలచిందు, కన్నులవిందు యువనాయకులకు వెన్నెముక, పునాది. రాజకీయ సాగరంలో దొరికిన రత్నాలలో అపురూప రత్నం శ్రీ రాజీవ్‌గాంధీ. మానవాళి సేవయే ఆయనకు ఆనందదాయకం. అభివృద్ధియే ఆయనలక్ష్యం. అభ్యుదయమే ఆయన ధ్యేయము. ప్రపంచ దేశాలమధ్య విశిష్ట సంస్కృతి వారసత్వానికి విజ్ఞానవారధి. నిగ్రహానుగ్రహ సమర్థుడు. జాతి భావిభారత అమూల్య సంపద, ఆశ్రిత కల్పతరువు, పరిపాలనాదక్షుడు, నిగర్వి.

ఢిల్లీలోని సెంట్ కొలంబస్ పాఠశాలలో విద్యాభ్యాసం చేసి తరువాత డెహ్రా డూన్‌లో డూన్ పాఠశాలలో చదివారు. ఉన్నత విద్యాభ్యాసంకోసం ఇంగ్లాండుకు వెళ్ళారు. పైలెట్ కావాలన్నది ఆయన నాటికోరిక. న్యూఢిల్లీలోని 'సఫ్దర్‌జంగ్ ఫ్లయింగ్ క్లబ్ వద్ద శిక్షణపొందిన అనంతరం ఆయనకు కమర్షియల్ పైలెట్ లైసెన్స్ లభించింది. ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో కో-పైలెట్‌గా పనిచేశారు.

1980 లో రాజకీయాలలోకి ప్రవేశించారు. సోదరుడు శ్రీ సంజయ్‌గాంధీ మరణించిన తరువాత రాజకీయాలలో ప్రవేశించారు. 1981లో ఉద్యోగానికి రాజీనామా చేశారు. 1981 మే, 10వ తేదీన తాను రాజకీయాలలో ప్రవేశించ దలచినట్లు శ్రీ రాజీవ్‌గాంధీ ప్రకటించారు.

ఇటలీవనిత సోనియాగాంధీని వివాహం చేసుకొన్నారు. ప్రియాంక, రాహుల్ ఇద్దరు సంతానం,

అమేథి నియోజకవర్గంనుండి లోకసభకు జరిగిన ఉప ఎన్నికల్లో పోటీ చేయుడానికి నామినేషన్ చేశారు. చిన్న సోదరుడు శ్రీ సంజయ్‌గాంధీ మృతి కారణంగా ఆ స్థానంకు ఖాళీ ఏర్పడింది. అమెథి నియోజక వర్గంనుంచి 2,37,000 ఓట్లు మెజారిటీతో 1981 లో అమెథి (ఉత్తరప్రదేశ్) నియోజకవర్గం నుంచి జరిగిన ఉప ఎన్నికల్లో లోకసభకు శ్రీ రాజీవ్‌గాంధీ ఎన్నికయ్యారు. కాంగ్రెస్ పార్టీలోని అన్ని వర్గాలవారు ఆయన విజయానికి హర్షం వ్యక్తపరిచారు.

పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయిన తరువాత పార్టీ వ్యవహారాలలో ఆసక్తి చూపుతూ చురుకుగా పని చేశారు.

విమాన చోదకుడు (పైలెట్) గా పని చేసిన శ్రీ రాజీవ్‌గాంధీ 1983 ఫిబ్రవరి 2వ తేదీన కాంగ్రెస్ (ఐ) ప్రధాన కార్యదర్శి బాధ్యతలను స్వీకరించారు. మృదుభాషి కలిసికట్టుగా పనిచేస్తారు. కొద్దికాలంలోనే పెద్దమంది ఆదరణపొందిన అదర్శ యువనేత, మెరుపుతీగ యెదలోని కాంతిరేఖవలె మెరసిపోతున్నారు.

ప్రధానిగా పదవీ బాధ్యతలు చేపట్టిన తర్వాత మొట్టమొదటి సారిగా శ్రీ రాజీవ్ గాంధీ సౌత్‌బ్లాకులోని ప్రధానమంత్రి కార్యాలయానికి హాజరయ్యారు. శ్రీ రాజీవ్ ఉదయం సుమారు 10-30 గంటలకు కారులో ఆఫీసుకు వెళ్ళారు. 16 ఏళ్ళకు పైగా ప్రధానిగా ఉన్న శ్రీమతి ఇందిరాగాంధీ కూడా ఇదే కార్యాలయంలో పని

చేశారు. నూతన ప్రధాని రాజీవ్‌గాంధీకి ఆయన ప్రిన్సిపల్ సెక్రటరీ శ్రీ పి. సి. అలెగ్జాండర్ స్వాగతం పలికి కార్యాలయంలోనికి తీసుకుపోయారు. నూతన ప్రధాని కొన్ని ఫైళ్ళను, కాగితాలను చూశారు.

రాజీవ్‌రత్న ఎప్పటిలాగే మామూలుగా తెల్లలాల్చీ, పైజామా వేసుకొని కాలువా తవ్వకుని తన సన్నిహితులైన అరుణ్‌నెహ్రూ, అరుణ్‌సింగ్‌లు వెంటరాగా ఆఫీసుకు చేరుకున్నారు. మొట్టమొదటిరోజు కార్యాలయానికి వచ్చినపుడు తీరుబడి లేకుండా శ్రీ రాజీవ్‌గాంధీ కన్పించారు. 1984 అక్టోబరు 31వ తేదీన శ్రీమతి గాంధీ హత్య జరిగిన కొన్ని గంటల్లోనే భారతదేశపు ఆరవ ప్రధానిగా పదవీ బాధ్యతలు చేపట్టిన రాజీవ్‌గాంధీ ఇన్నిరోజులు సఫ్దర్‌జంగ్ రోడ్డులోని తమ ఇంటి వద్దనుంచే ఫైళ్ళు, దేశవ్యవహారాలు చూసారు. ముఖ్యమైన ఫైలుచూచి, ఆఫీసులో కొంతసేపు గడిపిన తర్వాత ఆయన ఇతర కార్యక్రమాల్లోకూడా పాల్గొన్నారు. అక్బర్‌రోడ్డులో ఉన్న ఇందిరా కాంగ్రెస్ ప్రధానకార్యాలయానికి వెళ్ళి అక్కడ కొంతసేపు ఉన్నారు. తర్వాత రాష్ట్రపతి భవన్‌కు వెళ్ళి అక్కడ నలుగురు జూనియర్ మంత్రుల పదవీ స్వీకార కార్యక్రమంలో పాల్గొన్నారు.

—o—

# ఇందిర హత్యపై రష్యా టీ. విలో
# 18 నిమిషాల వార్తా ప్రసారం

మాస్కో:- శ్రీమతి ఇందిరాగాంధీ దారుణ హత్య వార్తను నూతన ప్రధానిగా శ్రీ రాజీవ్‌గాంధీ ప్రమాణస్వీకారాన్ని రష్యా టెలివిజన్‌లో విస్తృతంగా ప్రసారం చేశారు. 'నెహూరి' పేరిటగల వార్తాప్రసార కార్యక్రమంలో అఖిలభారత వైద్య విజ్ఞాన సంస్థ ఆసుపత్రి బయట శ్రీమతి ఇందిరాగాంధీ మరణవార్తను చాటే పెద్ద బోర్డును రోదిస్తున్న జనసందోహాన్ని చూపారు. కొత్త ప్రధానిగా శ్రీ రాజీవ్‌గాంధీ చేత రాష్ట్రపతి శ్రీ జయిల్ సింగ్ ప్రమాణస్వీకారం చేయించిన దృశ్యాన్ని కూడా చూపించారు.

శ్రీమతి ఇందిరాగాంధీ వార్తను (హత్య) ప్రకటించిన వెనువెంటనే కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శిగా కానిస్టాంటిన్ చెర్నెంకో శ్రీ రాజీవ్‌గాంధీకి రష్యా (పి. సి. యమ్) మంత్రివర్గం రాష్ట్రపతి శ్రీ జయిల్‌సింగ్‌కు పంపిన సంతాప సందేశాలను చదివారు. అనంతరం శ్రీమతి ఇందిరాగాంధి జీవిత విశేషాలను వివరించారు. శ్రీమతి ఇందిరాగాంధీ హత్య వెనుక ముందుగా పథకం ప్రకారం కుట్ర రూపొందిందనీ ఆమెను తుద ముట్టించ దలచిన దుండగులు తమ మనుష్యులని ప్రధాని సెక్యూరిటీ వ్యవస్థలో రహస్యంగా ప్రవేశపెట్టారని భారత గూఢచారి వ్యవస్థకు చెందిన అధికారులు భారతీయ వార్తా సంస్థలకు వివరించడాన్ని కూడా రష్యా టి. వి లో చూపారు. శ్రీమతి ఇందిరాగాంధీ హత్యకు సంబంధించిన వార్తాప్రసారం రష్యా టెలివిజన్‌లో 18 నిమిషాలపాటు సాగింది.

## తీరిక చిక్కని రాజీవ్‌గాంధీ

నూతన ఆంగ్ల సంవత్సరాది సందర్భంగా శుభాకాంక్షలు తెలిపేందుకై వచ్చిన అధికార ప్రముఖులను కలుసుకోవడంతో ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ పూర్తిగా నిమగ్నులైనారు. ఉదయంనుండి నూతన మంత్రులు, కొత్త పార్లమెంటు సభ్యులు, అధి

కారులు, ప్రముఖులు, వివిధరంగాల ప్రముఖులు శ్రీ రాజీవ్‌గాంధీని ఆయన నివాస గృహంలో కలుసుకొని శుభాభి వందనలు తెలిపారు.

మధ్యాహ్నం తమిళనాడు మంత్రివర్గం, ఉత్తరప్రదేశ్, అస్సాం గవర్నర్లు, మిజోరం, హర్యానా, రాజస్తాన్, హిమాచల్‌ప్రదేశ్, బీహార్, జమ్మూ-కాశ్మీర్, మహారాష్ట్ర, గోవా ముఖ్యమంత్రులు వేర్వేరుగా కలుసుకున్నారు.

కొంతసేపు రాష్ట్రపతిభవన్‌లో జరిగిన సహాయమంత్రులు శ్రీ చందూలాల్ చంద్రాకర్, శ్రీపి.ఏ. సంగ్మా ప్రమాణస్వీకారోత్సవానికి హాజరైనారు. రాజధానిలో వీరులేనందున ఇతర కేంద్ర మంత్రులతోపాటు ప్రమాణస్వీకారం చేయలేక పోయారు.

కేంద్ర మంత్రిత్వ శాఖలను. ఇతరప్రభుత్వ శాఖలను. క్రమబద్ధం చేయాలని శ్రీ రాజీవ్‌గాంధీ యోచిస్తున్నట్లు తెలిసింది. దీనిలో భాగంగా ఉన్నతాధి కార స్థాయిలో మార్పులు జరిగెనవి.

తమిళనాడు మంత్రివర్గంతోపాటు విదేశాంగ మంత్రిత్వ శాఖలోని విధానాల రూపకల్పన కమిటి చైర్మన్ శ్రీ జి పార్థసారధి కూడా శ్రీ రాజీవ్‌ను కలుసుకున్నారు.

## రాజీవ్ గుండె నిబ్బరం

శ్రీ రాజీవ్‌గాంధీ గుండె నిబ్బరం గల భీశాలి. వ్యక్తిగత జీవితంలో అత్యంత విషాదకరమైన సంఘటన సంభవించిన తరుణంలో దేశం సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితిలో ప్రధానమంత్రిగా శ్రీ రాజీవ్‌గాంధీ చూపిన ధైర్యం, రాజకీయ నాయకులను, వ్యాఖ్యాతలను ముగ్ధులను చేసింది. ఉన్నత స్థానాన్ని అధిష్ఠించిన శ్రీ రాజీవ్‌గాంధీ భారత భవిష్యత్తుకు రథసారధి వంటివారు.

భారత ప్రధాని అనేక సమస్యలను ఎదుర్కొన్నారు. ఎంతో గుండెనిబ్బరంతో తన తల్లి మరణవార్తను అందుకున్నతీరు - ప్రధానిగా ప్రమాణస్వీకారం చేసిన కొద్ది గంటలకే టెలివిజన్‌లో దేశ ప్రజల కిచ్చిన పిలుపు ఆయన మనో ధైర్యానికి దుజువు మార్గంపట్టిది.

అల్లర్లను అరికట్టడంలో అత్యంత కఠినంగా వ్యవహరించారు: ఆయన అంతేగాక నూతన ప్రధాన మంత్రిగా శ్రీ రాజీవ్‌గాంధీ సైన్యాన్ని రంగంలోదింపటం

ముఖ్యమంత్రులందరిని తక్షణం తమ తమ రాష్ట్రాలకు వెళ్ళాలని ఆదేశించిన ఆదర్శ మూర్తి. ఇటువంటి చర్యలు తీసుకోవడంలో చూస్తే తల్లి మెళుకువలు కొన్ని పుణికి పుచ్చుకొన్న పుణ్యపురుషుడు. అల్లర్లను అదుపుచేసి, శాంతిని నెలకొల్పి, పంజాబ్ సమస్యను పరిష్కరించిన ప్రతిభావంతుడు ఆయన. ప్రజల్లో నెలకొన్న అపారమైన సానుభూతి యువనేతకు అండదండలుగా నిలిచింది.

ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో 14 సంవత్సరాలపాటు పైలట్‌గా పనిచేసిన రాజీవ్‌గాంధీకి రాజకీయాలంటే అంత మోజులేదు. సంజయ్‌గాంధి మరణం రాజీవ్‌ని రాజకీయాల్లోకి దింపింది. యువజన కాంగ్రెస్ నాయకుడుగా, ఆసియా క్రీడోత్సవాల నిర్వాహకుడుగా ఎంతో సమర్థవంతమయిన సేవలందించారు.

భారతదేశానికి ప్రధానమంత్రులుగా వున్నవారందరి కంటే రాజీవ్‌గాంధీ యువకుడు. ప్రధానమంత్రిగా పదవీ బాధ్యతలు తీసుకొన్న తొలి సంవత్సరంలోనే పార్టీలోని పెద్దల ప్రశంసలకు. ప్రతిపక్షాల సహకారాన్ని పొందగలిగారు. రాజీవ్ అద్భుతమయిన రాజనీతిని ప్రదర్శించిన ప్రపంచనేతగా గుర్తింపు పొందారు.

ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని సంపూర్ణంగా వినియోగించుకొని, వాటి సేవలు ప్రతి మారుమూలలకు అందుబాటులోకి తేవాలనే రాజీవ్‌గాంధి ఆధునిక భావం భారత దేశానికి కొంత ఊపిరి ఇచ్చిందనే చెప్పుకోవాలి. ప్రపంచ శాంతికోసం రాజీవ్ తీసుకుంటున్న చొరవ, గిరిజన, వెనుకబడిన భారతాన్ని తెలుసుకోవాలనే తపన, లంచగొండి తనం నిర్మూలనకు తీసుకుంటున్న చర్యలు, ఆర్థిక విధానం. పథకాల అమలులో వేగంపై విషయాలకు సాక్ష్యంగా నిలుస్తాయి.

## రాజీవ్ నవతరం నాయకుడు

ఎనిమిదవ లోకసభ సార్వత్రిక ఎన్నికలతో తన నాయకత్వంలో కాంగ్రెస్ (ఐ) పార్టీ అద్భుతమైన విజయం సాధించటంతో - ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ తిరుగులేని నాయకునిగా దేశ చరిత్రలో కెక్కారు. అక్టోబరు 31వ తేదీన తమ తల్లి గారి దారుణహత్య జరిగిన కొద్ది గంటలలోనే అధికారంస్వీకరించిన శ్రీ రాజీవ్‌గాంధీని ప్రతిపక్షాలతో సహా అనేక మంది ప్రజలు బొకేషన్ ప్రధాన మంత్రిగా పరిగణించారు.

శ్రీమతి ఇందిరాగాంధీ హత్యానంతరం ఎంతో నిగ్రహం చూపిన శ్రీ రాజీవ్ గాంధీ నెలరోజులకే యథావిధిగా ఎన్నికలను ప్రకటించి దేశ నాయకత్వానికి అవసరమైన ధీరోదాత్తంతో క్షణాలలో ఎన్నికల సమరంలో ప్రవేశించారు. తమ తల్లిగారి వలెనే గంభీరోపన్యాసాలతో ప్రజా హృదయాలను చూరగొన్నారు.

ప్రతిపక్షాల పై ఖరిని దూషణలకు పాల్పడకుండా తమ తల్లిగారు చూపిన రీతిలోనే నిశితంగా విమర్శిస్తూ నాయకత్వ లక్షణాలను ప్రజలకు చూపించగలిగారు. ఎన్నికల ప్రచారంలో శ్రీ రాజీవ్‌గాంధీ చేసిన ప్రసంగాలు ప్రధాన మంత్రి హోదాకు ఎటువంటి భంగం కలుగని రీతిలోనే సాగడం అందరికి ఆశ్చర్యపరచింది. వ్యక్తిగత దూషణలకు పాల్పడకుండా, దేశ సమైక్యత సమగ్రతా పరిరక్షణ కర్తవ్యమని ప్రజలకు విశదీకరించారు. ఎన్నికల ప్రచారంలో ఆయన చూపిన నేర్పు, చతురత కేవలం మూడేళ్ళ క్రితమే రాజకీయాలలో ప్రవేశించిన వ్యక్తికి ఎలా అబ్బిందని పరిశీలకులు అబ్బుర పోయారు. రాజీవ్ ప్రదర్శించిన హుందాతనం ప్రజలను ఆశ్చర్య ముగ్ధులను చేసింది. రాజీవ్ నాయకత్వం పట్ల దేశ ప్రజలు సంతృప్తి చెందారు.

సార్వత్రిక ఎన్నికలలో మునుపు ఏ ప్రధాన మంత్రికి లభించని విజయాన్ని చేకూర్చి దేశనాయకునిగా శ్రీ రాజీవ్‌గాంధీని ప్రజలు ఆమోదించారు. కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీ పార్టీ నాయకునిగా శ్రీ రాజీవ్‌గాంధీఎన్నిక దేశచరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగ్గది. శ్రీ రాజీవ్‌గాంధీ యువ ప్రధానియే కాక స్వాతంత్ర్యం తర్వాత తరంలో తొలి ప్రధాని కూడా. వెనుకటి ప్రధానులందరు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని రాజకీయ జీవితం ప్రారంభించినవారే, శ్రీ రాజీవ్‌గాంధీ స్వాతంత్ర్యానంతరం మూడు దశాబ్దాల తర్వాత రాజకీయరంగంలోకి అడుగిడి, అనతికాలంలోనే ప్రధాని కాగలిగారు. విమాన పైలట్‌గా జీవితం ప్రారంభించి రాజకీయాలలో ప్రవేశించిన శ్రీరాజీవ్‌గాంధీ కాంగ్రెస్ - ఐ ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. తలమున్కలై దేశాన్ని పాలించగలిగిన నెహ్రూ కుటుంబంనుండి వచ్చిన వాడైనందున తల్లి, తాతగారి దక్షతను సంపాదించుకున్నారు.

—o—

# పేదల సంక్షేమానికి దీక్ష

నిరుపేదలకు మరింత మేలు జరిగేలా చూసేందుకు ఏడవ ప్రణాళికలో కొద్ది పాటి మార్పులు చేయాలని తలపెట్టినట్టు శ్రీ రాజీవ్‌గాంధీ ప్రకటించారు. ముప్పయి తొమ్మిదవ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా రాజధానిలోని చారిత్రాత్మక ఎర్రకోట బురుజుల నుంచి ఆయన దేశ ప్రజల నుద్దేశించి ప్రసంగించారు. ఏడవ పంచవర్ష ప్రణాళిక మౌలిక స్వరూపాన్ని మార్చకుండా త్వరలో స్వల్ప మార్పులు చేస్తామని ఆయన చెప్పారు. పాలనా వ్యవహారాలకు అమిత వ్యయం చేయకుండా పేదల సంక్షేమ పథకాలకు హెచ్చునిధులు ఖర్చుచేసే సరికొత్త విధానాలను చేపడు తున్నామని ఆయన అన్నారు.

శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధాని అయిన తర్వాత ఎర్రకోట వద్ద ప్రసంగించడం ఇదే ప్రథమము. ఆయన అధికారంలోకి వచ్చిన తరువాత ప్రభుత్వం చేపట్టిన ఆధునీ కరణ విధానాలను శ్రీ రాజీవ్ గట్టిగా సమర్థించారు. స్వదేశీ విధానాలతో దేశాన్ని వైజ్ఞానిక, సాంకేతిక పథంలో నడిపించేందుకు ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నామని ఆయన చెప్పారు. సొంత ఉపగ్రహాలను, కంప్యూటర్లను తయారు చేసుకోవాలని అణు ఇంధన కార్యక్రమాలను మనమే స్వయంగా నిర్వహించుకోవాలని, గ్రామీణ పేద ప్రజల ఇంటి ముంగిట వైజ్ఞానిక ప్రగతి వికసించాలని కాంక్షిస్తున్నామని ప్రధాని అన్నారు. మహాత్మాగాంధీ, పండిత జవహర్‌లాల్‌నెహ్రూ వంటి నాయకుల ఆశయాలకు, విధానాలకు విఘాతం కలగ కుండా వివిధ రంగాలలో నవ్యరీతులను అన్వయిస్తామని, స్వదేశీ అంటే ఆ రోజులలో ఖాదీ అని అర్థం, ఇప్పటి అర్థం అధు నాతన సాంకేతిక విజ్ఞానాన్ని అన్వయించు కోవడం అన్నారాయన.

కుల, మత, భాష ప్రాంతీయతత్వాలవల్ల చెలరేగుతున్న ఆందోళనలు దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాల అమలుకు ప్రతిబంధక మవుతున్నాయని ఆయన చెప్పారు. ఇలాంటి సంకుచిత తత్వాలను పడనాడాలని సంఘ విద్రోహ శక్తులను అణచి వేయాలని ఆయన విజ్ఞప్తిచేశారు. జాతిపిత మహాత్మాగాంధీ, శ్రీమతి ఇందిరాగాంధీ

హత్యతో దేశానికి అపారనష్టం వాటిల్లిన సంగతి విస్మరించరాదని ఆయన అన్నారు. ఆందోళనల ఫలితంగా వేలాదిమంది మృత్యువాత పడ్డారని. ఉగ్రవాదాన్ని తుద ముట్టించేందుకు అన్నివిధాలా చర్యలు తీసుకొంటున్నామని ఆయన అన్నారు. పంజాబ్, అస్సాం సమస్యలు పరిష్కారం కావడంపట్ల ఆయన హర్షం ప్రకటించారు. దేశాన్ని సుసంపన్నం చేసేందుకు జాతీయ సమైక్యత, సమగ్రత పరిరక్షణకు ప్రతి ఒక్కరూ చిత్తశుద్ధితో పాటుపడాలని, ప్రభుత్వానికి సహకరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు. ఇరుగుపొరుగు దేశాలతో సహా అందరితో స్నేహ సహకార సంబంధాలు పెంపొందించుకోవాలని, ప్రపంచశాంతి కావాలని ఇండియా కోరుకుంటున్నదని ఆయన చెప్పారు.

## పాక్‌తు హితవు :-

ఉపఖండంలో శాంతి కావాలన్న, భారత దేశంతో సదవ గాహస. మైత్రి పెంపొందాలన్న పాకిస్తాన్ తన అణువిధానం గురించి పునరాలోచించుకోవడం మంచిదని శ్రీ రాజీవ్‌గాంధీ సూచించారు. బాంబును తయారు చేయాలనే ఉద్దేశం పాక్‌కు ఉన్నట్టు స్పష్టమయిందని ఆయన అన్నారు.

శ్రీ రాజీవ్‌గాంధీ తెల్లని కుర్తా, పైజామాతో, గంభీరవదనంతో అప్పుడప్పుడు చిరుమందహాసంతో కనిపించారు.

శ్రీలంక సమస్యను ప్రస్తావించి. థింపూ చర్చలు ఫలప్రదం కాగలవనే ఆశాభావాన్ని ప్రధాని వ్యక్తంచేశారు. ఎన్ని ఒత్తిడులు వచ్చినా అలీన ఉద్యమాన్ని కొనసాగించి తీరుతామని ఆయన చెప్పారు. సోవియట్ అమెరికా దేశాలలో లోగడ తను జరిపిన పర్యటనలు ఎవరికి దాసోహం అవడానికి కాదని, పై పెచ్చు ఇండియా ప్రతిష్ఠ ఇనుమడించిందని ఆయన చెప్పారు. చైనా, నేపాల్, భూటాన్ మధ్య మైత్రి పెంపొందగలదని భావిస్తున్నామని ఆయన అన్నారు. ప్రధాని దాదాపు అరగంట సేపు ప్రసంగించారు. దేశం ఎదుర్కొంటున్న సవాళ్ళను ఆయన ప్రత్యేకించి ప్రస్తావించారు. హింసాకాండకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఉద్యమించాలని, ప్రజలంతా విభేధాలను విస్మరించి అన్నతమ్ముల్లా మెలగాలని ఆయన విజ్ఞప్తి చేశారు. మహిళలు, బలహీనవర్గాలు, హరిజనులు, గిరిజనులు. మైనారిటీలు తదితర అన్ని వర్గాల సముద్ధరణకు, ప్రాంతీయ అసమానతలను తొలగించేందుకు ప్రభుత్వం పాటు పడుతున్నదని ఆయన అన్నారు.

## త్వరలో కొత్త విద్యా విధానం :-

సుసంపన్న నాగరికతను సాంస్కృతిక వారసత్వాన్ని విస్మరించిన ప్రగతి ప్రగతి కానేకాదని, శీలసంపద, అభివృద్ధి చేదోడు వాదోడుగా ఉన్నప్పుడే దేశం సౌభాగ్యవంతమవుతుందని, శ్రీ రాజీవ్ తెలిపారు. ఎన్నికల వాగ్దానాలను నెరవేరుస్తున్నామని, అధికారంలోకి వచ్చిన వెంటనే పార్టీ ఫిరాయింపుల నిషేధ చట్టాన్ని చేస్తామని, అవినీతి నిర్మూలనకు త్వరలో లోక్‌పాల్ బిల్లును ప్రవేశపెడతామని ఆయన తెలిపారు. గత 88 సంవత్సరాలలో దేశం గణనీయ ప్రగతిని సాధించిందని. దాదాపు 68 శాతం ప్రజలకు దారిద్ర్యం నుంచి విముక్తి లభించిందని ఆయన అన్నారు.

## బాల్య స్మృతులు -:

ముప్పయి ఎనిమిదేళ్ళ క్రితం ఎర్రకోట బురుజుపై తాతగారైన తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ పతకాన్ని ఆవిష్కరించినపుడు రాజీవ్ రత్న వయస్సు మూడేళ్ళు, చిన్ననాటి సంగతులను ఆయన గుర్తుచేసుకొన్నారు. తాత, తల్లి స్వాతంత్ర్య ఉద్యమం నుంచి ఉద్భవించిన నేతలుకాగా, ఆయన యువతరం ప్రతినిధి, ఈ తరంలో మూడింట రెండువంతుల మంది స్వాతంత్ర్య మహాపోరాటాన్ని చూచి ఉండరని శ్రీ రాజీవ్ అన్నారు. గాంధీ, నెహ్రూ తదితర పాతతరం నాయకులకు ఆయన జోహార్లు అర్పించారు. శ్రీమతి ఇందిరాగాంధీ పీడితుల సముద్ధరణకు కంకణం కట్టుకొన్న నేతగా ప్రపంచ ప్రసిద్ధిపొందారని అన్నప్పుడు ఆయన స్వరంలో ఉద్వేగం కనిపించింది. భద్రతా ఏర్పాట్ల దృష్ట్యా ఈసారి పతాక ఆవిష్కరణ ఉత్సవం ఎర్రకోట మైదానంలో కాకుండా లాహోర్ గేట్ వద్ద జరిగింది. ఉత్సవం ముగిసిన తర్వాత దాదాపు ఐదువందలమంది బడిపిల్లలు, ఆకాశవాణి కళాకారులు జాతీయగీతం ఆలపించారు. ఎన్.సి.సి, మూడు విభాగాలకు చెందిన దాదాపు 1500 మంది దాదాపు అంతే సంఖ్యలో విద్యార్థినీ, విద్యార్థులు ఉత్సవంలో పాల్గొన్నారు. త్రివిధ దళాలకు చెందిన 13 మంది మెయిన్ గేటుపై నిలబడి బాకాలు ఊదారు. తర్వాత కవాతు జరిగింది. ప్రధాని సైనిక, పోలీసు వందనాలను స్వీకరించారు.

దేశాన్ని మరింత పటిష్టంగా సౌభాగ్యవంతంగా తీర్చిదిద్దేందుకు జీవితాన్ని అంకితం చేస్తామని, ప్రతిపౌరుడు ప్రతినపూనాలని శ్రీ రాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు.

—o—

# కొత్త మెరుగులతో ఏడవ ప్రణాళిక

భారత ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ అధ్యక్షతన, జరిగిన ప్రణాళిక సంఘం మీటింగ్‌లో ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ ఏడవ ప్రణాళికా ముసాయిదా బిల్లుకు తన అంగీకారాన్ని తెలియచేయడం జరిగినది. వనరుల సమీకరణలో అనేక ఇబ్బందులు తొంగి చూస్తున్నప్పటికీ, వనరుల సమీకరణకు గట్టి కృషి చేయగలమనే ధీమాతో ప్రధానమంత్రి ఏడవ ప్రణాళిక ముసాయిదా బిల్లుకు తన అంగీకారాన్ని తెలియజేయడం జరిగినది. ఏడవ ప్రణాళికకు సంబంధించిన పూర్తి వివరాలు ఇంకా వెల్లడి కానప్పటికి ప్రణాళికా సంఘం తయారుచేసిన ముసాయిదా ప్రణాళికలో ఏడవ ప్రణాళిక యొక్క పరిమాణం ఏడవ ప్రణాళిక లక్ష్యాలు అనుసరించవలసిన వ్యూహాలు ముసాయిదా బిల్లులో పొందు పరచబడి ఉన్నాయి. ఏడవ ప్రణాళికలో 27 శాతం పొదుపురేటు నిర్దేశింపబడినది.

మొత్తం ప్రణాళిక 5 సంవత్సరాలలో 1984-85 రేట్ల ప్రకారం మొత్తం పెట్టుబడి రు, 3.20.000 కోట్ల రూపాయలుగా చెయ్యడం జరిగినది. ప్రజల నుంచి సమీకరించవలసిన భారీ పెట్టుబడుల మొత్తం రు. 1.50 000 గాను, ప్రభుత్వ రంగ సంస్థల నుంచి లభించే పెట్టుబడి రు 1,80,000 కోట్ల రూపాయలుగా నిర్దేశింపబడినది. ప్రణాళికా లక్ష్యాలు ఆరవ ప్రణాళిక కంటే పూర్తిగా వేరు కానప్పటికీ, ఏడవ ప్రణాళికలో సమానత్వసాధన, సాంఘిక న్యాయము ఉత్పత్తిలో అభివృద్ధి సాధన, స్వయం సమృద్ధి సాధన, వనరుల సమీకరణ, పొదుపు ప్రోత్సాహక విధానాలు అనేవి లక్ష్యాలుగా నిర్దేశింపబడినవి. ఇంతకుముందు ప్రణాళికలో బీదరికం, నిరుద్యోగం రెండు సమస్యలకు పూర్తి శ్రద్ధ తీసుకొనడం జరుగలేదు. కాని ఏడవ ప్రణాళికలో బీదరిక నిర్మూలన, నిరుద్యోగ సమస్యను తొలగించుట అనేది ప్రధాన కర్తవ్యాలుగా అంగీకరించుట జరిగినది. మనము ఆరవ ప్రణాళికలో అనేక కష్ట నష్టాలను ఎదుర్కొడం జరిగినది. కరువుకాటకాలు, వరదలు, అతివృష్టి ఎదుర్కొడం జరిగినది. 1979-80 లో అందుకే వరిధాన్యాల పంటలో 17 శాతం పడిపోవడం జరిగినది. వరిధాన్యాల ధరలు పెరిగినవి. ఆరవ ప్రణాళిక కాలంలో ప్రకృతి మన పై

వగసాధించడం జరిగినది. అయినప్పటికి భారత ఆర్థికాభివృద్ధి, ముందు ప్రణాళికల కంటే ఆరవ ప్రణాళికలోనే ముందంజ వేయడం జరిగినది, సంఘటిత సాలుసరి అభివృద్ధి 5.2 శాతం సాధించడం జరిగినది. ద్రవ్యోల్బణ రేటును మిగతా ప్రదేశాలతో పోల్చిచూస్తే తగ్గించి వేయడం జరిగినది. వరిధాన్యాలు కావలసినంత నిల్వ చేయడం జరిగినది. కాని అనుకున్నంత పెట్టుబడులను సమకూర్చ లేక పోయాము. అంతేగాక పరిశ్రమలకు కావలసిన కనీస వసతి సౌకర్యాలు కల్పించ లేక పోవుటచే ఉత్పత్తిలో అభివృద్ధిరేటు సాధించలేక పోయాము.

ఏమైన ఇంతకుముందు ప్రణాళికల కంటే ఏడవ ప్రణాళిక ముఖ్యమైనది. భారతదేశ ఆర్థికాభివృద్ధికి అనేకమైన, చేర్పులు చేయడం జరిగినది. అంతేగాక క్రొత్త ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ యొక్క విధానాలకు, ఆశయాలకు అనుగుణంగా ఏడవ ప్రణాళిక రూపురేఖలు దిద్దుకుంది. ఇంతకుముందు ప్రణాళికల కంటే ఏడవ ప్రణాళిక ప్రజాసమస్యలకు ప్రత్యేక శ్రద్ధ వహించుటం జరిగింది. ఇప్పుడు అనేక విధానాలలో భారతదేశ ఆర్థికాభివృద్ధి ఆరోగ్యస్థితికి చేరుకున్నది. అనేక ఉమ్మడి విధానాల రూపకల్పన, విధాన నిర్ణయాలను ప్రణాళికాసంఘం ప్రభుత్వం అమలు పరుచుటలో పూర్తిశ్రద్ధ వహించుటవల్ల అభివృద్ధిరేటులో వేగం పుంజుకున్నది. అంతేగాక ఇంతకుముందు ఏడవ ప్రణాళికలో ప్రణాళికల కంటే ముఖ్యమైన ప్రజో పయోగకరమైన ప్రజాసమస్యలను నివారించేటువంటి విధాన నిర్ణయాలను ఏడవ ప్రణాళికలో రూపొందించటం జరిగినది. అందుచే ఏడవ ప్రణాళిక చాలా ప్రత్యేక మైనదిగా ఆర్థిక శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. ఇందుకు ఉదాహరణగా విదేశీ వాణిజ్యంలో రాయితీలు కల్పించుటవల్ల విదేశీ వాణిజ్యం ఎగుమతి, దిగుమతులు అభివృద్ధి చెందుతాయి. విదేశీ వాణిజ్యంలో రాయితీలవల్ల విదేశీ ఋణబాధ పెరిగే అవకాశమున్నది.

విదేశీ వాణిజ్యంలో, వాణిజ్యశాఖాధికారులు ఖచ్చితమైన నిర్ణయాలు చేయక పోవుటవల్ల విధాన నిర్ణయంలో ఆలస్యం జరగడానికి అవకాశమున్నది. భాస్కర్‌దత్ ఆర్థికవేత్త చెప్పినట్లు ఏడవ ప్రణాళికలో వ్యవసాయానికి నీటిపారుదల, పరిశ్రమలకు కనీస వసతి సౌకర్యముతైన నీరు, విద్యుత్, ముడిసరుకు తక్కువరేటుకు సరఫరా చేసి, రవాణా సౌకర్యములు, మార్కెటింగ్ సౌకర్యములు కల్పించుట, ఋణవసతి తక్కువ వడ్డీకి కల్పించుట, సాంకేతిక సలహాలు ఇచ్చుట అనేవి ఏడవ ప్రణాళికలో

ముఖ్యాంశములు, ఈ అంశాన్ని ముసాయిదా ప్రణాళికలో రూపొందించుట జరిగినది. వ్యవసాయానికి అగ్రతాంబూలము ఇచ్చుటయే ఏడవ ప్రణాళికలో సంతోషింప వలసిన అంశం ముఖ్యమైనది. ఇదిచాలా మెచ్చుకోదగిన విషయం. ఉద్యోగ ఉపాధి అవకాశాలు కల్పించుట, నిరుద్యోగ నివారణా పథకాలు రూపొందించుట, గ్రామీణ నిరుద్యోగతను నిర్మూలించుటకు, వ్యవసాయానికి ప్రాధాన్యత ఇచ్చుట, వ్యవసాయ రంగానికి ప్రేరణ కల్పించుట ముఖ్యమైనవి.

వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత ఇచ్చుటవల్ల గ్రామీణులకు ఉపాధి అవకాశాలు ఏర్పడతాయి. ఇందువల్ల నిరుద్యోగ గ్రామీణ వ్యవసాయ కూలీలకు సంవత్సరమంతా ఉద్యోగ, ఉపాధి అవకాశాలు ఏర్పడతాయి. ఇందువల్ల నిద్రా స్థితిలో ఉన్న వ్యవసాయ ఉత్పత్తులకు ప్రేరణ కలుగుటయేకాక, వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో ద్రవ్యోల్బణాన్ని అనేక విధాలుగా నివారింపవచ్చును. వ్యవసా ఉత్పత్తులు పడిపోతే ధరలు పెరిగి పెట్టుబడులలో మిగులు లేకుండా చేస్తా వ్యవసాయం మీద ఆధారపడిన జనుపనార, పంచదార, నూనెవంటి పరిశ్రమలకు ముడిసరుకులు లభ్యముకావు. ఒక్క వ్యవసాయరంగం దెబ్బతింటే దేశ ఆర్థి వ్యవస్థ చిన్నాభిన్నమయే ప్రమాదముంది. పారిశ్రామికీకరణ కుంటుపడుతుం అందువల్ల ఏడవ ప్రణాళికలో వ్యవసాయ రంగానికి ప్రాముఖ్యత ఇచ్చు జరిగినది. వ్యవసాయరంగములో ఏడవ ప్రణాళిక సాలుసరి 4 శాతం అభివృద్ధి రే సాధించాలని ప్రణాళికాసంఘం నిర్దేశించుకున్నారు. వ్యవసాయరంగానికి నీటిపారుద వసతులు కల్పించుట ద్వారా వ్యవసాయ వ్యూహాన్ని ఏడవ ప్రణాళికలో రూపొ దించు కొన్నారు. వ్యవసాయ రంగంనకు తగిన సమయంలో నీటివసతి కల్పించ పోవుటవల్లే వ్యవసాయ ఉత్పత్తులు దెబ్బతింటున్నాయని, అందుకే వ్యవసాయా నీటిపారుదల వసతులు కల్పించుట ప్రధాన అంశముగా ఏడవ ప్రణాళిక పేర్కొన్నారు. అధిక దిగుబడినిచ్చే వరివంగడాలు వేసినా తగిన సమయం ఎరువులు నీటివసతి లేకుండా వ్యవసాయదారులకు ఉత్పత్తిలో తగిన ఫలిత నివ్వవు. మనదేశంలో ఎరువుల కర్మాగారాలు పెరిగినవి. ఇంకాపెరగవలసి నీటివసతి మాత్రమే. అందువల్ల నీటివసతి, ఎరువుల సరఫరా వ్యవసాయ ఉత్ప ఒడుదుడుకులను పూర్తిగా నివారించవచ్చును.

ముఖ్యంగా ఏడవ ప్రణాళికలో చెప్పుకోదగిన విషయమేమిటంటే పెట్టుబడి ఉత్పాదకతల మధ్య ఉన్నదూరాన్ని దగ్గరచేసి, పెట్టుబడికంటే ఉత్పాదకత అధికం చేయడం లేదా పెట్టుబడితో సమానంగా ఉత్పాదకత ఉండాలని నిర్దేశించుట జరిగినది. అంతేగాక ఏడవప్రణాళికలో పూర్తిగా నీటిపారుదల ప్రాజెక్టులను పూర్తి చేయడం ఎందుకంటే వీటికి ఇంక తక్కువ పెట్టుబడిమాత్రమే అవసరముంటుంది. వీటినుంచి వచ్చే ఫలితాలు త్వరగా వస్తాయి. కొత్తనీటి పారుదల ప్రాజెక్టులు మధ్య తరహా, చిన్న నీటిపారుదల ప్రాజెక్టులకే మంచి చర్యలు తీసుకోవడం జరుగు తుందని ప్రణాళికా సంఘం ముసాయిదా బిల్లులో రూపొందించుట జరుగుతుంది. అన్ని ప్రాజెక్టులను నవీనకరణం చేయడం లేదా పాతపడిన, సామర్థ్యంలేని నీటి పారుదల ప్రణాళికలను వీలైతే కొత్తగా రూపొందించడం జరుగుతుందని పేర్కొ న్నారు. ఈ ప్రాజెక్టులకు పెద్దతరహా ప్రాజెక్టుల తర్వాతే ప్రాముఖ్యం ఇవ్వడం జరుగుతుంది.

గ్రామీణ సంబంధిత వ్యవసాయమును అభివృద్ధిచేసి, వ్యవసాయ ఉత్పత్తులను పెంచి తద్వారా గ్రామీణ ప్రజలకు చేయూత నివ్వడం జరుగుతుందని ప్రణాళికా సంఘం పేర్కొనుట జరిగినది. "అంతేగాక గ్రామీణ ప్రజలలోని నిరుద్యోగమును, వ్యవసాయ కూలీల దారిద్ర్యాన్ని నివారించుటకు ప్రత్యేకమైన పథకాలు ఏడవ ప్రణాళికలో తీసుకోవడం జరిగినది". ఈ పథకాలు వేగంతో ముందుకు సాగుతాయని ముసాయిదా బిల్లులో పేర్కొనుట జరిగినది. ఈ పథకాలవల్ల గ్రామీణ బీదప్రజల ఆదాయం పెంపొందించుటయేగాక, వారి జీవనోపాధి మెరుగుచేయుట లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈ పథకాలు ఆరవ ప్రణాళికలో కూడా ఉన్నప్పటికి అది పూర్తి విజయం సాధించలేక పోయాయి. ఈ పథకాలు పూర్తి విజయం సాధింప జెయ్యాలని ఏడవ ప్రణాళికలో నిర్దేశించుట జరిగినది. ఈ పథకాలు పూర్తిగా అమలుచేయక పోవుటకు ముఖ్యకారణం. ఈ పథకాలకు వచ్చిన డబ్బు ఆ పథకాలకు ఖర్చుచేయక పోవడంవల్ల లబ్ధి పొందవలసిన గ్రామీణ ప్రజలు పొందలేకపోయారు. ఈ పథకాల డబ్బు కావలసిన సమయంలో అందకపోవుటవల్ల, ఉద్యోగఉపాధి పథకాలు వ్యవసాయరంగంలో వెనుకంజ వేయడం జరిగినది. ఈ లోపాలు సరిదిద్దుకొనుటకు గట్టిచర్యలు తీసుకొనక పోవడంవల్ల సంఘటితమైన ప్రణాళిక లేకపోవడంవల్ల ఈ పరిపాలనా వ్యవస్థలో లోపాలవల్ల ఈ గ్రామీణ ఉద్యోగ పథకాలు కుంటుబడటం జరిగినది.

ఇక పారిశ్రామిక రంగం చూస్తే దీనికి కావలసిన కనీసఅవసరాలైన నీరు, విద్యుత్, ముడిసరుకు సరిఅయిన సమయంలో లభ్యం కాకపోవటంవల్ల సప్లయిలో మందకొడితనము కల్గడం డిమాండుకుతగ్గ పారిశ్రామిక ఉత్పత్తులులేక పారిశ్రామిక రంగం దెబ్బతింది. ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ వసతులైన విద్యుత్, ముడిసరుకులు నీరు, మూలధనంవంటి వనరులు మధ్యతరహా పరిశ్రమలైన ఇనుము, సిమెంట్, బొగ్గు రవాణాలకు ముఖ్యావసరము, పెద్దతరహా పరిశ్రమలలో ఈ కనీస అవసర వసతులకు భారీగా పెట్టుబడులు పెడుతున్నామన్నా ఆశ్చర్య పడనవసరములేదు. ఇవిలేనిదే పరిశ్రమ నడవవు. శక్తివనరులైన బొగ్గు, నూనెలు, పెట్రోలియంలకు ఎక్కువ పెట్టుబడిపెట్టుట అవసరమెంతైనాఉంది. ఆరవ ప్రణాళికలో అదనంగా 18,500 మెగవాట్ల విద్యుత్ ఉత్పత్తిచేయాలని అంచనాగా పెట్టుకొని సాధించడం జరిగినది. ఏడవ ప్రణాళికలో దీనిని అధిగమించాలని ప్రణాళికసంఘంవారు నిర్దేశించారు. సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రాలకు కేంద్రప్రభుత్వ పరిధిలోను, జాతీయ విద్యుత్ గ్రిడ్ పధకం 1990 లోపులో చేపట్టాలని ప్రణాళిక రూపొందించినారు. అంతేగాక పెట్రోలియంమీద ఆధారపడే పరిశ్రమలను విద్యుత్, బొగ్గుపై ఆధారపడేటట్లు చేయాలని, పెట్రోలియంకోసం గల్ఫ్‌దేశాలపై ఆధారపడుట మానాలని, పెట్రోలియం విషయంలో స్వయం సమృద్ధి సాధించాలని ప్రణాళికాసంఘం నిర్దేశించినది.

గోబర్‌గేస్‌ను ప్రోత్సహించాలని కూడా ఆశించినారు. పరిశ్రమలలో ఆధునికీకరణ, సాంకేతికీకరణ, అభివృద్ధి చేయాలని, ప్రభుత్వరంగం వీటివిషయంలో శ్రద్ధ తీసుకోవాలని, పెట్టుబడులు పెంపుచేయాలని ప్రణాళికాసంఘం ఉద్దేశించడం జరిగినది. మందగిస్తున్న అనేక చిన్నతరహా పరిశ్రమలకు ప్రోత్సాహమిచ్చి జీవం పోయాలని, చిన్నతరహా పరిశ్రమలకు బ్యాంకులద్వారా తక్కువవడ్డీకి దీర్ఘకాల వ్యవధిలో అప్పులివ్వాలని ఆదేశించుట జరిగినది. వస్త్రపరిశ్రమలో పురాతనమైన పద్ధతులు అవలంబిస్తున్నా అవి ఆర్థికంగా ముందంజ వెయ్యలేవని వాటికిచేయూత నివ్వాలని ప్రణాళికాసంఘ నిపుణులు గుర్తించినారు. ప్రభుత్వరంగంలోని వస్త్ర పరిశ్రమలో ప్రయివేట్‌రంగంలోనున్న వస్త్రపరిశ్రమలను తీసుకొనుటవల్ల వాటిభారం పెరిగినది. ఈవిధంగా మందగిస్తున్న చిన్నితరహా వస్త్రపరిశ్రమలకు ప్రభుత్వరంగం ద్వారా, ప్రభుత్వంద్వారా ప్రోత్సాహకాలు కల్పించి చేయూతనివ్వాలి.

ఈ చిన్నతరహా పరిశ్రమలను ఆధునికీకరణచేయుట ద్వారా జీవంపోసి వాటిని తిరిగి శక్తి పుంజుకొనేటట్లు చేయవలసి ఉంటుంది. చిన్నతరహా పరిశ్రమలలో ఆధునికీకరణేగాక, వైవిధ్యముకూడా ఎంతైనా అవసరం. కానీ వీటికి ఎంతో పెట్టుబడి అవసరం. వనరుల సమీకరణలో అనేక కష్టనష్టాలను ఎదుర్కోవలసి ఉంటుంది. వీటికి పెద్దతరహా పరిశ్రమల సహాయం ఎంతైనా అవసరముంటుంది. ఏడవ ప్రణాళికలో చిన్నతరహా పరిశ్రమల విషయంలో పెద్దతరహా పరిశ్రమల పాత్ర అభివృద్ధి చెయ్యడం కంటే వాటిని కొత్తప్రాంతాలలో సంఘటితము చెయ్యడమని నొక్కి చెప్పడం జరిగినది.

మన అనుభవాన్నిబట్టి చూస్తే ప్రణాళికా విధానాలలో మెచ్చుకోదగినదిగాలేదు. భారతదేశంలో మూడు దశాబ్దాలనుంచి ప్రణాళికలు సామాన్యమానవుని జీవనోపాధి పెంపొందించడంలో ఏమైనా గణనీయపాత్ర వహించలేదని, ప్రణాళికలను గౌరవించే వాడు కూడా అంగీకరిస్తున్నాడు. అందువల్ల ఏడవప్రణాళికలో మరొక సదవకాశాన్నిచ్చి ఎంతవరకు ప్రజాజీవనాన్ని పెంపొందించటంలో తనపాత్ర నిర్వహిస్తుందో వేచిచూడాలి. దీనిని సాధించితీరాలని ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ దృఢనిశ్చయంతో ఉన్నారు. అంతర్జాతీయ సంబంధాలు మెరుగుపరచుకొనుట ద్వారా, ప్రకృతి దేవతలనుంచి సరిఅయిన సహాయం సకాలంలో అందుతుందని ఆశిద్దాము. ఏడవ ప్రణాళికలో వీటన్నటికి మంచి ఉత్సాహకరమైన వాతావరణము ఆహ్వానిస్తోంది. దీనికి నూతన ప్రభుత్వం ఖచ్చితంగా వీటిని అనుకూలించుకొని, అమలుపరచి ముసాయిదా బిల్లులో చెప్పినట్లు ఏడవ ప్రణాళికలో ఆర్థికంగా భారతదేశం గణనీయమైన ప్రోత్సాహకరమైన స్థిరత్వంతో కూడిన వృద్ధిని సాధిస్తుందని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు.

—0—

# పంజాబ్ ఒప్పందం

ప్రధాని రాజీవ్‌గాంధీ, అకాలీదళ్ అధ్యక్షుడు హరచంద్‌సింగ్ లోంగోవాల్ మధ్య కుదిరిన ఒప్పందంలో దీర్ఘ కాలంగా దేశంలో అశాంతికి కారణమైన పంజాబ్ సమస్యకు తెరపడినట్లై ఈ ఒప్పందం పట్ల దేశవ్యాప్తంగా ప్రత్యేకించి పంజాబ్‌లో హర్షం వ్యక్తమయింది. ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ ఈ విషయంపై పార్లమెంట్‌లో ప్రసంగిస్తూ యావజ్జాతి మనోభావాలను తన మాటల్లో వ్యక్తీకరించారు.

ఈ ఒప్పందంతో సంఘర్షణా దశ ముగిసి శాంతి, స్నేహ, సదవగాహనం కొత్త శకం ప్రారంభమౌతుంది. తద్వారా భారతదేశపు సమైక్యత, సమగ్రతలకు కొత్త బలం చేకూర్చుతుంది. అని ప్రధాని ప్రకటించారు. మతవాద అకాలీ నాయకుడు పంత్ హరచంద్‌సింగ్ లోంగోవాల్ కూడా ప్రధాన మంత్రి చూపినచొరవకు ప్రతిస్పందించడం ద్వారా చెప్పుకోదగ్గ రీతిలో రాజకీయ స్థయిర్యాన్ని ప్రదర్శించారు. అది ఆయన ఒక్కడి స్పందన మాత్రమేకాదు. ప్రత్యేకించి అకాలీల ఆశలకు ఆయన చర్య ఒక ప్రతీక. తన సొంత పార్టీలోను, ఇతర అకాలీ వర్గాలలోని తన ప్రత్యర్థులలోను. ఉన్న ఉగ్రవాదుల నుంచి వచ్చిన ఒత్తిడిని లోంగోవాల్ ప్రతిఘటించారు. సమైక్య భారతం చట్టంలోనే పంజాబ్ సంక్లిష్ట సమస్యకు చర్చలద్వారా శాంతియుత పరిష్కారం కనుగొనాలనే అసంఖ్యాకమైన సిక్కు ప్రజల ఆకాంక్షను ఆయన స్పష్టంగా ప్రదర్శించారు. ధైర్యవంతమైన ఈ చర్చ తీసుకోవడం ద్వారా అకాలీ రాజకీయాలమీద తన ఆధిపత్యాన్ని ఆయన పునర్ వ్యవస్థితం చేసుకున్నారు.

పంజాబ్ రాజకీయాల్లో సంభవించిన ఈ రాజకీయ పరిణామాలతో అందరి దృష్టి రాష్ట్రంలోని అకాలీ రాజకీయాలపైకి మళ్ళింది. అకాలీదళ్‌తో సైతం కొత్త సర్దుబాటు జరిగినట్లు స్పష్టమైనది. బాబా జోగిందర్‌సింగ్ అకాలీదళ్ అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్యలోని ఒక వర్గం ప్రభుత్వానికి, లోంగోవాల్‌కి మధ్య కుదిరిన ఒప్పందాన్ని తిరస్కరించారు అయితే సంత్ లోంగోవాల్ అకాలీదళ్‌లోని తీవ్రవాదుల వైఖరిని ఊహించి చెప్పడం చాలా కష్టం పంజాబు సమస్యకు పరిష్కారం

కనుగొనడం అనేది చాల ప్రతిపక్ష పార్టీలు అనుకుంటున్నంత సులభం కాదని పరిణామాలు నిస్పష్టంగా వెల్లడిస్తున్నాయి.

ఈ పరిణామాలన్నిటినీ ఒకసారి మనస్సులో ఉంచుకొని ఆలోచిస్తే ఈ ఒప్పందం యొక్క గుర్తింపు, పంజాబ్ సమస్య పరిష్కారం విషయంలో రాజీవ్ గాంధీ ప్రదర్శించిన రాజకీయ పరిపక్వత తేలికగా అర్థమౌతాయి.

ఇదిలా ఉంచితే మొత్తం ఉత్తరభారతంలో ప్రత్యేకించి పంజాబ్ లో ఉన్న లౌకికవాద శక్తులు, మితవాద అకాలీనాయకులు ఒప్పందాన్ని రాజకీయరంగంలో వెళ్ళూన్న మతతత్వం, వేర్పాటువాదం, టెర్రరిజంలకు వ్యతిరేకంగా జరిపే పోరాటానికి నాందివాక్యంగా భావిస్తున్నారా అనేది ముఖ్యమైనప్రశ్న, అకాలీలలోని ఉగ్రవాదులు, మితవాద అకాలీ నాయకులను అప్రతిష్టపాలు చేసే ప్రచారాన్ని ప్రారంభించారు. ఈ ప్రచారానికి గురైన తొలివ్యక్తి మాజీ అకాలీ ఆర్థికమంత్రి బల్వంత్ సింగ్, ప్రధానమంత్రి రాజీవ్ గాంధీతో సంత్ లోంగోవాల్ జరిపిన చర్చల్లో అయనతోపాటు బల్వంత్ సింగ్ మాజీ అకాలీ కేంద్ర వ్యవసాయశాఖామంత్రి సుర్జిత్ సింగ్ బర్నాలా కూడా పాల్గొన్నారు.

1984 లో జరిపిన (సైనికచర్య) అపరేషన్ బ్లూస్టార్‌ను సమర్థిస్తూ స్వర్గీయ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీకి లేఖ వ్రాశాడనే ఆరోపణపైకూడా జోగిందర్ సింగ్ నాయకత్వంలోని 'ఐక్య' అకాలీదళ్ కి చెందిన హర్ భజన్ సింగ్ బాదల్ ను సిక్కు సంఘ్ నుంచి బహిష్కరించాల్సిందిగా డిమాండ్ చేసారు.

పంజాబ్ లో తిరిగి సాధారణ పరిస్థితిని నెలకొల్పడం ముఖ్యంగా హిందూ. సిక్కుల మధ్య సామరస్యాన్ని పునరుద్ధరించడం సులభసాధ్యం కాదని ఈ పరిణామాలను బట్టి స్పష్టమౌతది. పంజాబ్ లో నెలకొనిఉన్న పరిస్థితిని మార్చేందుకు అనువైన భౌతికపరిస్థితులను మాత్రమే ఈ ఒప్పందం సృష్టిస్తుంది.

అకాలీనాయకత్వం, కేంద్రంమధ్య ఒప్పందం కుదరడం ఇది మొదటిసారి కాదు అకాలీల డిమాండ్లపై కేంద్రం, అకాలీ నాయకత్వంమధ్య అంతకుముందు కనీసం మూడుసార్లు ఒప్పందాలు కుదిరాయి కానీ దురదృష్టవశాత్తు ఒప్పందం కుదిరిన ప్రతిసారి అకాలీలలోని ఒకవర్గం దానిని వ్యతిరేకించడం కొత్తడిమాండ్లను లేవనెత్తడం మొదలు పెట్టారు.

1947 తరువాత అకాలీలు మతతత్వ రాజకీయాలలో తాత్కాలికంగా మార్పు సంభవించింది. మార్పు పంజాబ్‌లో తొలి ప్రభుత్వం ఏర్పాటు చేసేందుకు కాంగ్రెస్‌తో అకాలీలు చేతులు కలిపారు. అకాలీ అభ్యర్థి సర్దార్ బల్‌దేవ్‌సింగ్ కేంద్ర కేబినేట్ సభ్యుడు. అయితే తరువాత కొద్దిరోజుల్లోనే పంజాబ్ సుబాకోసం అకాలీలు డిమాండ్ చేయడం ప్రారంభించారు. ఈ సమస్యను పరిష్కరించేందుకు మాస్టర్ తారాసింగ్‌తో జవహర్‌లాల్ నెహ్రూ ఒక ఒప్పందానికి వచ్చారు. ఫలితంగా 1950 దశకంలో ప్రాంతీయ ఫార్ములా రూపొందింది. అకాలీదళ్ తన సర్వశక్తుల్నీ మత, సాంస్కృతిక రంగాలకు మళ్ళించి కాంగ్రెస్‌తో కలిసేందుకు అంగీకరించింది. పంజాబ్ సుబా నినాదం ఇవ్వడానికి కూడా అకాలీలు ఒప్పుకున్నారు.

అయినప్పటికి మాస్టర్ తారాసింగ్ ఈ ఫార్ములాతో సంతృప్తి పడలేదు. పార్లమెంట్రీక ఎన్నికల్లో తనవారుకాని సిక్కు అభ్యర్థులందరిని ఆయన వ్యతిరేకించారు. కాంగ్రెస్ టికెట్‌మీద పోటీచేస్తున్న అకాలీలుకూడా ఆయన వ్యతిరేకతకు గురయ్యారు.

మరోదశాబ్ది కాలంలో అంటే 1955, 1966 మధ్యకాలంలో శిరోమణి గురుద్వారా ప్రబంధక్ కమిటీ అకాలీదళ్‌ల నియంత్రణలో ఉన్న అకాలీలమధ్య తీవ్రమైన ఘర్షణ చెలరేగింది. స్వర్ణదేవాలయం ఆవరణలో ఆందోళనల పరంపర నిర్వహించబడినది. ఈ పరిస్థితిలో మాస్టర్ తారాసింగ్ ఘర్షణ వైఖరి అవలంబించగా శ్రీ సంత్ ఫతేసింగ్ మితవాద ధోరణి అనుసరించారు. ఈ అక్రమంలో సంత్‌పంత్ అకాలీల అగ్రశేణి నాయకుడిగా రూపొందారు. మాస్టర్ తారాసింగ్ నాయకత్వంలో అకాలీదళ్ కేవలం పేపర్ ఆర్గనైజేషన్‌గా మారిపోయింది. దాని ప్రధానమైన పునాది పట్టణ సిక్కులకు, పంజాబ్‌నుంచి వచ్చిన శరణార్థులకు పరిమితమై పోయింది.

1960-65 మధ్య అయిదేండ్లకాలంలో సంత్ ఫతేసింగ్ స్వర్ణదేవాలయం ఆవరణలో ఆత్మహత్య చేసుకుంటానని మూడుసార్లు బెదిరించాడు. అలా బెదరించిన మూడు సందర్భాలలో కూడా పంజాబ్ 'సుబా' డిమాండ్ కోసం ఏదోఒకటి చేయాలనేదే ఆయన సంకల్పము. 1966 కేంద్రం అకాలీల మధ్యమరో ఒప్పందం కుదిరింది. పంజాబ్‌ను పంజాబ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్ అనేమూడు రాష్ట్రాలుగా విభజించాలని నిర్ణయించారు.

పంజాబ్, హర్యానాలమధ్య కొన్ని "ఉమ్మడి సంబంధాలు" ఉండడానికికూడా అంగీకారం కుదిరింది. ఆ ఒప్పందం ప్రకారం ఉభయరాష్ట్రాలకు 'చండిఘర్' రాజధానిగా ఉంటుంది. అలాగే ఉమ్మడి హైకోర్టుకూడా ఉంటుంది. పంజాబ్ సుబా ఏర్పాటుపై భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంతో తాను సంతృప్తి చెందానని చిన్నచిన్న సరిహద్దు వివాదాలు శాంతియుతంగా పరిష్కారం కాగలవని ఆశిస్తున్నానని సంత్ ఫతేసింగ్ బహిరంగంగా ప్రకటించారు.

కానీ చండీఘర్‌ను పంజాబ్‌లో విలీనంచేసి, ఉమ్మడి సంబంధాలన్నిటిని రద్దు చేయాలని కొత్త ఆందోళన ప్రారంభమైంది. తరువాత శ్రీమతి ఇందిరాగాంధీ చండీఘర్‌ను పంజాబ్‌కు ఇచ్చి ఫజిల్కా, అబోహార్ ప్రాంతాలను హర్యానాకు ఇస్తున్నట్లు ప్రకటించారు. అది అమలు జరుగలేదు.

ఈ విధంగా గతంలో రూపొందిన ప్రతిపథకం క్రొత్త సమస్యలను సృష్టించింది. రాష్ట్రంలో మతతత్వ కాలుష్యానికి కారణమైంది.

అయితే రాబోయే కాలంలో పంజాబ్ పరిస్థితి ఎలా ఉంటుందనేది ఈస్థితిలో అనూహ్యం. అయితే ఒక విషయం మాత్రం స్పష్టంగా చెప్పవచ్చు, అకాలీ సమస్య పరిష్కారపథంలో రాజీవ్‌గాంధీ మరింత ముందుకు వెళతారని అకాలీలను జాతీయ ప్రధాన స్రవంతిలోకి తిరిగి తీసుకురాగలరని నిస్సందేహంగా చెప్పవచ్చు.

సిక్కు, హిందూ సంబంధాలు అభివృద్ధి చెందడమెలా? పంజాబ్ మాట్లాడే ప్రజలు ప్రత్యేక అస్తిత్వంతో రూపొందడం ఎలా? అనేది నేటి ప్రధానసమస్య అని స్పష్టమయింది. ఈ సంబంధాలు కొనసాగాలంటే జాతీయ స్రవంతిలో భాగంగానే పంజాబీ మాట్లాడే ప్రజల సంస్కృతీ, భాషా సమగ్రతను లోతుగా పరిశీలించాలి. ఈ లక్ష్యాన్ని సాధించడానికి ధీర్ఘకాలిక, స్వల్పకాలిక విధానాలు రెండు అవసరం. ఈ ఒప్పందం అనంతరం ఇది పంజాబీ మేధావివర్గం కర్తవ్యం కూడా తమ మత పరమైరన విశ్వాసాలకు అతీతంగా వ్యవహరిస్తూ పంజాబీ మాట్లాడే ప్రజల ఐక్యతకు పునాదిని ఏర్పరచాలి. ముస్లింలీగ్, అకాలీదళ్‌లాంటి పార్టీలు వాటి వివిధవర్గాలు మొత్తం సిక్కు ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించవు. సిక్కు ప్రజల్లో ఆర్థికంగా బాగా అభివృద్ధిచెందినవారికి ప్రత్యేకించి జాట్ భూస్వాములకే అవి ప్రాతినిత్యం

వహిస్తున్నాయి. అకాలీనాయకులను భారతదేశంలోని అందునా పంజాబ్‌లోని సిక్కుల ఆకాంక్షలకు ప్రతినిధులుగా భావించడానికి వీల్లేదు.

వాస్తవానికి ఉగ్రవాదుల కార్యకలాపాలు సిక్కు ప్రజల హృదయాలను గాయపరిచాయి. మితవాద అకాలీనాయకులు ఏకమై సృష్టించిన సామరస్య పరిస్థితులతో లౌకికవాద శక్తులకు బలంచేకూరింది. మితవాద అకాలీనాయకులు ఉగ్రవాదులకు వేర్పాటువాదులకు దూరంగా రావడం ప్రధాని రాజీవ్‌గాంధీ ఒప్పందం ద్వారా ప్రధాన సమస్యలన్నిటిని పరిష్కరించడంతో లౌకికవాద రాజకీయాలను ఉద్ధరించాలనే ప్రచారానికి అనువైన భౌతిక పరిస్థితులు సమకూరాయి.

సంప్రదింపుల ద్వారా ఒక ఒప్పందం కుదిర్చి పంజాబ్ సమస్యను పరిష్కరించినందుకు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీని "న్యూయార్క్ టైమ్స్" వార్తాపత్రిక ఎంతో ప్రశంశించింది. భారత్ మిత్రదేశాలన్నీ ఆయనను అభినందించాయి.

పంజాబ్ సమస్యపై చారిత్రాత్మకమైన ఒప్పందం కుదుర్చుకున్నందుకు భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ, అకాలీదళ్‌నాయకుడు లోక్‌సభలో ప్రశంసలు అందుకున్నారు.

❧

# అకాలీలు చేయి కలపాలి: రాజీవ్‌గాంధీ

తమ ప్రభుత్వము పంజాబ్ సమస్య పరిష్కారానికి చొరవతో అనేక చర్యలు తీసుకున్నందున అకాలీలు ఇక తాత్సారం చేయకుండా రాజ్యాంగ పరిధిలో సమస్య పరిష్కారానికి ప్రతిస్పందించాలని ప్రధాని రాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు. స్వర్గీయ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ స్థానంలో అఖిల భారత కాంగ్రెస్ (ఐ) అధ్యక్షునిగా ఎ.ఐ.సి.సి. సమావేశంలో పదవీ బాధ్యతలు స్వీకరించిన వెను వెంటనే ప్రసంగిస్తూ శ్రీరాజీవ్‌గాంధీ ఈమేరకు విజ్ఞప్తి చేశారు. పంజాబ్‌సమస్య చాలా కాలంగా నలుగుతున్న సమస్య అయినందున తీవ్రఆందోళన కలిగిస్తున్నదని ప్రధాని చెప్పారు.

కీలక సరిహద్దు రాష్ట్రమైన పంజాబ్ సమస్యను సత్వరం పరిష్కరింపజేసి ఆ రాష్ట్రాన్ని ఆర్థికంగా ముందుకు తీసుకు వెళ్ళాలని ప్రభుత్వం అభిలషిస్తున్నదనీ తగిన శ్రద్ధ తీసుకుంటున్నదని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. పంజాబ్‌లోను, దేశంలో లోను, ఇతర ప్రాంతాలలోను సిక్కుల ప్రాణాలకు, ఆస్తులకు పూర్తి భద్రత కల్పించాలని ప్రభుత్వం దృఢంగా తీర్మానించిందని శ్రీరాజీవ్‌గాంధీ పునరుద్ఘా టించారు.

గుజరాత్‌లో రిజర్వేషన్‌ల వ్యతిరేక ఆందోళనను గురించి ప్రస్తావించి ఎన్నికల లో ఓటమి పొందిన కొన్ని రాజకీయ పార్టీలు సున్నితమైన మనోభావాలను రెచ్చగొట్టి ఆందోళనను బయలుదేరదీశాయని, చిచ్చును పెట్టటమేగాక దానిని ప్రజ్వలింపజేసి ప్రజలప్రాణాలకు ఆస్తులకు నష్టం కలిగించాయనీ, ప్రధాని ఆరోపించారు. గుజరాత్‌లో ప్రజలే కాంగ్రెస్ (ఐ) నిఅధికారంలోకి తీసుకు వచ్చారనీ, ఏ ఆందోళన కాంగ్రెస్ (ఐ)ని అధికారం నుండి తొలగించజాలదని, ప్రధాని అన్నారు. ముఖ్యంగా వెనుక బడిన తరగతులు, హరిజనుల ప్రమాణాలను పెంపొందింపచేయడ మనేది రాజ్యాంగ బద్ధంగా ప్రభుత్వానికి సంక్రమించిన 'విధి' అని ప్రధాని స్పష్టంచేశారు

అస్సాంలో కూడా చాలా కాలంగా నలుగుతున్న విదేశీయుల సమస్య పరిష్కా రానికి త్వరలో ఒక పరిష్కారం కుదరగలదనే ఆశాభావాన్ని ప్రధానివ్యక్తం చేశారు. ఎ.ఐ.సి.సి. సమావేశంలో శ్రీరాజీవ్‌గాంధీ తొలుత హిందీలోను, ఆతర్వాత ఇంగ్లీష్‌లోను 50 నిమిషాల సేపు ప్రసంగించారు. కాంగ్రెస్-ఐ అధ్యక్షుడు తన ప్రసంగంలో కొన్ని ప్రతిపక్షపార్టీల పై ధ్వజమెత్తారు,

## పుట్టినరోజున ఆర్భాటం చేయవద్దు : శ్రీ రాజీవ్‌గాంధీ

తన జన్మదినోత్సవ సందర్భంగా ఆగస్టు 20 వ తేదిన ఎటువంటి ఆర్భాటాలు చేయవద్దని బహిరంగసభల ఏర్పాటు వంటి కార్యక్రమాలు మానుకోవాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్ని ప్రదేశ్ కాంగ్రెస్ (ఐ) కమిటీలను ఆదేశించారు. అందుకు బదులు పేదరికం నిర్మూలన కార్యక్రమాలు చేపట్టాలని కోరినట్లు ఎ.ఐ.సి.సి.ఐ ప్రధానకార్యదర్శి శ్రీ జి.మూపనార్ తెలిపారు. ఇలాంటి ఉత్సవాలతో పాల్గొనేందుకు కాలాన్ని, శక్తిని వృధా చేయకుండా పేదరికం దోపిడీలకు వ్యతిరేకంగా ఐక్యపోరాటానికి వాటిని ధారపోయాలని రాజీవ్ కార్యకర్తలను కోరినట్లు ఆయన తెలిపారు.

## ఆమోద యోగ్యమైన వ్యవస్థ అవసరం

కామన్వెల్తులో ప్రతిపాదనపై రాజీవ్ వివరణ :- నూతన ప్రపంచ వ్యవస్థ ఏర్పాటాలని కామన్వెల్తు శిఖరాగ్రసభలో తానుచేసిన ప్రతిపాదనపై ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పశ్చిమదేశాల విలేకరులతో మాట్లాడుతూ వివరించారు. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితులలో అన్నిదేశాలకు ఆమోదయోగ్యమైన రక్షణకల్పించే చట్రం అవసరమని ఆయన అన్నారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పరచుకున్న ప్రస్తుతవ్యవస్థ బాగా పనిచేయడం లేదనేది తమ అభిప్రాయంకాదు. ఈ వ్యవస్థ ఇంత వరకు బాగానే పనిచేసింది. ప్రతిఒక్కరిని (అన్నిదేశాలు) సంతృప్తిపరచి ఉండకపోవచ్చు. ఇందులోనూ కొన్ని లోపాలు, సమస్యలు ఉండవచ్చు. ఈ లోపాలను సరిదిద్దు కోవడమనే ప్రధాన ఆశయమై ఉండాలి. ఈ వ్యవస్థకు హాని కలిగించుకొని నియమాలను, నిబంధనలను ఉల్లంఘించి అంతర్జాతీయ అస్థిరతలోనికి అరాచకం లోనికి వెళ్ళాలని ఎవరూ కోరుకోరు. ప్రస్తుత సమస్యల దృష్ట్యా ఇంతకన్నా మెరుగైనా ప్రపంచ వ్యవస్థను రూపొందించుకోవాలనేదే తమ ఆశయం అని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పశ్చిమదేశాల విలేఖరులకు వివరించారు.

మీరు మరో కోణంలో ఆలోచించినట్లయితే ఐక్యరాజ్యసమితి నియమాలకు నిబంధనలకు మద్దతుగా ఈ వ్యవస్థ కొనసాగుతున్నదాలేదా అనేది మీకే అర్థమవుతుంది. తమ అభిప్రాయం ఎవరికీ విరుద్ధమైనదికాదు. దీనిపై ఎవరివాదనవాళ్ళు వినిపించవచ్చునని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. మతుపానీయాలు కానీయండి, ఉగ్ర

వాదంకానీయండి.రాజకీయసమస్యలు కానీయండి దేనినైనా సమర్థవంతంగా పరిష్కరించేందుకు అన్నిరాజ్యాలకూ ఆమోదయోగ్యమైన వ్యవస్థఅంటూ ఉండాలి. అని శ్రీరాజీవ్ గాంధీఅన్నారు. అదేఉద్దేశంతోనే కొందరు విదేశాంగమంత్రులతో ఒక అడ్‌హాక్ కమిటీ ఏర్పడాలని ప్రతిపాదించాము. శిఖరాగ్ర సభలు ముగిసేలోగా ఐక్యరాజ్య సమితికి మద్దతుగా ఈ వ్యవస్థ ఎలా పనిచేయాలో ఆ కమిటి సూచనలు చేస్తుంది అని శ్రీ రాజీవ్‌గాంధీ చెప్పారు.

కామన్వెల్తు సభ్యదేశాలన్నీ ఈ ఒప్పందానికి కట్టుబడి ఉంటాయఅని ప్రశ్నించగా ఏ ఒప్పందంపైనైనా ఏకాభిప్రియంతో ఉండేందుకు సమ్మతించాయని ఆయన సమాధాన మిచ్చారు. తాము కేవలం ఉగ్రవాదాన్ని గురించే మాట్లాడటంలేదు. ఆర్థిక వ్యవస్థలకు రక్షణ అనేది ఉండాలి. ఇందుకోసం తగిన చర్యలు తీసుకోవలని ఉందని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. మరి ఇందుకు ప్రవర్తనా నియమావళి ఏదైనా రూపొందించనున్నదా అని అడుగగా గత నలభై ఏళ్ళుగా మనకు ప్రవర్తనా నియమావళి ఉంది. అయితే కొన్నిరంగాలలో అది బలహీనంగాను, మరికొన్ని రంగాలలో పటిష్టంగాను ఉంది కొందరు దానిని ఇష్టపడుతున్నారు. మరికొందరు ఇష్టపడడం లేదు. మనం ఇప్పుడు కొంత సాధించాము. ఇంకా ముందుముందు సాధించవలసింది ఎంతో ఉంది. ఎక్కడలోపాలు ఉన్నయో తెలుసుకుని వాటిని సరిదిద్దుకోవడం మన ధ్యేయమని అని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు.

దక్షిణాఫ్రికాపై అడగిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ జాత్యహంకార పాలనకు బదులు ప్రజాస్వామ్య పాలనను కోరుతున్నాము. మానవ హక్కులు, గౌరవ మర్యాదలు పునరుద్ధించబడాలి. ప్రతిఒక్కరు కామన్వెల్తులో ఇదే కోరుతున్నారు. శ్రీమతి థాచర్‌తో సహా ఈ విషయంలో ఎవరినీ మినహాయించే ప్రసక్తే లేదు. దీన్ని ఎలా సాధించాలన్నదే ప్రశ్న.

ఇందుకు దక్షిణాఫ్రికాపై సమగ్రమైన ఆంక్షలు విధింపజేయడమే మార్గమని తమ అభిప్రాయం అని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. అయితే ఇతర సూచనలన్నిటిని వట్టించు కోరాదనేది కామన్వెల్తు అభిప్రాయంకాదు, శ్రీమతి థాచర్ ఏవైనా సూచనలు చేస్తే అవి ఆమోదయోగ్యంగా ఉంటే కామన్వెల్తు వాటిని పరిశీలిస్తుందని రాజీవ్ చెప్పారు.

—o—

# రాజీవ్‌కు హారతిపట్టిన అమెరికా పత్రికలు

అమెరికాలో శ్రీరాజీవ్‌గాంధీ పత్రికల ప్రధాన అంశంగా మారారు. అక్కడ పత్రికలు శ్రీరాజీవ్‌గాంధీని ప్రశంసలతో ఆకాశానికెత్తుకున్నాయి. న్యూస్‌వీక్, దిస్‌వీక్ పత్రికలు రెండు ఒకదానికొకటి శ్రీరాజీవ్‌గాంధీని మెచ్చుకుంటూ వ్యాసాలు వ్రాశాయి. స్వాతంత్ర్యం తరువాత అనేక రంగాలలో భారతదేశం సాధించిన అభివృద్ధిని టైమ్ పత్రిక విపులీకరించింది.

ప్రపంచంలో కెల్లా అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమైన భారతదేశంపై ఎప్పుడు అప్రియులనే పలికే అమెరికా పత్రికలు ఆదేశపు ప్రధాని గురించి, ప్రగతిగురించి ప్రశంసాత్మకంగా వ్రాయడం పరిశీలకులకు ఆశ్చర్యం కలిగించింది. శ్రీమతి ఇందిరా గాంధీ కన్నా శ్రీరాజీవ్‌గాంధీ పాశ్చాత్య అనుకూల వైఖరి ఎక్కువగా ప్రదర్శిస్తారని అక్కడి ప్రచారసాధనాలు ఆశించాయి.

దివంగత ప్రధాని కుమారుడు అగుట వలన శ్రీరాజీవ్‌గాంధీకి ఎన్నికల్లో ప్రజలు అనుకూలంగా తీర్పు చెప్తారనడంతప్పు. నాయకత్వాన్ని సమర్థవంతంగా నిర్వహించడానికి ఆయన సంసిద్ధత తెలుపడమే విజయానికి కారణం. అరుదైన ధైర్యసాహసాలను శ్రీరాజీవ్‌గాంధీ ప్రదర్శించి భారత వోటర్ల హృదయాలను చూరగొన్నారని "టైమ్స్" పత్రిక వ్రాసింది. 34 సంవత్సరాల పాటు ఆర్థిక రంగంలో ముందుచూపుతో ఎంతో అభివృద్ధి సాధించిన భారతదేశం ప్రధానమైన పారిశ్రామిక దేశంగా, సైనిక శక్తిగల రాజ్యంగా అవతరించిందని కూడా టైమ్స్ వ్రాసింది.

## న్యూస్‌వీక్ ప్రశంస :-

అస్థిరత, చీలిక ధోరణులు హింసావాదంతో కొట్టుమిట్టాడుతున్న భారత దేశంలో యువనేత శ్రీరాజీవ్‌గాంధీకి బరువు బాధ్యతలు చాలా ఎక్కువగా ఉన్నాయని న్యూస్‌వీక్ పత్రిక వ్యాఖ్యానించింది. దేశం మనుగడ కొనసాగించడం ఒక్కటే శ్రీరాజీవ్‌గాంధీ ఎదుర్కొనే సవాలు కాదని, దేశపరిస్థితిలో పెద్ద మార్పులు తేవలసిన అవసరం వున్నదని ఆ పత్రిక అభిప్రాయపడింది. అటుదేశం

మచుగడ సాగిస్తూ, ఇటు దేశంలో పరిస్థితిని సమూలంగా మార్చి ప్రగతిని పుంజు కునేటట్టు చేయవలసిన విధి. ఆయన సక్రమంగా నిర్వహిస్తారన్న ఆశాభావాన్ని న్యూస్‌వీక్ ప్రకటించింది. శ్రీరాజీవ్‌గాంధీ బాధ్యతల స్వీకారం అనే శీర్షికను ఈ పత్రిక ఐదుపుటలతో ప్రచురించింది. పదవిలోకి రాగానే ఆయన చక చకా పనిచేస్తూ మంచి పేరు తెచ్చుకున్నారని న్యూస్‌వీక్ ప్రశంసించింది. పంజాబ్‌లో శాంతి పున రుద్ధరణకు జైలులో వున్న సిక్కు నాయకులతో చర్చలకై దూతను పంపటం, భారత పాకిస్తాన్‌ల మధ్య సామరస్య పునరుద్ధరణ కృషిలో భాగంగా పాక్ అధ్యక్షుడు జియాఉల్‌హక్‌తో టెలిఫోన్ హట్‌లైన్ ఏర్పాటు వంటివి రాజీవ్ చొరవ తో గైకొన్న మంచి పనులుగా పేర్కొన్నారు.

## టెర్రరిజం అణచివేతకు పారా మిలిటరీదళాల శిక్షణలో మార్పు: రాజీవ్‌గాంధీ

టెర్రరిజాన్ని, విద్రోహచర్యలను సమర్థంగా అరికట్టేందుకు పారా మిలిటరీ దళాల శిక్షణలో మార్పుచేయాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ సూచించారు. కేంద్ర రిజర్వు పోలీసుదళం (సి.ఆర్.పి.) 46 వ వార్షికోత్సవం పెరేడ్‌లో ప్రధాని ప్రసం గించారు. విద్రోహ చర్యలు, అల్లర్లు, టెర్రరిజం సమస్యలకు సమాధానం భద్రతా దళాల అంగబలం పెంచడంలో లేదని, శిక్షణ పద్ధతిలో మార్పుద్వారా జవానుల సామర్థ్యం పెంచడంలో వుందని ఆయన అన్నారు. భద్రతాదళాల వృత్తిపరమైన స్థాయి నిలబెట్టడానికి, బాధ్యత తీసుకొనేందుకు వేరేశాఖ అవసరమని ప్రధాని సూచించారు. భద్రతా దళాల శిక్షణ కార్యక్రమం నడపేవారిని చిన్నచూపు చూసే తత్వాన్ని ఆయన విమర్శించారు. శిక్షణ అనేది చాలా ముఖ్యమైన భాగమని, మంచి సమర్థులైన వారిని మాత్రమే శిక్షణా కేంద్రాల్లో నియమించాలని అయన అన్నారు. దేశ పరిస్థితుల్లో వస్తున్న మార్పుల గురించి జవానులకు తెలియ జెప్పేందుకు బోధ నాంశాలను ఎప్పటికప్పుడు సమీక్షిస్తుండాలని ప్రధాని కోరారు సరిహద్దు భద్రతా దళం, రక్షణదళాలను పదేపదే పౌరవిధులకు నియమించడం గురించి ప్రస్తావిస్తూ, శాంతి భద్రతల రక్షణలో వీరి పాత్ర తగ్గించడానికి చర్యలు గైకొంటున్నట్టు శ్రీరాజీవ్‌గాంధీ వెల్లడించారు. పౌర విధుల్లో రక్షణ దళాలను పదేపదే వినియోగిం చడం వల్ల వారి సామర్థ్యం దెబ్బతింటోందని ఆయన అన్నారు.

సమర్థులైన వారినే రక్షణ దళాల్లోకి రిక్రూట్ చేసుకోవాలని అంటూ కొత్తగా 12 సి ఆర్.పి. బెటాలియన్లను ఏర్పాటు చేయడానికి హోంమంత్రిత్వశాఖ గైకొన్న నిర్ణయాన్ని ప్రధాని ప్రస్తావించారు. వర్ధమానదేశంలో ఉద్రిక్తతలు నెలకొనడం సహజమని, పేదలను దారిద్ర్యంనుంచి విముక్తం చేయడానికి ప్రయత్నం జరిగినపుడు స్వార్థ పరశక్తులు ప్రతిఘటించి తీరుతాయని, ఇందువల్ల సాంఘిక ఉద్రిక్తతలు తలెత్తుతాయని ప్రధాని వివరించారు. అయితే శాంతియుత పరిస్థితుల లోనే పేదల అభివృద్ధి సాధ్యమని, సి ఆర్.పి వంటి పారామిలిటరీ దళాలు ఉద్రిక్తతలు సడలించడానికి తోడ్పడవలసి వుంటుందని ఆయన అన్నారు.

పంజాబ్, అస్సాంలలో క్రమేపీ సాధారణ పరిస్థితి నెలకొంటున్నదని అయితే సి.ఆర్ పి. బాధ్యత తగ్గిందని దీని అర్థం కాదని ప్రధాని చెప్పారు. పారమిలటరీ దళాలను శాంతి భద్రతల రక్షణలో సహాయ పడేందుకు పిలిపించి, అపుడు వారికీ, స్థానిక పోలీసులకు మధ్య సమన్వయం అవసరమని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు। సి.ఆర్.పి. ఉద్యోగుల సమస్యలు పరిష్కరించడానికి ప్రభుత్వం తప్పక కృషి చేస్తుందని ప్రధాని వారికి హామీఇచ్చారు. ఈ సందర్భంగా ప్రధాని పలువురు సి.ఆర్.పి. ఆఫీసర్లకు రాష్ట్రపతి పతకాలను అందజేశారు.



# నవభారతానికి యువత చేయూత

**రాజీవ్ పిలుపు:-**

భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ నవభారత నిర్మాణానికి యువతరం చేయూతకై పిలుపు నిచ్చారు. కాకినాడ బహిరంగసభకు అశేష జనావని హాజరై కిక్కిరిసి నిండినది. ఆయన ఎంతో గంభీరంగా ప్రసంగిస్తూ కాంగ్రెస్ (ఐ) ఎల్లప్పుడు సిద్ధాంతాలకు నిలిచి దళిత, పీడిత, బలహీనవర్గాల సంక్షేమానికి నిలుస్తుందని, ప్రతిపక్షపార్టీలు అధికారంకోసం వేర్పాటువాదులు, మతోన్మాదులు, ప్రాంతీయవాదులతో చేతులు కలిపి దేశవిచ్ఛిన్నాన్ని కాంక్షిస్తున్నాయనీ, హింసా కాండను ప్రోత్సహిస్తూ దేశంలో అశాంతికి, అల్లకల్లోలాలకు తోడ్పడుతూ జాతి సమైక్యతకు, సమగ్రతకు భంగకరంగా తయారైనాయని ఆరోపించారు.

జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ వేసిన దేశపునాదులను ఋల్లెట్లు కదిలించలేవనీ, విచ్ఛిన్నం చేయలేవని ఆయన స్పష్టంచేశారు. వేర్పాటు శక్తులపట్ల అరాచక శక్తులపట్ల ఎంతో అప్రమత్తతతో ఉండి దేశ సమైక్యతను, సమగ్రతను పరిరక్షించడంతో సహకారించాలని వోటర్లకు శ్రీరాజీవ్ విజ్ఞప్తిచేశారు. తమపార్టీకి వోటువేసి తిరిగి అధికారానికి గెలిపించినట్లయితే మహిళలకు, మైనారిటీలకు, హరిజనులకు ఇతర బలహీన వర్గాలకు పూర్తి రక్షణ కల్పించగలమని ఆయన హామీ ఇచ్చారు.

## ఎవరిని గెలిపించాలో నిర్ణయించుకోండి?

**రాజమండ్రి :-**

ప్రాంతీయతత్వాన్ని కులమత ఉన్మాదాలను ప్రోత్సహించే శక్తులకు వోటు వేస్తారో, లేదా దేశ సమైక్యతే ధ్యేయంగా గల కాంగ్రెస్ (ఐ) లాంటి పార్టీలను గెలిపిస్తారో ప్రజలు స్వయంగా నిర్ణయించుకోవాల్సిన అవసరం ప్రస్తుతం ఎంతో ఉన్నదని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. రెండురోజుల రాష్ట్ర పర్యటన శ్రీరాజీవ్

విజయవంతంగా ముగిసింది. రాజమండ్రి, అమలాపురం, భీమవరం కాకినాడ, యలమంచిలి సభలకు అసంఖ్యాక జనం వచ్చారు. ప్రాంతీయ తత్వాలవంటి సంకుచిత భావాలను ప్రచారంచేసే అభ్యర్థులకు వోటు వేయ్యవద్దని ఆయన విజ్ఞప్తిచేసారు. కోస్తా ప్రాంతాలకు అయన పర్యటనతో కాంగ్రెస్-ఐ వరంగా కొత్తఊపు వచ్చింది. తెలుగుదేశం పార్టీ ఆర్థికవ్యవస్థను చిన్నాభిన్నం చేస్తు దుష్పరిపాలనను తుదముట్టించవలసిన తరుణం ఆసన్నమయిందని శ్రీరాజీవ్ పలుసభలలో విజ్ఞప్తిచేసారు. విశాఖపట్నం మీదుగా ఆయన మహారాష్ట్ర పర్యటనకు వెళ్ళారు. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ పర్యటన తర్వాత మళ్ళి ఆంధ్రరాష్ట్రంలో పర్యటించారు.

రాజమండ్రిలో, లాల్‌బహదూర్ గ్రౌండ్స్‌లో జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తూ దేశ సమైక్యతను, సమగ్రతను పరిరక్షించాల్సిన బాధ్యత ప్రజలకు ప్రస్తుత సమయంలో ఎంతో ఉన్నదని ఆయన అన్నారు. ప్రతిపక్ష పార్టీలు దేశాన్ని చిన్నాభిన్నంచేసి తద్వారా తమ ప్రయోజనాలను కాపాడుకోవాలని చూస్తున్నాయని, ఇందుకు ప్రజలను అవసరమైన విషయాలలో రెచ్చగొడుతున్నారని శ్రీరాజీవ్ ఆరోపించారు. ఈ లక్ష్యంతోనే వారు ప్రధానిని కూడా దూరం చేశారని అన్నారు. శ్రీమతి ఇందిరాగాంధీని బలితీసుకున్నప్పటికి దేశ సమగ్రత, సమైక్యత కొనసాగ గలదని నిరూపిస్తున్నామని అన్నారు. జాతిని సమైక్యంగా ఉంచాలో లేదా చిన్నాభిన్నంచేసి పురోగతికి స్వస్తిచెప్పాలో అనేది ప్రజలు తెలుసుకుని ప్రవర్తించవలసిన సమయం ప్రస్తుతం అవసరమైందని అనన్యమైందని శ్రీరాజీవ్‌గాంధీ హెచ్చరించారు. దేశం ప్రగతిపథంలో కొనసాగాలంటే సుస్థిరమైన, సమర్థవంతమైన ప్రభుత్వాన్ని ఎన్నుకోవాల్సి ఉందని చెప్పారు. వెనుకబడినవారు ఇంకా వెనుకబడి ఉండాలని అనుకోవడం అలాగే నిలిచిపోవడం తగదని తాము కూడా ప్రధాన జీవన వాహినిలో కలిసి పోవాలని శ్రీరాజీవ్ ఉద్బోధించారు. శాస్త్రీయ సాంకేతిక వైజ్ఞానిక రంగాలలో దేశం ఎంతో పురోగతిని సాధించిందవీ వాటిఫలితాలను గ్రామీణప్రజలకు అందుబాటులో ఉండేలా చూడాలని ఆయన అన్నారు. కాంగ్రెస్ (ఐ) ఒక్కటే సుస్థిరమైన ప్రభుత్వాన్ని నెలకొల్పగలదనీ, జనతా హయాంలో దేశం ఎలా ఉందో ఆయన వివరించారు. ఆంధ్రరాష్ట్రంలోని ప్రభుత్వం అధికారంలో నిలదొక్కుకో లేక (తెలుగుదేశంపార్టీ పోయిందనీ, ఇలాంటి పార్టీలన్ని దేశానికేమి న్యాయం చేస్తా యని ఆయన ప్రశ్నించారు. తెలుగుదేశం ప్రభుత్వం చెప్పు కుంటున్నట్లు అది

స్వయంగా సాధించింది ఏదీలేదని, అయితే తెలుగుదేశం సాధించింది మాత్రం ఒక్కటి ఉందని, అది రాష్ట్రాన్ని మరింత వెనుకబడినదిగా చేయడమేనని హర్షధ్వానాల మధ్య శ్రీ రాజీవ్‌గాంధీ తెలిపారు.

## రాజీవ్ విస్మయం

అసెంబ్లీని రద్దుచేసిన తరువాత కూడా తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలో కొనసాగడం పట్ల శ్రీరాజీవ్ విస్మయాన్ని ప్రకటిస్తూ ఇది కూడా అది సాధించిన ఒక విజయమేనా అని ప్రశ్నించారు. సమగ్ర భారతం కావాలా? విచ్ఛిన భారతం కావాలా? అని ఆయన ప్రశ్నించగానే ప్రజలందరు ఒకేసారి తమ చేతులు పైకెత్తి సమగ్ర భారతం కావాలని సూచించారు. శ్రీ రాజీవ్‌గాంధీ ప్రసంగాన్ని యువజన కాంగ్రెస్ నాయకుడు శ్రీ వి. అరుణ్‌కుమార్ తెలుగులోకి అనువాదం చెప్పారు.



# టెరరిజం కోరలు పీకే పోలీసు వ్యవస్థ

ఉగ్రవాదాన్ని అంతమొందించేందుకు పోలీసు వ్యవస్థలో గణనీయమైన మార్పులు జరగాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ఉద్ఘాటించారు. సర్దార్ వల్లభ భాయ్‌పటేల్ నేషనల్ పోలీస్ అకాడామీలో ఐ.పి.యస్ ప్రొబేషనర్లను ఉద్దేశించి ప్రసంగిస్తూ, దేశంలోని వివిధ ప్రాంతాల్లో తలెత్తుతున్న ఉగ్రవాదాన్ని అరికట్టేందుకు పోలీసు వ్యవస్థను పూర్తిగా మార్చవల్సి ఉన్నదని, నూతన పద్ధతులు క్రొత్త సాంకేతిక పరిజ్ఞానం అనుసరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని ఆయన అభిప్రాయపడ్డారు. నేరస్థులతో వ్యవహరించడంలో పూర్వంనుంచి పోలీసు వ్యవస్థ అనుసరిస్తున్న విధానాలే ప్రస్తుతం అమలులో ఉన్నాయని, ఉగ్రవాదాన్ని అణచివేయడంలో అవి అంతగా ఉపకరించడం లేదని శ్రీరాజీవ్ గాంధీ అన్నారు. దేశంలో ఏదో ఒకమూల నిత్యం ఉగ్రవాద ప్రమాదం తలెత్తుతూనే ఉందని ఆయన అన్నారు.

మనం అభివృద్ధి చెందుతున్నాము. ప్రాజెక్టులు కట్టుకొంటూ అభివృద్దిని సాధించుకొంటూ పోవడమే ప్రభుత్వ లక్ష్యంకాదు. దేశంలోపల మరోవైపు శాంతిభద్రతలను కాపాడుకోవలసిన అవసరం కూడాఉంది. అప్పుడే దేశసమైక్యత పరిరక్షింప బడుతుందని ఆయన అన్నారు. దేశంలో సుస్థిరమైన క్రమశిక్షణ కల్గిన ప్రజల మద్దతులేకుండా సైనిక దళాలను రక్షణకోసం సరిహద్దులకు పంపడంవల్ల పెద్దప్రయోజనమేమి ఉండదని, దేశంలో శాంతిభద్రతలు సుస్థిరంగా ఉన్నప్పుడే బయటి శత్రువులతో పోరాడగలమనీ, పోలీసు వ్యవస్థ సహకారం లేకుండా సైన్యం ఏమిచేయజాలదనీ ఆయన ప్రొబేషనర్లను ఉద్దేశించి అన్నారు. ఎక్కడైనా దేశంలో శాంతి భద్రతల సమస్య తలెత్తినపుడు సైన్యాన్ని, పారామిలిటరీ దళాలనూ తెప్పించడానికి ఇకమీదట స్వస్తి చెప్పాలని, పోలీసులే ఆసమస్యను సమర్థవంతంగా చక్కదిద్దాలని ఆయన చెప్పారు. శాంతి భద్రతల సమస్యను చక్కదిద్దే బాధ్యతను తమ భుజస్కంధాల పై వేసుకొనేందుకు ముందుకు రావాలని శ్రీరాజీవ్‌గాంధీ ప్రొబేషనర్లను కోరారు.

దేశంలో ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కొనే స్థాయికి పోలీసు వ్యవస్థ ఎదగాలని ఆయన అన్నారు. అకాడమీలో ప్రొబేషనర్లకు తగు విధంగా శిక్షణనివ్వడంలేదని ప్రస్తుతం ఇస్తున్న శిక్షణ ఆధునికంగా లేదని ఆయన విచారం వ్యక్తంచేశారు. శిక్షణకూ

# అంత దూరం ఎంత చేరువో

## బియాండ్‌వార్ :-

యుద్ధం. అణ్వస్త్రాల ప్రమాదాన్ని అంతం చేయాలని నిఖిల ప్రపంచానికి పిలుపునిచ్చి, ప్రపంచ శాంతి సాధనకు చొరవ తీసికొన్నందుకు ప్రధాని రాజీవ్‌గాంధీ ఐదు ఇతర దేశాల అధినేతలు తమతమ దేశాల రాజధానులలో "బియాండ్ వార్" సంస్థ అవార్డులను అందుకున్నారు. అధునిక సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి క్రమంలోని ఒక అద్భుత సంఘటనగా పేర్కొనదగిన ఈ బహుమతి ప్రధాన ఉత్సవాన్ని ఐదుఖండాల ప్రజలు ఆసక్తితో టెలివిజన్‌లో తిలకించారు.

ప్రధాని రాజీవ్‌గాంధీ అర్జెంటినా అధ్యక్షుడు, మెక్సికో అధ్యక్షుడు, టాంజానియా మాజీ అధ్యక్షుడు, స్వీడన్ ప్రధాని, గ్రీస్ ప్రధాని తమదేశాల రాజధానులలో పత్యేకంగా జరిగిన ఉత్సవంలో ఒకే సమయానికి "బియాండ్‌వార్" సంస్థ ప్రతినిధులనుంచి అవార్డులను అందుకున్నారు.ఆరుదేశాలలోని ఉత్సవాలు ఒకేసారి టెలివిజన్‌తో ప్రచారమై ఆరుగురు నాయకులు ఒకే వేదికపైన ఉన్నారనే భ్రమకలిగించేలా ఈ కార్యక్రమాన్ని ఐదు ఖండాలలోని ప్రజలు ప్రత్యక్షంగా టెలివిజన్‌లో తిలకించే ఏర్పాటు చేశారు.

ఆరుదేశాల నాయకులు జనవరి 1987 వ సం॥లో ప్రపంచ దేశాలకు ఇచ్చిన పిలుపును "న్యూఢిల్లీ ప్రకటన" అని వ్యవహరించారు. 1884 మే 22 వ తేదినకూడా మాజీ ప్రధాని ఇందిరాగాంధీ, ఐదుగురు ఇతర దేశాలు విశ్వశాంతి సాధనకై పిలుపునిచ్చారు. దాదాపు 50 దేశాల పార్లమెంట్ సభ్యులను సన్నిహిత పరిచే "పార్లమెంటేరియన్స్ ఫర్ వరల్డ్ ఆర్డర్" అనే సంస్థ ఆరుదేశాల నాయకులు ముక్తకంఠంతో ప్రపంచశాంతికి సందేశం ఇచ్చేందుకు చొరవతో చర్య తీసుకున్నది.

చేసేపనికి దగ్గర సంబంధం ఉండాలని, అనుభవజ్ఞులైన వారిచే ప్రొబేషనర్లకు శిక్షణ నివ్వాలని ఆయన కోరారు.

అంతకు ముందు శ్రీరాజీవ్‌గాంధీ అకాడమీకి చెందిన 270 ఎకరాల ప్రాంగణాన్ని సందర్శించారు. శిక్షణ పొందే స్థలాన్ని మ్యూజియంను, గ్రంథాలయాన్ని, ప్రయోగశాలనూ అకాడమీలోని వివిధ శాఖలను సందర్శించారు. శిక్షణ పొందుతున్న ఎనభై మంది ప్రొబేషనర్లలో ఇరువురు భూటాన్‌కు చెందిన వారున్నారు.

'శిక్షణ సరిగాలేదు':-

హైదరాబాద్‌లోని సర్దార్ వల్లభ భాయ్ పటేలు నేషనల్ పోలీసు అకాడమీలో అనుసరిస్తున్న శిక్షణా పద్ధతులను ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ విమర్శించారు. 'వైర్ లెస్ రేడియోను ఎలా ఆపరేట్ చేయాలో తెలుసా? కారుడ్రయివింగ్ వచ్చా? నేరస్థులతో ప్రత్యక్ష పోరాట సందర్భంలో కలపడినపుడు తుపాకిని ప్రేల్చడం ఎలాగో నేర్చుకున్నారా? అని శిక్షణ పొందుతున్న వారిని ప్రధాని అడిగారు. వచ్చిన సమాధానాలను బట్టి శిక్షణ తీరును ఆయన గ్రహించి అకాడమీని విమర్శించారు. ప్రస్తుత పరిస్థితులకు తగినట్లుగా ఈ అకాడమీలో శిక్షణ సౌకర్యాలులేవని ఆయన ప్రొబేషనర్లను ఉద్దేశించి ప్రసంగిస్తున్నప్పుడు విచారం వ్యక్తం చేశారు.

ఈ అకాడమీలో ఎక్కడా రేడియో కనబడలేదు. పోలీసులుగా మీరు రేడియోను వృత్తిపరమైన నైపుణ్యంతో ఆపరేట్ చేయవలసి ఉంటుంది. చాలమంచి సెక్యూరిటీ సిబ్బందికిచ్చే, హాండ్ సెట్‌వలె ఆపరేట్ చేయడం కూడదు" అని ఆయన శిక్షణ పొందుతున్నవారితో అన్నారు. ఈ అకాడమీడ్రయివింగ్ స్కూలు లేకపోవడాన్ని ఆయన విమర్శిస్తూ గమ్యాన్ని సకాలంలో చేరుకోడానికి పోలీసుమాన్ కారును చాలా నైపుణ్యముతో వేగంగా నడపవలసి ఉంటుందని ఆయన అన్నారు. అలాగే తుపాకాల్చడం కూడా పోలీసువారికి సరిగా నేర్పక పోవడం విచారకమని ఆయన విమర్శించారు. కొన్ని నెలల క్రితం సెక్యూరిటీ స్టాఫ్‌కు కూడా ఈ అంశాలలో, శిక్షణ ఉండేది కాదని చెప్పారు. ఇవన్ని స్వర్గంనుంచి దిగివచ్చి అబ్బేవికావు. నేర్పవలసిందే అని ఆయన అన్నారు.

ఎనిమిది సమాచార ఉపగ్రహాల ద్వారా ఆరుదేశాల నాయకులను దగ్గరకు చేర్చిన అపూర్వ కార్యక్రమంలో ఈ నాయకులు అవార్డులను అందుకుంటూ పరస్పరం అభినందనలు తెలుపుకున్నారు. ఢిల్లీలో ఈ ఉత్సవం టెలివిజన్ స్టూడియోస్‌లో జరిగింది. ఇండియా అంతటా టెలివిజన్‌లో ఈ కార్యక్రమం ప్రసారం చేసారు. ఆరుదేశాల రాజధానులలో విడివిడిగా జరిగిన ఉత్సవాలను శాన్‌ఫ్రాన్సిస్కో-అమెరికా లోని కేంద్రస్థానంలో సాంకేతిక నిపుణులు సమన్వయపరచి భూమికి 22 236 మైళ్ళ ఎత్తున ఉన్న వెస్టార్ ఫోర్ ఉపగ్రహానికి అందించారు. సమన్వయ కార్యక్రమం ఈ ఉపగ్రహంద్వారా వివిధ దేశాలకు ప్రసారం అయింది.

పద్నాలుగు అంగుళాల ఎత్తున దీర్ఘచతురస్రాకార స్ఫటికాకృతితో ఉన్న అవార్డుపై ప్రపంచంలోని ఖండాలను చెక్కారు. ఆవార్డు ఫలకంలో అన్నిదిశలా "ఎవరల్డ్ బియాండ్ వార్" అనే అక్షరాలను చెక్కారు.

—o—

# కామన్వెల్తు శిఖరాగ్రసభ

లండన్:-

మినీ శిఖరాగ్రసభలో కామన్వెల్తు కోల్పోయిన దానికంటే బ్రిటన్ కోల్పోయిందే ఎక్కువని ప్రధాని రాజీవ్‌గాంధీ అన్నారు. దక్షిణాఫ్రికా జాత్యహంకార ప్రభుత్వంపై ఆంక్షలకు బ్రిటన్‌ను ఒప్పించడానికి శిఖరాగ్రసభ విఫలమైన తర్వాత మెక్సికోకు వెళ్ళేముందు ఆయన లండన్‌లో విలేకరులతో మాట్లాడారు. బ్రిటన్‌కు ఇక నాయకత్వం వహించే అర్హత లేదని శ్రీరాజీవ్ అన్నారు. ఎన్నో ఏళ్ళుగా కొన్ని సిద్ధాంతాలకు, విలువలకు కట్టుబడివున్న బ్రిటన్ ఈనాడు ఆర్థిక లాభాంకోసం వాటిని పణంగా పెడుతోందని భారత ప్రధాని యువనేత శ్రీరాజీవ్‌రత్న ఆరోపించారు.

బ్రిటన్ సమగ్ర ఆంక్షలను నివారించడం వల్ల రాగల పరిణామాలు ఏవని ప్రశ్నించినపుడు ఆంక్షల ఫలితం ఆర్థికంగా, మానసికంగా రెండురకాలుగా ఉంటుందని ఆయన అన్నారు. బ్రిటన్ తిరస్కారం వల్ల ఆర్థికప్రభావం తక్కువగా ఉన్నా, మానసికంగా దక్షిణాఫ్రికాపై ఇది గట్టి దెబ్బనని రాజీవ్ అన్నారు. ఇప్పుడే కామన్వెల్తు నాయకులతో వారు శిఖరాగ్ర సమావేశం జరపాల్సిన అవసరంలేదని ప్రధాని చెప్పారు. ఏడుదేశాల అధినేతలు మరోసారి సమావేశమై, పూర్తిస్థాయి శిఖరాగ్రచర్చలు, అవసరమైంది లేనిది నిర్ణయిస్తారని ఆయన చెప్పారు. బ్రిటన్ పైన ఏదైనా ప్రతిఘటన చర్య తీసుకుంటారా అన్న ప్రశ్నకు దానిగురించి ఇంకా ఆలోచించలేదని ఆయన అన్నారు. దక్షిణాఫ్రికా దాడులను ప్రతిఘటించేందుకు ప్రధానమైన ఆఫ్రికా దేశాలకు సైనిక సాయం తప్ప, ఇతరత్రా ఎలాంటిసాయమైనా చేసేందుకు కామన్వెల్తు దేశాలు సిద్ధమేనని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. మన శిఖరాగ్రసభ ఫలితంగా బ్రిటిష్‌రాణితో పొరపొచ్చాలు వచ్చే అవకాశాలున్నాయా అన్న ప్రశ్నకు, కామన్వెల్తు రాజకీయాల్లోకి ఆమెను లాగడం మాకు ఇష్టంలేదు.

కామన్వెల్తు అధినేతగా, ఆమెనుంచే మేము శక్తిని, ప్రేరణను పొందుతాం, అని జవాబు నిచ్చారు. శ్రీరాజీవ్‌గాంధీ. దక్షిణాఫ్రికాలో ప్రభుత్వం మారితే, అక్కడి భారతీయులకు వెనకి తీసుకుంటారా అన్న ప్రశ్నకు జవాబుగా, ఆరోజు వచ్చినపుడే దాన్ని గురించి ఆలోచిస్తామని ఆయన అన్నారు. బ్రిటిష్ ప్రధాని మార్గరేట్ థాచర్ "చాలా ఆంక్షలు విధించేశానని అంటున్నారని ఒక విలేకరి ప్రస్తావించగా ఇప్పుడు చూస్తే ఆమె ఇచ్చినవి చాలాతక్కువని అనిపిస్తున్నట్టు రాజీవ్ చెప్పారు. అమెరికా సేనేట్ రీగన్‌ను ఆంక్షలకు ఒప్పించగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తంచేశారు. దక్షిణాఫ్రికాపై ఆంక్షలు ప్రకటించిన ఏకైక 'అంతార్జాతీయవేదిక' కామన్వెల్తేనని రాజీవ్ చెప్పారు. మొత్తానికి బ్రిటన్ వైఖరి తనను నిరాశపరిచిందని ఆయన అన్నారు.

మినీ శిఖరాగ్ర సమావేశంలో పాల్గొన్న భారత్, ఆస్ట్రేలియా, కెనడా, జింబాబ్వే, జాంబియా, బహమా దేశాలనాయకులు థాచర్‌ను ఒప్పించడానికి విశ్వ ప్రయత్నాలు చేశారు. ఆంక్షల అమలు పర్యవేక్షించేందుకు ఒక మానిటర్‌రింగ్ కమిటీని ఏర్పరచాలని, ఆంక్షల వల్ల కలిగే ఆర్థిక నష్టాలభర్తీ కామన్వెల్తు దేశాలు మరింతగా సహకరించుకోవాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ చేసిన రెండు సూచనలను థాచర్ తిరస్కరించారు.

'ప్రజాస్వామ్యం' గురించి ఆమె ప్రస్తావించగానే, ప్రధాని రాజీవ్‌గాంధీ మరొకరికి ఏదినుంచిదో చెప్పడం బ్రిటన్ దిట్టఅని అవహేళన చేశారు.



# ఆయుధపోటీ ఉపఖండంలో అనవసరం రాజీవ్‌గాంధీ

అత్యంత శక్తివంతమైన, ఆధునిక ఆయుధాల సరఫరాను పాకిస్తాన్‌కు తగ్గించాలని భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు. పాకిస్తాన్ ఆసియా ఉపఖండంలో ఆయుధాల పోటీని ప్రారంభించిందని, తమ దేశానికి అలాంటి ఉద్దేశం లేదని తప్పనిసరైతే వెనుకాడబోమని అలాగని అలాచేయాలని కోరడం లేదని ఆయన టైమ్ మేగజైన్ తాజా సంచికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపారు. భారత దేశం శ్రద్ధ వహించాల్సిన ఉత్తమ అంశాలు ఎన్నెన్నో ఉన్నాయని శ్రీరాజీవ్ చెప్పారు.

పాకిస్తాన్‌లో ఏర్పడిన చిక్కులు సమస్యలకు స్వస్తివాక్యం పలికి దానితో సత్సంబంధాలను మెరుగు పరచుకోవాలని భారతదేశం ఆశిస్తున్నదని శ్రీరాజీవ్ స్పష్టం చేశారు, పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ జియా 1984 నవంబరు మాసంలో శ్రీమతి ఇందిరాగాంధీ అంత్యక్రియలకు హాజరైనప్పుడు ఎంతో అనుకూలంగా మాట్లాడి కొద్ది రోజులైనా కాకముందే పాకిస్తాన్ అధికారులు వాటిని ఆచరణలో చూపలేక పోయారని ప్రధాని అన్నారు. ఎమ్యూ ఫేస్‌ఫర్ 'ఇండియా' అనే శీర్షికలో ఈ ఇంటర్వ్యూను 'టైమ్' కవర్‌స్టోరీగా ప్రచురించినది. యాభై నిమిషాలపాటు సాగిన ఈ ఇంటర్వ్యూలో శ్రీరాజీవ్‌గాంధీ భారత ఆర్థిక వ్యవస్థ, అగ్ర రాజ్యాలతో సంబంధాలు, వేర్పాటు వాదుల హింసా దౌర్జన్యకాండ, స్వయం ప్రతిపత్తి కోరుతున్న కొన్ని ప్రాంతాలు, భారత - పాకిస్తాన్ సంబంధాలు, పంజాబ్ సమస్యకు సంబంధించిన ప్రశ్నలకు తమ అభిప్రాయాలను తెలిపారు.

లోకసభ ఎన్నికలలో తనకు లభించిన విజయం గురించి శ్రీరాజీవ్ మాట్లాడుతూ మార్పును, స్వచ్ఛతను, సమర్థతను కోరుతూ ప్రజలు ఇచ్చిన తీర్పు అని అభివర్ణించారు. తమకు వోటువేసిన వారితో సగానికిపైగా నలభైఏళ్ళకు లోపున వారేనని అన్నారు. తాము అనేక అంశాలకు ప్రాధాన్యత ఇస్తున్నామని వాటిలో

ముఖ్యమైనది విద్య అన్నారు. విద్య అంటే కేవలం పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలకే పరిమితం కాకుండా పాలనా యంత్రాంగం, పారిశ్రామిక రంగానికి కూడా విస్తరిస్తామని అన్నారు. మనం నేర్చుకున్నదెంత? ఇంకా ఎంత నేర్చుకోవాలి? ఎలా మెరుగవాలి అనే అంశాలను గురించి కూడా ఆలోచిస్తున్నామని శ్రీరాజీవ్ అన్నారు.

అధికార యంత్రాంగంపై అదుపును కోల్పోకుండానే అంక్షలను సడలించి సమర్థవంతంగా పని జరిగేలా చూడాలని ఆయన అభిప్రాయపడ్డారు. దేశ ఆర్థిక వ్యవస్థ గురించి ఆయన ప్రస్తావిస్తూ విదేశ సంస్థల ప్రాబల్యాన్ని తానెప్పుడు ప్రతిఘటిస్తూనే ఉన్నామని అన్నారు. గతంలో ఈ స్టిండియా కంపెనీ భారత దేశాన్ని హస్తగతం చేసుకోవడంవల్ల కలిగిన చేదు అనుభవాల ఫలితమేనని అన్నారు. ప్రస్తుత దేశ ఆర్థికవ్యవస్థ పటిష్టవంతంగా ఉందని అన్నారు.

ప్రభుత్వరంగం ఎంతగానో విస్తరించిందని, అయితే అది అలాగే కొనసాగాలని తాను భావించడం లేదని, ప్రయివేటు రంగం సమర్థవంతంగా, పటిష్టవంతంగా పనిచేయని దశలో పోటీకి, సవాళ్ళకు తట్టుకొనిన పరిస్థితులలో ప్రభుత్వరంగం జోక్యం కల్పించుకోవాల్సిన అవసరం ఉందనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ప్రయివేటురంగం చేయని పనులను ప్రభుత్వరంగం చేపట్టి ప్రగతిని సాధిస్తున్నదని అన్నారు. అంతే కాకుండా ప్రవేటురంగాన్ని కూడా ప్రోత్సహిస్తున్నామని తెలిపారు. ప్రస్తుతం ఏర్పడిన స్పర్థలకు, సమస్యలకు, చిక్కులకు స్వస్తిచెప్పి పాకిస్తాన్‌తో సంబంధాలను మెరుగు పరచుకోవాలని భారత దేశం ఆకాంక్షిస్తున్నదని శ్రీరాజీవ్‌గాంధీ తెలిపారు. జనరల్ జియా భారతదేశానికి వచ్చినపుడు ఎంతో అనుకూల ప్రసంగాలు చేసి వెళ్ళిన కొద్దిరోజులైనా కాకముందే పాక్ అధికారులు కార్యరూపంలో పెట్టక పోవడం పట్ల శ్రీరాజీవ్ విస్మయం ప్రకటిస్తూ, భారత హైజాకర్ల విషయంలో వారు ఎలాంటి చర్య తీసుకోక పోవడం చూస్తే వాళ్ళకు నిజంగా ఏం కావాలో తెలియక సందేహాలు కలుగుతున్నాయని అన్నారు.

పాకిస్తాన్ ఆయుధాలను పోగు చేసుకోవడం ప్రమాదకరమని, అంతకుముందు తీసుకున్న ఆయుధాలను ఆఫ్ఘానిస్తాన్‌పై ప్రయోగించే అవకాశాలు లేవని గతంలో

భారతదేశంపై వాటిని ప్రయోగించిన విషయం అందరికి తెలిసిందేనని అన్నారు. ఉభయ దేశాల మధ్య సాధ్యమైనంత సత్వరంగా ఉద్రిక్తతలను తగ్గించుకుంటే మంచిదని అందుకు అత్యంత శక్తివంతమైన ఆధునిక ఆయుధాల సరఫరా తగ్గించుకుంటే మంచిదని తాము అభిప్రాయ పడినట్లు శ్రీరాజీవ్ తెలిపారు. పాకిస్తాన్, ఆసియాఖండంలో ఆయుధాల పోటీని ప్రారంభించిందని అయితే అందుకు తాము అంత ఆసక్తితో లేమని ఆయన అన్నారు. అగ్రరాజ్యాలతో భారత సంబంధాల గురించి శ్రీరాజీవ్ తెలియజేస్తూ, రష్యాకు, భారతదేశానికి మధ్య పటిష్ఠమైన సంబంధాలు ఉన్నాయని, చిరకాలంగా ఉభయదేశాలు మైత్రిభావంతో 'మెలుగుతున్నాయని' అన్నారు.

స్నేహితులుగా అవసరాలలో పరస్పరం ఆదుకుంటున్నాయని అన్నారు' అలాగని అమెరికాతో మైత్రిని, సత్సంబంధాలను ప్రతిరంగంలో అమెరికాతో సన్నిహిత సత్సంబంధాలను మెరుగు పరుచుకుంటునే ఉన్నామని అన్నారు. స్వయం ప్రతిపత్తి కోరేరాష్ట్రం గురించి ఆయన ప్రస్తావిస్తూ, ముఖ్యమంత్రులు కేంద్రం జోక్యాన్ని అంతగా కోరకుండా తమ ప్రభుత్వాలు నడపాలని తాము ఆకాంక్షిస్తూ ఉన్నామని, అయితే రాష్ట్రాలు జాతీయ ప్రయోజనాలకు, సమగ్రతకు ప్రాధాన్యత నివ్వాలని అన్నారు. రాష్ట్రాలు కేంద్రాకికి దూరం కాకూడదని అలాగని పోరాటానికి తలపడకూడదని శ్రీరాజీవ్ అన్నారు. పశ్చిమబెంగాల్లో మార్క్సిస్టు ప్రభుత్వ పూర్తిగా విద్యావిధానాన్ని మార్పుచేసి మార్క్సిజం గురించి బోధనలు ప్రారంభిం చిందని, దేశం గురించి ఆలోచించడం లేదని అది అమోదయోగ్యమైన విషయమేనా అని ఆయన ప్రశ్నించారు.

కులాలవారిగా, మతాలవారిగా ప్రత్యేకమైన సమస్యలేమీ లేవని అన్నింటి మూలం ఆర్థిక సమస్యయేనని శ్రీరాజీవ్ అన్నారు. ఎన్నికలకు ముందు దేశ అనైక్యతతో చిన్నాభిన్నంగా ఉందని, ఎన్నికల తరువాత దేశం నలుమూలల ఐక్యత ఏర్పడిందని ఇప్పుడు ప్రతివారి ప్రధాన ధ్యేయం దేశసమైక్యత, సమగ్ర అని శ్రీరాజీవ్ తెలిపారు.

—o—

# మేము అణ్వస్త్రాలను తయారుచేయం

మెక్సికో :- అణ్వస్త్రాలను తయారుచేసే ఉద్దేశం భారతదేశానికి లేదని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ స్పష్టం చేశారు. నిరాయుధీకరణ చర్చలకై జరిగిన ఆరు దేశాల శిఖరాగ్ర సభ సందర్భంగా పాత్రికేయుల సమావేశంలో మాట్లాడుతూ, అణ్వస్త్రాల తయారీకి ఎలాంటి పరిశోధనలు జరపడం లేదని, ముడిపదార్థాలను సమకూర్చుకోవడం లేదని ఆయన చెప్పారు. స్వీడన్, మెక్సికో, అర్జెంటీనా, టాంజానియా, గ్రీస్ అధినేతలు కూడా విలేకరుల సమావేశంలో పాల్గొన్నారు. తదితర నాయకులు శ్రీ రాజీవ్‌గాంధీ పలు ప్రశ్నలకు సూటిగా సమాధానాలు ఇచ్చారు.

అణ్వస్త్రవ్యాప్తి నిరోధానికి ముమ్మర ప్రచారం చేయాలనే మెక్సికో ప్రకటన గురించి కూడా పలు ప్రశ్నలు వచ్చాయి. ఈ ప్రకటన విడుదలయింది. ఈ ఆరు దేశాలు అణ్వస్త్రాల ఉత్పత్తి వ్యాప్తికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించేందుకు త్వరలోనే పెద్ద ఎత్తున ప్రచార కార్యక్రమాన్ని ఆరంభిస్తామని స్వీడన్ ప్రధాని ఇంగ్వార్ కార్లసన్ అన్నారు. మెక్సికో ప్రకటన అమెరికా, సోవియట్ తదితర దేశాల నాయకులకు మింగుడుపడక పోవచ్చయని ఆయన వ్యాఖ్యానించారు.

## రాజీవ్‌కు సత్కారం

శ్రీ రాజీవ్‌గాంధీని ముఖ్య అతిథిగా గౌరవించింది. సిటీహాల్‌లో జరిగిన ఉత్సవంలో మేయరు ఆయనకు ప్రశంసాపత్రాన్ని, పతకాన్ని, నగర తాళంచెవిని బహూకరించి సన్మానించారు. మెక్సికో నగర పౌరులకు శ్రీ రాజీవ్‌గాంధీ కృతజ్ఞతలు తెలియజేస్తూ ప్రజాస్వామ్య వ్యవస్థకు, విలువలకు బద్ధులైన మెక్సికో, ఇండియా స్నేహం చిరకాలం వర్ధిల్లాలని కాంక్షించారు. విద్య, విజ్ఞానం, వాణిజ్యంలో పరస్పర సహకారాన్ని మరింతగా పెంపొందించుకోవాలని ఆయన సూచించారు.

మెక్సికో సిటీలోని మహాత్మాగాంధీ స్మారకచిహ్నం గురించి ప్రస్తావించి, మహాత్ముని బోధనలు, సందేశాలు విశ్వజనీనమనేందుకు ఇది నిదర్శనమని శ్రీ రాజీవ్

అన్నారు. తాసాలో ఆరుదేశాల శిఖరాగ్ర సభ ముగిసిన తర్వాత మెక్సికో సిటి చేరుకొన్న శ్రీ రాజీవ్, మెక్సికో అధ్యక్షుడు మైగెల్ డిలా మాడ్రిన్‌తో దాదాపు గంట సేపు చర్చలు జరిపారు. శ్రీ రాజీవ్ గౌరవార్థం మెక్సికో అధ్యక్షుడు విందు చేసారు.

సెంట్రల్ అమెరికా, ముఖ్యంగా నికరాగ్వా సంక్షోభం, మెక్సికో, ఇండియా మధ్య సహకారం పెంపుదల, దేశీయ సమస్యలు చర్చకు వచ్చాయి. సెంట్రల్ అమెరికాలో విదేశీ జోక్యం తగదని రెండుదేశాల నాయకులు ఏకాభిప్రాయం వ్యక్తం చేసారు. పొరుగు దేశాలతో సంబంధాల పెంపుదల, పంజాబ్ సమస్య తదితరాల గురించి శ్రీ రాజీవ్ వివరించారు. సాంకేతిక, వైజ్ఞానిక, వాణిజ్య రంగాలలో సహకారాన్ని పెంపొందుకొనేందుకు ఉభయులు అంగీకారం తెలిపారు. ఉభయ దేశాల చర్చల పర్యవసానంగా వాణిజ్య సహకార సంబంధాలు మరింతగా పెంపొందగలవని భావించారు. ఇనుమురేకులు, ఉక్కుగుళ్ల తదితరాల ఉత్పత్తిలో భారతఖండం మెక్సికోసహకారాన్ని అందజేసుకోగలరని ఆశాభావాన్ని వ్యక్తంచేశారు రాజీవ్‌గాంధీ.

అంతర్జాతీయ ఆర్థిక, రాజకీయ పరిస్థితిని రెండుదేశాల నాయకులు సమీక్షించారు. సరికొత్త అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ సంపన్న దేశాలను దోచుకొనేందుకు కాదని స్పష్టం చేయవలసిన అవసరం ఉన్నదని ఉభయులూ అభిప్రాయపడ్డారు. భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ రెండురోజుల అధికార పర్యటనకై మెక్సికోనగరం చేరుకున్నప్పుడు మన స్వాగతం లభించింది.

## భారత్ బండినినడపడం కత్తిమీద సామే: రాజీవ్‌గాంధీ వ్యాఖ్య

లండన్ :- తుఫాన్‌లో విమానాన్ని నడపడంకంటే భారతదేశానికి నాయకత్వం వహించడమే కష్టమని భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ వ్యాఖ్యానించారు. ఈ బండి ఒకపట్టాన ముందుకు నడవదు. దానికి బద్ధకంజాస్తి. పైపెచ్చు ప్రయాణీకులకు అసహనం ఎక్కువ అని ఆయన దేశాన్ని విమానంతో పోల్చారు. లండన్ నుంచీ వెలువడే 'డెయిలీ టెలిగ్రాఫ్'కు ఇచ్చిన ఇంటర్వ్యూలో ప్రధాని ఈ విధంగా అన్నారు. సత్వరమే అభివృద్ధి సాధించాలని తహ తహలాడే తనకు ఒక్కొసారి ఈ రాజకీయ నాయకులు పాలక వ్యవస్థ స్వలాభాపేక్షపరులు, బ్యూరోక్రసిలను చూస్తే

చిత్తశుద్ధి వుంటుందని ప్రధాని అన్నారు. ఈ ఇంటర్వ్యూలో భారతదేశం 39 ఏళ్ల స్వతంత్ర పాలనా చరిత్రను శ్రీ రాజీవ్ సమీక్షించారు.

భారతదేశం సమస్యల్లోకెల్లా ఘోరమైంది పంజాబ్ చెరగిరిజమని ఆయన చెప్పారు. అయితే పంజాబ్ నాయకత్వాన్ని మార్చే ప్రసక్తిలేదని ఉగ్రవాదుల పోరాటంలో ప్రభుత్వానిదే పైచేయిగా వుందని ప్రధాని అన్నారు. దక్షిణాఫ్రికాను ప్రస్తావిస్తూ, ఆంక్షల విషయంలో బ్రిటన్‌వైఖరి తనకు నిరాశ కలిగించిదని ప్రధాని చెప్పారు. ఈ వైఖరి బ్రిటన్ స్వభావానికి తగినట్లుగా లేదని, బ్రిటన్‌వంటి దేశం నుంచి ఇంతకంటే సభ్య ప్రవర్తనను ఆశించామని ప్రధాని వ్యాఖ్యానించారు. భారత పాలన వ్యవస్థలో అవినీతిపట్ల ఇంతవరకు తను తగినంత కఠినంగా వ్యవహరించ లేదని అంగీకరిస్తూ, త్వరలో ఈ జాడ్యాన్ని తొలగించాలని కృతనిశ్చయంతో ఉన్నట్లు రాజీవ్ చెప్పారు. భారతదేశంలో పనికొచ్చే పార్టీ కాంగ్రెస్ (ఐ) ఒక్కటే నని ప్రధాని అన్నారు. ఇది చాలా దురదృష్టకరమైన విషయమని చెబుతూ, ప్రతిపక్షాలు మరింత నిర్మాణాత్మకంగా ఉంటే బాగుండేదని ఆయన వ్యాఖ్యానించారు. భారతదేశానికి కావాల్సింది సమర్థవంతమైన రెండు లేక మూడు పార్టీల వ్యవస్థే. గాని, 18 పార్టీల వ్యవస్థ కాదని ఆయన అన్నారు.

ప్రజాస్వామ్య పరిరక్షణలోను, సామాజిక పరివర్తనలోను కాంగ్రెస్ పాల్గొంటు ద్విపాత్రాభినయం చేస్తోందని రాజీవ్ అన్నారు. తను అధికారంలోకి వచ్చిన కొత్తలో వున్న "హనీమూన్" స్థానే విమర్శలు వస్తున్నాయని అంటూ, ఊహాలోకాలు వదిలి వాస్తవ ప్రపంచంలోకి దిగడం మంచిదే' అని ఆయన వ్యాఖ్యానించారు.



# అమ్మే ధైర్యము నేర్పింది

రాజీవ్‌గాంధీ తల్లినుంచి ధైర్యాన్ని తీర్మికరణశుద్ధిగా మంచిదని నమ్మిన పనిని ఎన్ని అవాంతరాలెదురైనా సాధించాలన్న పట్టుదలను నేర్చుకున్నానని భారత ప్రధాని రాజీవ్ గార్డియన్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు. తన తాతగారైన నెహ్రూ నుంచి దూరదృష్టిని అలవరచుకున్నానని ఆయన చెప్పారు. ప్రధాన పదవి పొందినప్పటినుండి తన దినచర్యలో తీవ్రమైన మార్పులు వచ్చాయని ఆయన చెప్పారు. తన కుమారుడికి కుమార్తెకు ముఖ్యముగా దీనివల్ల లాభము కంటే నష్టమే ఎక్కువగా కలిగిందని రాజీవ్ చెప్పారు. తక్కిన పిల్లలతో వాళ్ళు స్వేచ్ఛగా ఆడుకోలేరు. భద్రతా కారణాలవల్ల పాఠశాలలకు వెళ్ళలేరు. ఇంట్లోనే ట్యూటర్‌ను పెట్టి చదివించవలసి వస్తోంది అని బాధపడ్డారు. భారత ప్రధానమంత్రి యువనేత రాజీవ్‌గాంధీ.

## రక్షణ దీర్ఘకాలిక వ్యూహము

దేశముచుట్టు భయానక వాతావరణం అలముకొన్న దృష్ట్యా దీర్ఘకాలిక రక్షణ వ్యూహ్యాన్ని రూపొందించుకోవాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు. వైమానికదళ కమేండర్ల ద్వైవార్షిక సభలో ప్రసంగిస్తూ, విదేశీ విధానము, అభివృద్ధి కార్యక్రమాలకు అనుగుణమైనట్టి రక్షణ వ్యూహం అవసరమని ఆయన చెప్పారు. భారత రక్షణ పరిశ్రమ రానున్న పది పదిహేనేళ్ళ అవసరాలను దృష్టిలో ఉంచుకొని పరిశోధనలను మరింత విస్తృతం చేయాలని ఆయన సూచించారు. సత్ సంబంధాలు పొరుగు దేశాలతో పెంపొందించుకొనేందుకు భారతదేశము చొరవ చేస్తున్నదని, కొన్ని యత్నాలు ఫలించాయనీ ఆయన చెప్పారు. భారతదేశము అస్త్ర వ్యాప్తికి చేస్తున్న కృషిని వివరించారు. భారత్ వైమానిక దళం సేవలను ఆయన ప్రశంసించారు. భారత దేశానికి సిబ్బంది మరింత శిక్షణతో సేవ చేయాలనీ, పేరు ప్రతిష్టలు తేవాలని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు.

రక్షణశాఖ సహాయమంత్రి శ్రీఅరుణ్‌సింగ్, మంత్రివర్గ కార్యదర్శి శ్రీపి.కె.కౌల్, వైమానికదళ ప్రధానాధికారి ఎయిర్ ఛీఫ్‌మార్షల్ లాఫాంటెన్ తదితరులు కూడా హాజరయ్యారు.

## 'గంగ'కు కేంద్రం అడ్డంకికాదు

ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్ర ముఖ్యమంత్రులు తెలుగుగంగ ప్రాజెక్టుపై ఉత్పన్నమైన సమస్యలను పరిష్కరించుకోవాలని భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పత్రికా విలేకరులతో మాట్లాడుతూ స్పష్టం చేశారు. అయితే తెలుగు గంగ ప్రాజెక్టు నిర్మాణం విషయములో కేంద్రము సహాయం చేయడానికి ప్రయత్నిస్తుందని ఆయన అన్నారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు బచావత్ ట్రిబ్యునల్ ప్రకారము మిగులు జలాలను వాడుకునే హక్కు ఉందని వాదిస్తుండగా మహారాష్ట్ర, కర్ణాటక ముఖ్యమంత్రులు అసలు మిగులు నీటిపై ఆంధ్రకు హక్కులేదని వాదిస్తున్నారని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. అదేవిధముగా పోలవరం బ్యారేజినిర్మాణం గురించి పరిశీలించడం జరుగుతుందని, బ్యారేజి నిర్మాణంపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఇంకా ఎలాంటి నిశ్చయానికి రాలే దని ప్రధాని అన్నారు. "కేంద్రంవద్ద డబ్బు ఎక్కడుంది. ఆ ప్రాజెక్టుకు రాష్ట్రమే చూసుకోవాలి" అని ఆయన అన్నారు. రాజ్యసభ ఎన్నికల్లో కాంగ్రెస్-ఐ పార్టీశా శాసన సభ్యులు క్రాస్ ఓటింగ్‌కు పాలువడినవారిని గుర్తించడం కష్టమని ఆయన అన్నారు.

## గిరిజనుల అభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధ

రేఖాపల్లిలో ప్రధాని రాజీవ్‌గాంధీ ప్రకటన :- ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పర్య టనకు సతీసమేతంగా వచ్చిన రాజీవ్‌గాంధీకి అపూర్వమైన జనాదరణ లభించింది ఖమ్మంజిల్లా మారుమూల గిరిజన పల్లెల్లోను, రాజకీయ సంగమ కేంద్రం గుంటూరు లోను, జనసందోహము మండుటెండను ఖాతరు చేయకుండా రాజీవ్‌కు జేజేలు పలికింది. సమాజంలోని ఇతర వర్గాలతోపాటు గిరిజనులు కూడా అభివృద్ధి చెందా లంటే ప్రభుత్వం చేపట్టిన సంక్షేమ పథకాల ఫలితాలు వారికి అందడము అవసరమని కేంద్ర ప్రభుత్వము ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుందని ప్రధాని శ్రీరాజీవ్

గాంధీ ప్రకటించారు. ఖమ్మంజిల్లా రేఖాపల్లి గ్రామములో కాంగ్రెస్ ఐ ఆధ్వర్యాన ఏర్పాటయిన గిరిజనుల గ్రామములో బ్రహ్మాండమైన సభలో మాట్లాడుతూ గిరిజనులు, ఆదివాసుల కష్టాలు స్వయంగా తెలుసుకోడానికి గడిచిన 18 నెలల కాలములో దేశములోని అనేక మారుమూల ప్రాంతాలను తాను సందర్శించినట్లు ప్రధానిచెప్పారు.

గిరిజన ప్రాంతాల్లో పురోగతిని తాను చూశానని ఆయనచెప్పారు. గిరిజన ప్రాంతాలకోసం ప్రత్యేక కార్యక్రమాలను కేంద్ర ప్రభుత్వము ప్రారంభించిందని ఆయన తెలిపారు.

గిరిజన ప్రాంతాలల్లో బియ్యము ధరను ప్రభుత్వం ప్రత్యేకంగా తగ్గించిందని ఈ ప్రాంతాల్లో కిలో రూపాయి 85 (1=85 పైసలకే) బియ్యం లభిస్తున్నాయని ప్రధానమంత్రి చెప్పారు.

—o—

# నూతన విద్యా అమలుకు రాష్ట్రాలకు రాజీవ్ ఉత్తర్వు

నూతన విద్యా విధానం అమలును పర్యవేక్షించేందుకు కేబినేట్ సబ్ కమిటీని నెలకొల్పవలసిందని ప్రధాని రాజీవ్‌గాంధీ రాష్ట్ర ముఖ్యమంత్రులను కోరారు. ఇది కాక రాష్ట్ర ప్రధాన కార్యదర్శి అధ్యక్షత క్రింద అధికారులతో కూడిన ఒక ఉన్నత స్థాయి కమిటీని కూడా నెలకొల్పాలని ఈ కమిటీ విద్యా విధానం ఖచ్చితమైన అమలుకు పథకాలు రూపొందించాలని ప్రధాని సూచించారు. రాష్ట్ర ముఖ్యమంత్రులకు వ్రాసిన సుదీర్ఘమైన లేఖలలో ప్రధాని ఈ సూచనలు చేశారు. ఈ కమిటీ అధికార్లు తరచు విద్యా శాఖతోను, కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖతోను సంప్రదింపులు జరిపారు.

విద్యార్థులు, ఉపాధ్యాయులు, విద్యా వేత్తలు, గార్డియన్లు విద్యా విధానం ఆచరణలో విస్తృతంగా పాల్గొనాలని ప్రధాని సూచించారు. విద్యా విధానం మౌలికలక్ష్యాల్లో ముఖ్యమైందని ఆయన అన్నారు తరచు ఏదో ఒక విషయం మీద విద్యా సంస్థల పని దినాలను కుదించేస్తున్నారని, చాలాచోట్ల పరీక్షలు ప్రతిభకు కొలత బద్దలుగా ఉండడం లేదని రాజీవ్ విమర్శించారు. భారతదేశం ఆధునీకరణ సాధించాలంటే, ఉన్నత ప్రమాణాలుగల మానవశక్తిని సృష్టించాలని చెబుతూ, దీనికోసం విద్యా విధానాన్ని సమూలంగా మార్చివేయాలని ప్రధాని చెప్పారు. విద్యావకాశాలను పెంచి స్త్రీ విద్యకు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వాలని ఆయన సూచించారు.

బలహీన వర్గాలను జాతీయ విద్యా స్రవంతిలోకి తీసుకురావాలని ఆయన చెప్పారు.

## బ్రిటన్‌పై చర్య పరిష్కారం కాదు

దక్షిణాఫ్రికాపై ఆంక్షలు విధించే విషయంలో వ్యతిరేక వైఖరి తీసుకున్నందు వల్ల కామన్వెల్త్ నుంచి బ్రిటన్‌ను బహిష్కరించవలసిన అవసరం ఏర్పడినట్లు తాము భావించడంలేదని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ అన్నారు.

లండన్, మెక్సికోలలో తమ పర్యటనపై పార్లమెంటు ఉభయసభలలో ప్రధాని ఒక ప్రకటన చేసారు. తరువాత సభ్యులడిగిన పెక్కు ప్రశ్నలకు ఆయన సమాధాన మిచ్చారు. దక్షిణాఫ్రికాపై ఆంక్షల విషయంలో బ్రిటన్‌కు బలవంతం పెట్టడమో, లేదా కామన్వెల్త్ నుంచి బహిష్కరించాలనడమో తమ వైఖరి కాదని ఆయన స్పష్టం చేసారు. అయితే మనం ఏది సరియైనదని భావిస్తున్నామో, దానిని ఆచరిస్తూ ముందుకు సాగడమే మన లక్ష్యమని ఆయన అన్నారు.

ప్రిటోరియా ప్రభుత్వం సరిహద్దులను మూసివేయాలని తీసుకున్న నిర్ణయం వల్ల ఆ సమీప ఆఫ్రికా దేశాలకు వ్యాపారం, సరకు రవాణావంటి అంశాలలో కలిగే నష్టాన్ని తీర్చడానికి ఆ దేశాలకు భారతదేశం చేయదలచిన సహాయంపై ఇంకా చర్చలు జరగవచ్చునని ఆయన అన్నారు.

## మెక్సికో ప్రకటన

ప్రపంచ శాంతి, నిరాయుధీకరణకు టూపా శిఖరాగ్రసభ చేసిన మెక్సికో ప్రకటనను ప్రధాని సమర్పించారు. అణ్వాయుధ పరీక్షల నిషేధాన్ని తనిఖీ చేయడానికి అనుమతించాలన్న ఆరు దేశాల మెక్సికో ప్రకటన పట్ల ఆమెరికా సుముఖత వ్యక్తం చేస్తుందన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేసారు.

అణ్వాయుధ పరీక్షల నిషేధాన్ని తనఖీ చేయాలన్న ప్రతిపాదనలపై చర్చలు జరిపేందుకు తమ దేశాల నిపుణులకు వీలు కల్పించాలని ఆమెరికా అధ్యక్షుడు రీగన్‌ను సోవియట్ నాయకుడు గోర్బచెవ్‌కు ఆరు దేశాలు సంయుక్తంగా ఒక లేఖ వ్రాసాయని కూడా ప్రధాని అన్నారు.

## రష్యాకు కృతజ్ఞతలు

మెక్సికో నుంచి తిరుగు ప్రయాణంలో తమ విమానం చెడిపోయిన వెంటనే తాము మాస్కోకు వెళ్ళామని, ఆయన పేర్కొంటు మాస్కో నుంచి ఢిల్లీ ప్రయాణానికి ఒక విమానాన్ని వెంటనే సిద్ధం చేసినందుకు ప్రధాని సోవియట్ యూనియన్ ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలిపారు.

## ఉగ్రవాదం ఆయుషు ఇక కొన్ని నెలలే!

### రాజీవ్‌గాంధీ ప్రకటన :

పంజాబ్‌లో ఉగ్రవాదం సమస్యను ప్రభుత్వం కొన్ని నెలల్లో పరిష్కరించ గలదని రాజకీయ పరంగాను పోలీసు చర్య ద్వారా రాష్ట్రంలో ఉగ్రవాదం మటు మాయం కాగలదని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ 40 వ స్వాతంత్ర్య దినోత్సవం సంద ర్భంగా ఎర్రకోటపై త్రివర్ణ పతాకాన్ని ఆయన ఆవిష్కరించారు. ఆ తర్వాత ఆయన ప్రసంగిస్తూ ఉగ్రవాదుల పన్నాగంలో పడిపోయి ప్రజలు ఉద్రిక్తులు కారా దని హెచ్చరించారు.

ఉగ్రవాదులపై తీవ్ర ఒత్తిడి పడినప్పుడెల్లా దిక్కు తోచక ఘాతుక కృత్యా లకు ఒడిగడుతున్నారు. సంత్ హర్‌చంద్ లోంగోవాల్‌ను హత్యచేశారు. (1985లో) 1986 లో జనరల్ వైద్యను హత్య చేశారు. అని ఆయన చెప్పారు. ఉగ్రవాదులను పట్టుకునేందుకు పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారని, అనేక మందిని పోలీసులు అరెస్టుచేసారని, అందుకే దిక్కుతోచని ఉగ్రవాదులు నిస్పృహ చెంది ఘాతుక కృత్యాలకు తలపడుతున్నారని ఆయన అన్నారు. అమాయకులు వారి బారిన పడ కుండా ప్రభుత్వం రక్షిస్తుందని ఆయన హామీ ఇచ్చారు. సాంప్రదాయవాదం, మతతత్వం పెరిగి పోవడంవల్ల, అన్నదమ్ములలో ద్వేషం పెరుగుతున్నదని హింసా కాండకు దిగమని ఏ మతం చెప్పలేదని, ఇలాంటి హింసాతత్వాన్ని కఠినంగా అణచి వేస్తామని శ్రీ రాజీవ్ ప్రకటించారు. అయితే ఈ పరిస్థితిలో ప్రజలు కూడా ఓర్మిని వహించాలని, అన్ని మతాలను గౌరవించాలని, మత సహనం ఉండాలని, అనవస రంగా రెచ్చి పోరాదని ఆయన హితవు చెప్పారు.

భారతదేశం స్వయం సమృద్ధి సాధన లక్ష్యంగా ప్రగతి పథంలో సాగిపోవా లని "భారతీయుడు" అంటే ఐదువేల సంవత్సరాలనాటి సర్వధర్మసంభవ సిద్ధాంతాన్ని పాటించేవాడు అని గ్రహించాలని ఆయన కోరారు. ఎన్నో దేశాలకు స్వాతంత్ర్యము వచ్చింది. కాని భారతదేశం మాదిరిగా ప్రజలకు నిజమైన స్వాతంత్ర్యాన్ని ఇచ్చిన దేశాలు ఏ కొన్ని మాత్రమే ఉన్నాయని, ప్రజలకు ప్రాథ మిక హక్కులున్నాయని, వారు కోరుకున్న ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవచ్చని.

దేశ ప్రజలందరికి వర్తించే విధంగా శాసనాలు మన దేశంలో ఉన్నాయని అన్నారు, మన దేశంలో చట్టం ముందు అందరు సమానులేనని ఆయన అన్నారు.

భద్రతా ఏర్పాట్లు-:

ఎర్రకోట వద్ద జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా గట్టి బందోబస్తు భద్రతా ఏర్పాట్లు చేశారు. ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ఇతర నాయకులు ఎర్రకోటకు వచ్చే దారి పొడుగునా, ఎర్రకోటవద్ద పోలీసులు, పారా మిలిటరీ దళాలు బారులుతీరి నిల్చున్నాయి. తుపాకులను చేతబూనిన కమెండోలు, ప్రముఖులు ఆసీనులైనచోట అటుఇటు తిరిగిన్నారు. ప్రముఖులు వచ్చే దారిలో ఇళ్ళ కప్పులపై భద్రతా జవాన్లు స్టెన్‌గన్స్‌తో అప్రమత్తంగా కాపు చేశారు. ఎర్రకోట మైదానం నుండి మీనాబజార్ వరకు అనుమానం ఉన్న ప్రతి చోట ప్రేలుడు పదార్థాల కోసం తనిఖీ చేశారు. ఈ ప్రాంతంలో ప్రజల రాకపోకలను నిలిపివేశారు. ప్రతి ప్రవేశ ద్వారంవద్ద 'మెటల్' డిటెక్టర్లను ఏర్పాటు చేశారు. ఆహ్వానితుల జేబులను, దుస్తులను తడిమి ఆయుధాలు వారివద్ద లేకుండా జాగ్రత్తపడ్డారు. పార్కింగ్ ప్రాంతాలలో అన్ని వాహనాలను జవాన్లు తనఖీ చేశారు. శ్రీ రాజీవ్‌గాంధీ బుల్లెట్ ప్రూఫ్ అద్దాల వెనక నిలబడి ప్రసంగించారు. మూడు వైపులా అద్దాలున్నాయి. వెనక వైపున ఆయన స్వంత సెక్యూరిటీ గార్డులున్నారు. ఆకాశంలో రెండు హెలికాప్టర్లు కార్యక్రమం పూర్తి అయ్యేవరకు ఎగిరాయి. ప్రధాని ప్రసంగం 20 చదరపు కిలోమీటర్ల వరకు విన పడేలా ఏర్పాట్లు చేశారు. 10 ఆంప్లి ఫయర్లు పెట్టారు. 250 లౌడ్ స్పీకర్లను అమర్చారు.

—o—

# విద్యావ్యవస్థే దేశానికి వెన్నెముక

**రాజీవ్ :-**

భారత దేశంలో ప్రవేశ పెట్టనున్న కొత్త విద్యావిధానం వల్ల ప్రమాణాలు బాగా పెరుగుతాయని, విద్యార్థులు ఉపాధ్యాయులు విజ్ఞులైన పౌరులుగా రూపొందు తారని, జాతీయ విద్యా ప్రణాళికా సంస్థ ఏర్పాటు చేసిన నాలుగురోజుల సదస్సును ప్రారంభిస్తూ ఈ విద్యావిధానం విద్యార్థులకే కాకుండా, అధ్యాపకులకు కూడా ఎంతో ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలుగజేసి కార్యాచరణకు సిద్ధం చేస్తామని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు.

దేశంలోని కోట్లాదిమంది ప్రజలకు ప్రయోజనకరంగా ఉండేలా జాతీయ స్థాయి చర్చను నిర్వహించిన తర్వాత కొత్త విద్యావిధానానికి రూపకల్పన చేసి అమలు చేస్తున్నట్టు, దేశ ప్రజలకు ఉత్తమ విద్య గరిపి వారిఆశలు ఆశయాలు నెర వేరుస్తూ తద్వారా ప్రగతి సాధించాలనే రాజకీయ నిబద్ధత ప్రభుత్వానికి ఉన్నదని ఆయన అన్నారు.

యునెస్కో, యునిసెఫ్ సహాయంతో ఏర్పాటుచేసిన ఈ సదస్సులో ఏడు దేశాలకు చెందిన నిపుణులు పాల్గొన్నారు కొత్త విద్యావిధానాన్ని సాలోచనతో అమలు చేయాలని, కొన్ని నిర్బంధ పద్ధతులు అమలుచేయక తప్పదని జాతీయ జీవనంలో విద్య అత్యంత ప్రాముఖ్యమైనదని, విద్యావ్యవస్థ దేశానికి వెన్నెముక వంటిదని ఆయన అభివర్ణించారు. ఏరంగం అభివృద్ధి చెందాలన్నా విద్య ముఖ్య సాధనమని అన్నారు. విద్యాప్రమాణాలు ఎంతగా మెరుగు పడితే దేశం అంతగా సర్వతోముఖాభివృద్ధి చెందగలదని ఆయన చెప్పారు. విద్యద్వారా మానసిక వికాసం పొందినవారే దేశ అభ్యున్నతిలో పూర్తి భాగస్వాములు కాగలరని ఆయన అన్నారు. అణచివేతలకు, అన్యాయాలకు గురైన ప్రజలకు కూడా మిగిలిన వారితో సమముగా విద్య, ఉపాధి అవకాశాలు కల్పించేందుకు కొత్త విద్యావిధానం దోహదపడగలదని ప్రధాని చెప్పారు.

వివిధ రాష్ట్రాలకు చెందిన విద్యాశాఖ కార్యదర్శులు, వైస్ చాన్స్లర్లు, నిర్వహణ నిపుణులు ప్రణాళికాకర్తలు, ఈ సదస్సులో పాల్గొన్నారు. ఫ్రాన్స్, చైనా, అమెరికా, మలేసియా, టాంజానియా, బోట్స్వానా, నేపాల్ విద్యావేత్తలు కూడా చర్చలలో పాల్గొన్నారు. వివిధ స్థాయిల్లో విద్యా ప్రణాళికల అమలు, వికేంద్రీకరణ, అందరికీ ప్రాథమిక విద్య, అనియత విద్య, పనిచేసే పిల్లలకు విద్యాబోధన, వయోజన విద్య విద్యాసంస్థలకు స్వయం ప్రతిపత్తి తదితర వివిధ అంశాలు ఈ సదస్సులో చర్చకు వస్తాయి. వివిధ వర్గాలనుంచి కొత్తస్థాయిలనుంచి వచ్చిన సూచనలు, సలహాలను ప్రధాని పరిశీలించారు. ప్రణాళికా బద్ధమైన ప్రగతి జరిగేందుకు కూడా విద్య దోహదపడాలనేది ప్రభుత్వ ఆశయమని, దేశం ఎదుర్కొంటున్న సవాళ్ళకు విద్యద్వారా లభించే వివేచన, విజ్ఞానం సమాధానం చెప్పగలగాలని ప్రధాని చెప్పారు. అభివృద్ధిచెందిన దేశాలతో భారతదేశం కూడా సరితూగాలంటే వైజ్ఞానిక విద్యకు అధికతర ప్రాముఖ్యం ఇవ్వవలసి ఉంటుందని రాజీవ్‌గాంధీ అన్నారు.

## వలసొచ్చిన పౌరులకు రాజీవ్ అభయం

భయోత్పాతాన్ని సృష్టించడం ద్వారా మైనారిటీవర్గాల ప్రజలని పంజాబ్ నుండి వెళ్ళగొట్టడానికి ఉగ్రవాదులు పన్నిన పన్నాగం సాగనివ్వరాదని, వలస వచ్చిన 80 మంది పంజాబ్ మైనారిటీవర్గాల వారితో ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ మాట్లాడారు. గంటసేపు సాగిన ఈ చర్చలలో తమ కష్టనష్టాలను వలసవచ్చిన పౌరులు ప్రధానికి చెప్పారు. వీరిలో స్త్రీ, పురుషులు, పిల్లలు కూడా ఉన్నారు. మమ్మల్ని భయపెట్టి తరిమేయాలని ఉగ్రవాదులు పన్నాగమని వలసవచ్చిన వారు చెప్పారు. మా ప్రాంతాలు విడిచి బ్రతుకలేము. తిరిగి వెనక్కి పోవాలనిఉంది అని వారు చెప్పారు. ఎట్టిపరిస్థితిలోను దేశ సమైక్యతను బలిపెట్టేదిలేదని రాజీవ్ వారికి అభయమిచ్చారు. పంజాబ్‌లో శాంతిభద్రతల క్షీణత గురించి ప్రజలు ఎదుర్కొంటున్న కష్టనష్టాల గురించి ప్రభుత్వానికి తెలుసునని, ఉగ్రవాదులను అరికట్టడానికి కట్టుదిట్టంగా చర్యలు గైకొంటున్నామని ప్రధాని తెలియజేసారు. అమృత్‌సర్ సమీపజిల్లాలనుండి వలసవచ్చిన వారు ప్రధానిని కలుసుకున్నారు.

—o—

# అస్సాం చిచ్చు ఆరింది

ఒప్పందం కుదిరింది :-

ఉద్యమనాయకులకు, ప్రభుత్వానికి మధ్య ఒప్పందం కుదరడంతో ఆరేళ్ళుగా నలుగుతున్న అస్సాం 'విదేశీయుల సమస్య' పరిష్కారమై పోయింది. ఒప్పందంపై సంతకాలు చేసినట్లు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ స్వాతంత్ర్య దినోత్సవంలో హర్షధ్వానాలమధ్య ప్రకటించారు. ఒప్పందం కుదిరిందని ఆరేళ్ళుగా నిర్వహిస్తున్న ఆందోళనను ఇక విరమించినట్లు అస్సాం ఉద్యమనాయకులు ప్రకటించారు. "విదేశీయుల సమస్యపై ఇక ఆందోళన ఉండదని అస్సాం విద్యార్థులసంఘం అధ్యక్షుడు ప్రఫుల్లకుమార్ మహంత్ అన్నారు. అస్సాం ఉద్యమం కారణంగా అంతటా లోగడ విధించిన నిషేధాజ్ఞలన్నింటిని విరమించుకున్నట్టు అస్సాం ముఖ్యమంత్రి హితేశ్వర్ సైకియా ఢిల్లీనుండి గౌహతి వచ్చిన వెంటనే ప్రకటించారు. ఒప్పందం పట్ల ఆయన హర్షం వ్యక్తంచేశారు.

హోమ్‌శాఖ కార్యదర్శి శ్రీఆర్.డి.ప్రధాన్ కేంద్ర ప్రభుత్వం తరపున, అస్సాం ప్రభుత్వం తరపున ఆ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీపి.సి.త్రివేది ఒప్పందంపై సంతకాలు చేశారు. ఆందోళన కారుల తరపున అఖిల అస్సాం సంఘం అధ్యక్షుడు శ్రీప్రఫుల్లకుమార్ మహంత్, ప్రధానకార్యదర్శి శ్రీభృగు, అఖిల అస్సాం గణ సంగ్రామపరిషత్ కన్వీనర్ శ్రీపీరజ్‌శర్మ సంతకాలు పెట్టారు. ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ సంతకాలు జరిగినపుడు హోమ్‌మంత్రి శ్రీఎస్.బి.చవాన్, మంత్రివర్గ కార్యదర్శి శ్రీసి.కె.కౌల్, అస్సాం విద్యార్థిసంఘం గణసంగ్రామ పరిషత్ కార్యవర్గం అక్కడే ఉన్నారు. ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పార్లమెంటులో ఒప్పందం వివరాలను ప్రకటించారు. దాదాపు ఇరవై గంటలసేపు ఎడతెరిపిలేని చర్చలు జరిగిన తర్వాత ఒప్పందం కుదిరింది. ఉభయపక్షాల మధ్య బుధవారం ఉదయం ఎనిమిదిగంటలకు చర్చలు ప్రారంభమైనవి.

హోమ్‌మంత్రి శ్రీఎస్ బి.చవాన్, ఉద్యమనాయకులు దాదాపు యాభై నిమిషాల సేపు సమావేశమై ఒప్పందం ముసాయిదాకు తుదిరూపం ఇచ్చారు. దాదాపు ఆందోళన నాయకులు నాలుగుగంటలసేపు సమావేశమై తుది ముసాయిదాను సమీక్షించి ఆమోదించారు. పలుసార్లు నాయకులు సభాస్థలంనుంచి హోమ్‌శాఖ కార్యదర్శి కార్యాలయానికి వెళ్ళవలసి వచ్చింది. ముఖ్యసమావేశం బుధవారం రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత ప్రధాని నివాసంలో ఏర్పాటయింది. వేకువజామున రెండున్నర వరకు చర్చలు జరిగినవి. ఈ సమావేశం ప్రారంభానికి ముందు అస్సాం ముఖ్యమంత్రి శ్రీహితేశ్వర్‌సైకియా ప్రధానిని కలుసుకున్నారు. తర్వాత ఆయన గౌహతి వెళ్ళిపోయారు. హితేశ్వర్‌సైకియా ప్రభుత్వం రాజీనామా, 1966, 1971 మధ్యన అస్సాంలో ప్రవేశించిన వారిపేర్లను వోటర్ల జాబితానుంచి తొలగింపు ఒప్పందంలోని ప్రధానాంశాలు. ఉధృతమైన ఆందోళన వలన ఛిన్నాభిన్నమైన అస్సాం ఆర్థికవ్యవస్థను చక్కదిద్దే చర్యలన్నింటిని ఒప్పందంలో పొందుపరిచారు. అస్సాం గణసంగ్రామ పరిషత్ విద్యార్థుల సంఘం 1979 లో 'విదేశీయుల సమస్య'పై ప్రారంభించిన ఆందోళనలో దాదాపు 3,500 మంది ప్రాణాలు కోల్పోయారు. అస్సాం ఒప్పందాన్ని పార్లమెంటులో ప్రకటించవలసిఉంది. అయితే సైకియా ప్రభుత్వం రాజీనామా తర్వాత రాష్ట్ర పాలనాధికారం ఎవరికి అప్పగించాలనే అంశంపై ఆఖరుక్షణంలో పేచీ వచ్చినందున ఒప్పందంపై సంతకాలుచేసే కార్యక్రమం సాధ్యపడలేదు.

రాష్ట్రపతిపాలన విధించాలని ఉద్యమనాయకులు పట్టుపట్టగా, సైకియా మంత్రివర్గం ఆపద్ధర్మ ప్రభుత్వంగా అసెంబ్లీ ఎన్నికలవరకు కొనసాగాలని కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించింది. సైకియా ప్రభుత్వం మూడురోజుల్లో రాజీనామా చేయాలని ఆ తర్వాత ఎన్నికలవరకు ముగ్గురు సభ్యుల 'ఆపద్ధర్మ ప్రభుత్వం' కొనసాగాలని అంగీకారం కుదరినట్టు విద్యార్థులసంఘం అధ్యక్షులు మహంత్ తెలిపారు. అసెంబ్లీని రద్దు చేయవలసిందిగా గవర్నర్‌కు అస్సాం ముఖ్యమంత్రి త్వరలోనే సిఫార్సు చేసారు. 'ఆపద్ధర్మ ప్రభుత్వం' నాయకునిగా సైకియాయే ఉంటారని విశ్వసనీయంగా తెలియవచ్చింది. అస్సాం ఒప్పందంపై రాత్రింతా ఉభయపక్షాల మధ్య సుదీర్ఘమైన చర్చలు జరిగిన తర్వాతనే సంతకాలు జరిగాయి.

ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపవలసిందిగా ఉద్యమ నాయకులను ఒప్పించడానికి కృషిచేసిన పార్లమెంటు సభ్యుడు రమేష్‌పైలట్ కూడా చర్చల్లో పాల్గొన్నారు. అస్సాం విద్యార్థులసంఘం గణసంగ్రామ పరిషత్ కార్యవర్గాల సభ్యులు ప్రధాని నివాసంలోని పచ్చిక బయలులో సమావేశమై ఒప్పందాన్ని ధృవీకరించారు.

## సైకియా రాజీనామా

అస్సాం సమస్యపై కేంద్ర ప్రభుత్వానికి, ఉద్యమ నాయకులకు మధ్య కుదిరిన ఒప్పందంలోని ప్రధాన అంశాలు.

1966 జనవరి ఒకటవతేదినుంచి 1971 మార్చి 25 వ తేదివరకు అస్సాంలో ప్రవేశించిన విదేశజాతీయుల పేర్లను పదేళ్ళపాటు వోటర్ల జాబితానుంచి తొలగించారు. అంటే పదేళ్ళపాటు వీరికి వోటుహక్కు ఉండదు. హితేశ్వర్ సైకియా ప్రభుత్వం రాజీనామా చేసింది. తదనంతరం మూడునెలలపాటు 'ఆపద్ధర్మ ప్రభుత్వం' కొనసాగింది. ఒప్పందం ప్రాతిపదికగా వోటర్ల జాబితాలను సవరించారు. అస్సాం ప్రజలకు రాజ్యాంగ నిబంధన పరంగా 'రక్షణ' కల్పించారు.

అస్సాంలో కొత్తగా చమురుశుద్ధి కర్మాగారాలను ఏర్పాటు చేసారు.

సిల్చార్ జనపనారమిల్లును, రాష్ట్రంలో భారతీయ సాంకేతిక పరిజ్ఞాన సంస్థను నెలకొల్పినారు. 1966. 1971 మధ్యన అస్సాంలో ప్రవేశించిన విదేశీయుల సంఖ్య ఎంతో ఇదమిత్థమైన అంచనాలేదు. అయితే వీరు ఐదు లక్షల మందిదాకా ఉంటారని భావిస్తున్నారు. 1971 వోటర్ల జాబితా ప్రాతిపదికగా కొత్తగా అసెంబ్లీ ఎన్నికలు జరిగినవి. అస్సాం అభివృద్ధికి ఆర్థికచర్యలను ప్రకటించారు. వోటర్ల జాబితాల ఖరారు కార్యక్రమాన్ని పర్యవేక్షించడానికి కేంద్ర పరిశీలకులను పంపాలని ఎన్నికల కమిషన్ కేంద్ర ప్రభుత్వం కోరుతుంది.

ఇరవై శతాబ్దం ఆరంభంనుంచి అస్సాంలోని పొరుగు దేశాలవారు ప్రవేశించి భూములను ఆక్రమించుకోవడం జరిగింది. తూర్పుపాకిస్తాన్‌కు, అస్సాంకు మధ్య సరిహద్దు తెరిచే ఉండడంవల్ల అస్సాంలో విదేశీయుల ప్రవేశానికి ఆటంకం లేక పోయింది. 1971 లో బంగ్లాదేశ్ ఆవతరించిన తర్వాతకూడా విదేశీయులు

అస్సాంలోకి అక్రమంగా ప్రవేశించడం ఆగలేదు. విదేశీజాతీయుల వలన 'అసలు సిసలు' అస్సాం ప్రజలు అల్పసంఖ్యాంకవర్గాలై పోతారనే భయంతో. ఆర్థిక వ్యవస్థను ఈ 'విదేశీయులు' గుప్పిట్లో పెట్టుకుంటారనే ఆందోళనతో 'అస్సాం ఉద్యమం' ఆరంభమైంది.

## అస్సాం ఉద్యమనాయకులకు రాజీవ్ తేనేటివిందు

ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అస్సాం ఉద్యమనాయకులకు తన నివాసభవనంలో తేనేటివిందు ఇచ్చారు. అఖిల అస్సాం విద్యార్థిసంఘం గణ సంగ్రామ్ పరిషత్ ప్రతినిధులతోపాటు హోంమంత్రి శ్రీఎస్.బి.చవాన్, మరికొందరు కేంద్రమంత్రులు ఎ.ఐ.సి.సి.(ఐ) కార్యవర్గ సభ్యులు కూడా హాజరయ్యారు.

అస్సాం ఒప్పందం పట్ల సర్వత్రా హర్షం ప్రకటించారు. రాజీవ్ విజ్ఞత, రాజనీతిజ్ఞత, అస్సాం ప్రభుత్వం, ఉద్యమనాయకుల దూరదృష్టి. ధైర్యం, సదవగాహన వల్లనే ఈ ఒప్పందం కుదిరింది. కాంగ్రెస్ (ఐ) ప్రధానకార్యదర్శి శ్రీఎ.కె. ఆం.తోని అస్సాం ఒప్పందాన్ని స్వాతంత్ర్యదినోత్సవ కానుకగా వర్ణించారు. ఈ వ్యవహారంలో ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పాత్రను బహువిధాలుగా ప్రశంసించారు.

## 'బుల్లెట్‌ప్రూఫ్' అద్దాలవేదిక

ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ గురువారం స్వాతంత్ర్యదినోత్సవం సందర్భంగా చరిత్రాత్మక ఎర్రకోట బురుజుపైనుండి ప్రసంగించారు. ఎర్రకోటపై ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన తూటాలు చొరరాని (బుల్లెట్‌ప్రూఫ్) అద్దాల వేదిక నుండి ఆయన ప్రసంగించారు. ఉత్సవ వేడుకలు జరిగే ఆ ప్రాంతమంతా పటిష్టమైన బందోబస్తు ఏర్పాట్లుచేశారు.

మెటల్ డిటెక్టర్ అమర్చిన ద్వారం గుండా ఆహ్వానితులందరిని తమ స్థానాలతో కూర్చునేందుకు పంపారు. ఎర్రకోట అగ్రభాగాన, అక్కడికి సమీపంలోని చాందినీ చౌక్ ప్రాంతంలోని భవనాలపైన స్టెన్‌గన్ ధరించిన భద్రతా ఏర్పాట్లలో భాగంగా భారత టిబెట్ సరిహద్దు పోలీసు దళాలను పారామిలిటరి, రక్షణ దళాలను తెప్పించారు. ప్రముఖులు పయనించే మార్గం పొడవునా భారత టిబెట్ సరిహద్దు పోలీస్ కమెండోలకు, ప్రత్యేక భద్రతా సిబ్బందిని, ఢిల్లీ పోలీసులను నియ

మించారు. మామూలు దుస్తులలో ఉన్న డిటెక్టివ్‌లు స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలను సందర్శించేందుకు వచ్చిన సందర్శకుల కదలికలను ఎంతో జాగరూకతతో పరిశీలించి అప్రమత్తతతో వ్యవహరించారు.

## ఉత్పత్తి నైపుణ్యాల పెంపుపై జాతీయ చర్చకు ప్రధాని పిలుపు

శ్రామికశక్తికి నైపుణ్యాన్ని పెంచి, వస్తోత్పత్తిలో గణనీయమైన అభివృద్ధి సాధించటంద్వారా భారతదేశాన్ని ప్రపంచంలో పెద్ద ఆర్థిక శక్తిగా తయారు చేయడానికి వెంటనే జాతీయ స్థాయిలో చర్చకు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పిలుపునిచ్చారు.

ఆర్థిక సంస్థల జాతీయ సదస్సు, స్నాతకోపన్యాసంలో పిలుపునిచ్చారు. ఈ అంశంపై కాంగ్రెస్ (ఐ) పార్టీలో ఇంతకుముందే సమీక్ష చర్చలు ప్రారంభమయ్యాయని, లైసెన్సింగ్ విధానం, కార్మికపాలనతో సహా అన్ని ముఖ్యమైన చట్టాలను సమీక్షిస్తారని ప్రపంచంలో ఇతరదేశాల ఉత్పత్తులకంటే భారతీయ ఉత్పత్తులధరలు మూడురెట్లు ఎక్కువ వుండటాన్ని ప్రధాని, ప్రధానంగా పేర్కొంటు ఈ పరిస్థితిని అదుపుచేసి, ధరలను తగ్గించాలంటే, అన్ని స్థాయిలలోను నైపుణ్యాన్ని మెరుగు పర్చడం ఒక్కటే మార్గమని, సూచించారు ఆయన. అయితే నైపుణ్యాన్ని పెంచడానికి, బయట శక్తుల సహకారం మనకు అవసరంలేదని, కార్మికులపని వాతావరణం, స్థితిగతులలో మార్పులు తీసుకురావడం ద్వారా నైపుణ్యాన్ని సాధించవచ్చునని అన్నారు. దీనికి ఉదాహరణగా ఎయిర్ లైన్స్ సంస్థను చెపుతూ, ఎన్నో సంవత్సరాలుగా నష్టాలనే చూపించిన సంస్థ నేడు ఎంతో లాభదాయకంగా పని చేస్తుందని, ప్రభుత్వంలోకాని: కార్మికులలోకాని, పనిసామర్థ్యాన్ని పెంచాలంటే, ఉత్సాహపరచటానికి, వారికి ప్రోత్సాహాలు కల్పించాలని ఆయన అన్నారు.

# అధ్యక్షునిగా రాజీవ్‌గాంధీ

అఖిల భారత కాంగ్రెస్ (ఐ) కమిటీ అధ్యక్షులుగా శ్రీరాజీవ్‌గాంధీ ఎన్నికను ఎ.ఐ.సి.సి. సమావేశం ఏకగ్రీవంగా ధ్రువీకరించింది. కమిటీ సమావేశమైన వెంటనే రక్షణమంత్రి శ్రీపి.వి.నరసింహారావు ఇందుకు సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదించగా పంజాబ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీదర్బారాసింగ్ బలపర్చారు. 1984 అక్టోబరు 31 న శ్రీమతి ఇందిరాగాంధీ హత్యకు గురైన తర్వాత శ్రీరాజీవ్‌గాంధీ పార్టీ అధ్యక్ష పదవిని చేపట్టారు.

## ఇందిరాగాంధీకి నివాళి

శ్రీమతి ఇందిరాగాంధీ చేసిన సేవలను స్తుతిస్తూ నివాళు లర్పిస్తూ ఎ.ఐ.సి.సి. సమావేశాలు ప్రారంభమయ్యాయి శ్రీమతి గాంధీ మృతికి సంతాపం తెలిపే తీర్మానాన్ని శ్రీరాజీవ్‌గాంధీ చదివారు.

శ్రీమతి ఇందిరాగాంధీ దేశంలో ఒక గొప్ప చరిత్రను సృష్టించిందని, పుట్టినప్పటినుండి మరణించేదాకా కాంగ్రెస్‌లో అతి ముఖ్యవ్యక్తిగా బాధ్యతలను చేపట్టిందని, దేశ ప్రగతికి, గ్రామీణాభివృద్ధికి ఆమె తన పాలనలో ఎంతో కృషి చేసిందని ఆమెలేని లోటు పూడ్చలేనిదని ఈ తీర్మానం పేర్కొన్నది. ఆమె భావాలు, ఆదర్శాలు లక్షలాదిమంది కాంగ్రెస్ కార్యకర్తలకు ఆదర్శప్రాయమైనవని ఈ తీర్మానం పేర్కొన్నది.

## శ్రీరాజీవ్‌కు ఏలకులమాల

భారత ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ మెడలో ఏలకులతో తయారుచేసిన మాలను వేశారు కాంగ్రెస్ ఉత్సవాల సందర్భంగా ఈ ఏలకులమాలను ప్రత్యేకంగా తయారుచేసి తమిళనాడు నుండి తెచ్చారు. మధురజిల్లా కాంగ్రెస్ కమిటీ మాజీ అధ్యక్షుడు, ఎ.ఐ.సి.సి సభ్యుడు శ్రీజి.పి.వి.రాజు ఈ మాలను శ్రీరాజీవ్ మెడలో వేశారు.

## పతాకావిష్కరణ

ఎ.ఐ.సి.సి. సమావేశాలు జరుగుతున్న ఇండోర్ స్టేడియంలో పార్టీ అధ్యక్షులు శ్రీరాజీవ్‌గాంధీ పార్టీ పతాకాన్ని ఆవిష్కరించారు. శ్రీరాజీవ్‌గాంధీ పతాకాన్ని ఆవిష్కరించడానికి వచ్చినపుడు కాంగ్రెస్ సేవాదళ్ వాలంటీర్లు గౌరవవందనం చేశారు. వందేమాతరం బృందగానం చేశారు. పతాకావిష్కరణోత్సవానికి కాంగ్రెస్ ఐ వర్కింగ్ కమిటీ సభ్యులు, కేంద్రమంత్రులు, వివిధరాష్ట్రాల పార్టీ అధ్యక్షులు ముఖ్యమంత్రులు, పెద్దసంఖ్యలో ప్రతినిధులు హాజరయ్యారు.

## కాంతికిరణం శ్రీరాజీవ్‌గాంధీ (నిజలింగప్ప ప్రశంస)

న్యూఢిల్లీ :- "నల్లని మబ్బులతో మేఘావృతమై ఉన్నప్పుడు ఆకాశంలో మెరిసిన మెరుపులాంటి వాడు శ్రీరాజీవ్‌గాంధీ" అని అవిభక్త కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు శ్రీనిజలింగప్ప వ్రిదాని శ్రీరాజీవ్‌గాంధీని మెచ్చుకున్నారు. అధికారంలోకి వచ్చిన తర్వాత శ్రీరాజీవ్ చేసిన పనులను నిజలింగప్ప సమర్థించారు. పత్రికా విలేకర్లతో పిచ్చాపాటిగా మాట్లాడుతూ రాబోయే కాలంలో ఈ మెరుపు మరింత వెలుగునిస్తుందని తాను ఆశిస్తున్నట్లు నిజలింగప్ప అన్నారు. ఢిల్లీలో జరుగుతున్న రాజ్యాంగ పరిషత్తు మాజీ సభ్యుల రెండురోజుల సమావేశంలో పాల్గొనడానికి ఆయన వచ్చారు. అభిప్రాయ బేధాలవల్ల గత పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికల్లో ప్రతిపక్షాలు అధికారంలోకి రాకపోగా కనీసప్రతిపక్షస్థాయిని కూడా ఎదగ లేక పోయాయని ఆయన తెలిపారు. ఇప్పటికైనా అందరూ ఐకమత్యంగా కలిసి కాంగ్రెస్-ఐ కి ప్రత్యామ్నాయంగా కాగలరని ఆశిస్తునట్లు ఆయన చెప్పారు

## ఇండియాకు జపాన్ సహాయం
## (ఉక్కు, జౌళి, రైల్వేరంగాలు ఆధునీకరణ)

**టోక్యో 29-11-85:-**

భారతదేశ ఉక్కు పరిశ్రమల ఆధునికరణకు ఆర్థిక, సాంకేతిక పరంగా సహాయ సహకారాలు అందజేసేందుకు జపాన్ అంగీకరించింది. భారతదేశ జౌళి పరిశ్రమ, రైల్వే ఆధునీకరణ, అభివృద్ధికి కూడా జపాన్ సాయపడుతుంది. ప్రయివేట్ రంగ పరిశ్రమల నిర్వహణ సామర్థ్యం, నాణ్యత పెంపుదల కార్యక్రమాలకు

తాము సహాయపడటం అర్థవంతంగా ఉంటుందని జపాన్, ఇండియాకు సూచించింది.

ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ, జపాన్ ప్రధాని నకసోనె ఇతర మంత్రులు, వాణిజ్య ప్రముఖులతో జరిపిన చర్చల పర్యవసానంగా ఉభయ దేశాలు ఈ అవగాహనకు వచ్చాయి.

ద్వైపాక్షిక సంబంధాలు, అంతర్జాతీయ సమస్యల గురించి చర్చించేందుకు న్యూఢిల్లీలో ఉభయదేశాల మేధావులతో సదస్సును ఏర్పాటుచేయాలని కూడా నిర్ణయించారు.

జపాన్ యువతను తమదేశం ఆహ్వానించేందుకు ఇండియా అంగీకరించింది. సదవగాహన, సన్నిహిత సంబంధాలు పెంపొందేందుకు సాంస్కృతిక వినిమయ కార్యక్రమాలు కూడా ఉండాలని ఉభయదేశాలు ఏకాభిప్రాయం వ్యక్తంచేసాయి.

## సాంకేతిక ఒప్పందం:-

వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో పరస్పర సహకారం పెంపుదలకు ఇండియా, జపాన్ ఒప్పందాన్ని కుదుర్చుకొన్నాయి. ఉభయదేశాల విదేశాంగ మంత్రులు శ్రీబి.ఆర్.భగత్, షినటారో ఆబే ఒప్పందంపై సంతకాలు చేశారు, ఈ మేరకు రెండు దేశాల ప్రతినిధులలో సంయుక్త సంఘాన్ని ఏర్పాటు చేశారు.

ఈ ఒప్పందం మేరకు భారతదేశంలో కంప్యూటర్ల అభివృద్ధి, పరిశ్రమల ఆధునీకరణకు వైజ్ఞానిక, సాంకేతిక సహాయం అందుతుందని, ఉభయదేశాల శాస్త్రవేత్తలు, నిపుణుల పర్యటన అంశము కూడా ఇందులో ఉంది. పరిశోధనా రంగంలో కూడా రెండుదేశాలు సహాయ సహకారాలు అందచేసుకొంటాయి.

సంయుక్తసంఘం ఒకసారి ఇండియాలో సమావేశమయితే, మరోసారి జపాన్‌లో సమావేశమవుతుంది. ఒప్పందఅంశాల అమలును ఎప్పటికప్పుడు సమీక్షిస్తారు. వేరే కొత్తఏర్పాట్లకు ఈ ఒప్పందంలో అవకాశంలేదు. ఈ ఒప్పందం రెండేళ్ళపాటు అమలులో ఉంటుంది. తర్వాత పొడిగించుకోవచ్చు లేదా రద్దు చేసుకోవచ్చు.



హైదరాబాదులోని సర్దార్ వల్లభాయిపటేల్ నేషనల్ పోలీసు అకాడమీలో ఐ. పి. యస్. ప్రొబేషనర్లను ఉద్దేశించి ప్రసంగిస్తున్న శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రి (1986).



శ్రీ రాజీవ్‌గాంధీ, శ్రీమతి సోనియాగాంధీ



నిరుపేదలతో శ్రీ రాజీవ్‌గాంధీ

అస్సాం గ్యాస్ టర్బయిన్‌కు 160 కోట్ల రూపాయల సహాయం అందజేస్తామని జపాన్ ప్రకటించిన విషయం విదితమే. లక్నోలో సంజయ్‌గాంధీ పోస్టుగ్రాడ్యుయేట్ వైద్య విజ్ఞాన సంస్థ కూడా జపాన్‌కు సహాయం అందజేస్తుంది.

**సరికొత్త ఆర్థిక వ్యవస్థ:-**

శ్రీరాజీవ్‌గాంధీ జపాన్ పార్లమెంట్ 'డయిట్' ఉభయసభల సమావేశంలో ప్రసంగిస్తూ, సరికొత్త అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ ఏర్పాటునకు సంపన్న, వర్ధమాన దేశాలన్నీ కలసికట్టుగా పాటుపడాలని విజ్ఞప్తిచేశారు. ఆర్థిక అసమానతలు తొలగించేందుకు ప్రతిఒక్కరూ పాటుపడవలసిన తరుణం ఆసన్నమయిందని అన్నారు. వర్ధమాన దేశాలు కరువుకాటకాలతో ఆకలి దప్పులతో అలమటిస్తున్నాయనీ, సంపన్నదేశాలు ఆర్థికమాంద్యాన్ని ఎదుర్కొంటున్నాయని, పరస్పర సహకారం ఉంటే ఎలాంటి చిక్కు సమస్యనైనా పరిష్కరించుకో వచ్చనీ ఆయన చెప్పారు.

ఒకోసమస్య ఒక్కొక్క దేశానిదని ఎవరికివారే ఏకాకిగా ఉండటం ఇకతగదని ఆయన హితవు చెప్పారు. అన్నిదేశాల ప్రతినిధులు ఒకవేదికపై సమావేశమై సరికొత్తరీతిలో సమాలోచనలు జరపాలని శ్రీరాజీవ్ సూచించారు. ప్రగతిఫలాలు అందరికీసరిసమానంగా దక్కాలని, ప్రపంచవ్యాప్తంగా తలెత్తిన ఆర్థికసంక్షోభాన్ని తుదముట్టించేందుకు సమాయత్తం కావాలని ఆయన అన్నారు. వైజ్ఞానిక ప్రగతి దారిద్ర్యనిర్మూలనకు దోహదకారిగా ఉండాలితప్ప వినాశనాన్ని తెచ్చేదిగా ఉండరాదని ఆయన చెప్పారు. పాతవిలువలకు కాలం చెల్లిపోయిందని దయదలచి ఏదో చేద్దామనే తలంపు మంచిదికాదని, అన్నిరంగాలలో పటిష్టమైన కార్యక్రమాలు అమలుజరగాలని శ్రీరాజీవ్‌రత్న అన్నారు. ఒకరిపై ఒకరు ఆధారపడడం అనివార్యమని ప్రతిదేశం గమనించాలని ఆయన చెప్పారు.

అణ్వస్త్రయుద్ధ ప్రమాదాన్ని నివారించేందుకు ప్రతిదేశం చిత్తశుద్ధితో పాటుపడాలని ప్రపంచశాంతి మనధ్యేయం కావాలని ఆయన విజ్ఞప్తిచేశారు.

**కొత్త ఆర్థిక ప్రణాళిక**

టోక్యో :- 'ఐదేళ్ళ సమగ్ర ఆర్థిక ప్రణాళిక'ను పార్లమెంటుకు సమర్పిస్తామని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ వెల్లడించారు. భారత జపాన్ వాణిజ్య సహకారం సం

యుక్త సంఘసమావేశంలో ప్రసంగిస్తూ, ప్రభుత్వ ఆర్థిక, పారిశ్రామిక విధానాల న్నింటిని ఇందులో స్పష్టంగా వివరిస్తామని ఆయన చెప్పారు. దూరదృష్టితో భవిష్యత్తుకు ఉపయోగపడే నిసలైన ప్రగతి కార్యక్రమాలను చేపడుతున్నామని, తాము చేపట్టేవి తాత్కాలిక వాణిజ్య, పారిశ్రామిక వేత్తలకు మరింత ప్రోత్సాహకరంగా ఉంటుందని, మరిన్ని పెట్టుబడులు సమకూరగలవని ఆయన తెలిపారు. ఉత్పత్తి పెంపుదల రంగాలకు అధిక ప్రాముఖ్యం ఇస్తున్నామని శ్రీరాజీవ్ అన్నారు.

భారతదేశంలో పరిశ్రమల ఆధునీకరణ, విస్తరణకు హెచ్చు ప్రాముఖ్యం ఇస్తున్నామని, భాగస్వాములు సహాయసహకారాలతో ఆధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని అన్వయించుకొంటున్నామని ఆయన చెప్పారు. జపాన్, ఇండియా మరిన్ని రంగాలలో పరస్పర సహకారాన్ని అందజేసుకోగలవనే ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేసారు. ఎగుమతుల పెంపుదలకు మార్కెట్ విస్తరణకు విశేషకృషి జరుపుతున్నామని ఆయన చెప్పారు. జపాన్ ప్రధాని నకసోనెతో ప్రయోజనకరమైన చర్చలు జరిపామని శ్రీరాజీవ్ అన్నారు.

'ఇండియాలో జపాన్ ప్రయివేటు పెట్టుబడులకు అవకాశం ఉంటుందా' అని ఒక వ్యాపారవేత్త ప్రశ్నించినపుడు శ్రీరాజీవ్‌గాంధీ 'ఆర్థిక ప్రణాళిక' విషయం చెప్పారు. పరిశ్రమల అభివృద్ధికి విదేశీ పెట్టుబడులను కూడా ఆహ్వానిస్తామని ఆయన అన్నారు.

దేశంలో జరిగిన పారిశ్రామిక ప్రగతిని ఆయన వివరించారు. పరిశ్రమల అభివృద్ధికి అన్నివిధాల ప్రాథమిక సౌకర్యాలు కల్పిస్తున్నామని ఆయన చెప్పారు. విద్యుత్, రోడ్డురవాణా, రైల్వే, టెలికమ్యూనికేషన్లు, తదితర వివిధరంగాలలో ఇండియా గణనీయమైన ప్రగతిని సాధించిందని శ్రీరాజీవ్‌గాంధీ తెలిపారు.

# సోవియట్‌తో మైత్రి: రాజీవ్ హామీ

సోవియట్‌యూనియన్‌తో భారత్ స్నేహ సంబంధాలు కొనసాగుతాయని ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. టిఖనోవ్ కూడా భారత్‌తో తాము దేశ మైత్రి సంబంధాలు కొనసాగుతున్నాయని శ్రీరాజీవ్‌కు చెప్పారు. శ్రీమతి ఇందిరా గాంధీ అంత్యక్రియలకు సోవియట్ తరఫున హాజరైన బృందానికి టిఖనోవ్ నాయకత్వం వహించారు.

సోవియట్ అధ్యక్షుడు చెర్నెంకో పంపిన సందేశాన్ని శ్రీరాజీవ్‌కు అయన అందజేసారు. సోవియట్‌తో మైత్రి విధానాన్ని భారతదేశం కొనసాగిస్తుందని ఆశిస్తున్నామని టిఖనోవ్ అన్నారు. రెండుదేశాల మధ్య స్నేహ పరస్పర ప్రయోజనకరమైన సంబంధాలను అభివృద్ధిచేసుకునే విషయానికి తమదేశం గొప్ప విలువ ఇస్తుందని టిఖనోవ్ చెప్పారు.

శ్రీమతి ఇందిరాగాంధీ హత్యపట్ల సోవియట్ బృందం శ్రీరాజీవ్‌గాంధీకి సంతాపాన్ని తెలిపింది. సోవియట్ బృందంలో ప్రథమ ఉపాధ్యక్షుడు కుజ్‌నెత్సోవ్, విదేశాంగశాఖ ప్రథమ ఉపమంత్రి మాల్‌ట్సెవ్, భారత్, సోవియట్ రాయబారి ఉన్నారు. శ్రీరాజీవ్‌గాంధీ నియామకం పట్ల సోవియట్ యూనియన్ సంతృప్తిని, హర్షాన్ని ప్రకటించింది.

*

# పాక్ బాంబుకు ప్రతివ్యూహం

భారతదేశం అణుబాంబు తయారుచేయదని, అయితే పాకిస్తాన్ అణుబాంబు తయారు చేయడంవల్ల ఉత్పన్నమౌతున్న పరిస్థితిని, సవాళ్ళను ఇతర మార్గాలద్వారా ఎదుర్కొంటుందని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ మరోసారి స్పష్టంచేశారు. కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీ పార్టీకార్యవర్గ సమావేశంలో ప్రసంగిస్తూ పాకిస్తాన్ ప్రెసిడెంట్ జియా భారత్‌కు వస్తారని శ్రీరాజీవ్ చెప్పారు. శీఘ్రతర పారిశ్రామికీకరణ అవశ్యకతను గూర్చి శ్రీరాజీవ్ వివరించారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అన్నిరంగాలలోను ప్రవేశపెట్టి, నూతన కార్యక్రమాలను అమలుచేయాలని, అవసరమైన రంగాలలో ఈ అత్యాధునిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవాలని ఆయన చెప్పారు. ఈ సాంకేతిక పరిజ్ఞానం బదిలీ కార్యక్రమం త్వరితగతిని అమలు జరగాలని, అయితే ఇది పరిశ్రమల రంగానికి మాత్రమే పరిమితం కావాలనీ, దానిని నిత్యావసర వినియోగ వస్తువుల తయారీరంగంలో ప్రవేశించనీయరాదనీ, శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు.

దిగుమతి చేసుకున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని, వినియోగంలో పెట్టకుండా అది ఇతరులకు అందుబాటు లేకుండా తమ గుప్పిట్లోనే పెట్టుకొని కేవలం స్వప్రయోజనాలు వెళ్ళబుచ్చుకుంటున్న పారిశ్రామిక వేత్తలను ప్రభుత్వం విడిచి పెట్టబోదని ప్రధాని హెచ్చరించారు. ఈ రకం స్వార్థశక్తులను అదుపులో పెట్టడానికి అవసరమైతే చట్టాలను, నిబంధనలను, సవరించడానికి వెనుకాడబోమని ఆయన స్పష్టచేశారు.

1950 లోనే భారతదేశపు పారిశ్రామిక పునాదులు నిర్మితమయ్యాయని జపాన్ పారిశ్రామిక పునాదులు ఒకటిన్నర దశాబ్దాల క్రితంనాటివని చెపుతూ అనుభవం ద్వారా గడించిన ప్రగతిని దిగుమతి చేసుకోవడం లాభదాయకమన్నారు. లఘుపరిశ్రమలు, మధ్యతరహా పరిశ్రమలుగాను, మధ్యతరహా పరిశ్రమలు భారీ పరిశ్రమలుగాను వృద్ధి చెందడానికి అవసరమైన చేయూతనివ్వాలనీ, అప్పుడే పారిశ్రామిక రంగం విస్తరిస్తుందని ప్రధాని వివరించారు.

వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు స్థాపించడానికి అవసరమైన మౌలిక సౌకర్యాలు కల్పించాలనీ ఆరకంగా ఈ ప్రాంతాలకు పరిశ్రమలను ఆకర్షించినప్పుడే స్థానికుల ఆర్థికవికాసం సాధ్యవడుతుందని శ్రీరాజీవ్‌గాంధీ వివరించారు.

## రాజీవ్‌పట్ల యు.పి.లో అభిమానం వెల్లువ

భారత ప్రధాని యువనేత శ్రీరాజీవ్‌గాంధీ సమ్మోహన శక్తిగల నాయకుడు. భారతదేశంలోని అన్ని రాష్ట్రాల్లోకెల్లా పెద్దదైన ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెస్ ఐ పార్టీకి బాగా అనుకూల పరిస్థితిఉంది. ఈ రాష్ట్రంలో, మొత్తం 85 స్థానాలకుగాను 1980 లో 51 స్థానాలను కాంగ్రెస్-ఐ గెల్చుకొంది. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హత్య ఇక్కడి ప్రజలపై ఎంతో ప్రభావం కలుగజేసింది. ఆమె మరణం పట్ల సామాన్య ప్రజలు ఎంతో సానుభూతితో ఉన్నారు. ఈ సానుభూతి వెల్లువ కాంగ్రెస్-ఐ విజయానికెంతో దోహదం చేసింది, ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పరిపాలించే తీరుపై ఇక్కడి ప్రజలు సదభిప్రాయంతో ఉన్నారు. స్వచ్ఛమైన పద్ధతిలో దేశాన్ని ముందుకు నడిపించగలడని విశ్వసిస్తున్నారు. ఆయననాయకత్వం దేశం మరెన్నో విజయాలనూ, అభివృద్ధినీ సాధించగలదని భావిస్తున్నారు. అత్యంత విషాదకర పరిస్థితిల్లో ప్రధానియైన శ్రీరాజీవ్ కొద్దిరోజుల్లోనే వివిధ సమస్యలను పరిష్కరించడంలో చూపిన చొరవ ప్రజ్ఞాపాటవాల పట్ల సంతృప్తి చెందుతున్నారు.

## రాజీవ్ ఔదార్యం

భారత యువ ప్రధాని శ్రీరాజీవ్‌రత్న మద్రాసుకు చెందిన ఒక యువకుడికి మూత్రపిండాల మార్పిడి చికిత్సకై 10 వేల రుపాయలను విరాళంగా ఇచ్చారు.

చికిత్సకు 40 వేల రుపాయలు ఖర్చవుతుందని తాను నిరుపేద కుటుంబానికి చెందినందున ఆర్థిక సహాయాన్ని అందించాలని అర్థిస్తూ అరసు ప్రధానికి ఒక లేఖ రాసుకున్నారు. అరసులేఖకు ప్రధాని స్పందించి పదిరోజులు తిరక్కముందే 10 వేల రూపాయలను మంజూరు చేశారని తమిళనాడు కాంగ్రెస్ ఐ మైనారిటీ విభాగం కార్యదర్శి శ్రీఎం.కె.ఎస్.అబ్దుల్‌హక్ ఒక ప్రకటనలో తెలిపారు. ఇంటా, బయటా మన దేశాన్ని చీల్చటాన్ని ప్రయత్నిస్తున్న శక్తులు వున్నాయని ప్రతిపక్షాలవారు ఈ శక్తులతో లాలూచీ పడుతున్నారని ఆరోపించారు.

## విచ్ఛిన్న శక్తులను అణచివేస్తాం

జగదీశ్‌పూర్ :- (అమేథి) దేశాన్ని బలహీనపరచేందుకు విచ్ఛిత్తికి యత్నించే అన్ని శక్తులను తమ ప్రభుత్వం కఠినంగా అణచివేస్తుందని ప్రధానమంత్రి శ్రీరాజీవ్ ప్రకటించారు. వేర్పాటు, దౌర్జన్యశక్తులు తిరిగి విజృంభించడాన్ని ప్రభుత్వం అనుమతించబోదని, ఆ శక్తులను గట్టిగా అదుపు చేయగలమని అన్నారు. తాను పోటీచేసిన అమేథి పార్లమెంటరీ నియోజకవర్గంలో పలు బహిరంగసభల్లో ఆయన ప్రసంగించారు. దేశం శాంతి, రాజకీయ సుస్థిరత ఉన్నప్పుడే అభివృద్ధి సాధిస్తుందని శ్రీరాజీవ్ అన్నారు. తమ ప్రభుత్వం దేశ పురోగమనానికి అన్ని చర్యలు తీసుకుంటుందని అయితే ప్రభుత్వ చర్యలు విఫలం చేసేందుకు ఈ శక్తులు కృషి చేస్తున్నాయని శ్రీరాజీవ్ అన్నారు. తిరోగమనానికి పాల్పడుతున్న శక్తులను గుర్తించి కాంగ్రెస్-ఐ మద్దతు ఇవ్వడం ద్వారా ఆశక్తులను తిప్పికొట్టవలసిందని రాజీవ్ అన్నారు. తిలోయ్, సరాన్‌లలో ఎన్నికల సభల్లో మాట్లాడుతూ విజయవాడ, శ్రీనగర్, కలకత్తా లలో జరిగిన ప్రతిపక్షాల సమావేశం దేశంలో విషబీజాలు నాటిందని అన్నారు. విదేశీ శక్తులనుంచి ప్రతిపక్షాలకు పెద్ద ఎత్తున ధనసహాయం అందుతుందని. భారతదేశం బలహీన పడాలని చూసే విదేశీశక్తులే ప్రతిపక్షాలకు సాయం చేస్తున్నాయన్నారు. ఆనంద్‌పూర్ సాహిబ్ తీర్మానంపై తమ వైఖరి వ్యక్తం చేయవలసిందిగా ఆయన ప్రతిపక్షాలను కోరారు. ప్రతిపక్షాలవారు రెచ్చగొట్టి నప్పటికి శాంతి, ఓరిమి ప్రదర్శించవలసిందిగా కాంగ్రె కార్యకర్తలకు ఆయన విజ్ఞప్తి చేశారు. భోపాల్ దుర్ఘటనను ప్రస్తావించి ఈ దుర్ఘటనపై దర్యాప్తుచేసేందుకు ఓ విచారణ సంఘాన్ని నియమించినట్లు తెలిపారు. ఈ విషయంలో కమిషన్ నివేదిక రాగానే ప్రభుత్వం అవసరమైన చర్యలన్నిటిని తీసుకోగలదని శ్రీరాజీవ్ అన్నారు.

దేశంలో వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధి చేయడమే కాంగ్రె ప్రభుత్వ విధానమని అమేథి కూడా దేశంలో బాగా వెనుకబడిన ప్రదేశమని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. ప్రభుత్వ విధానం ఫలితంగానే ఈ వెనుకబడిన ప్రాంతంలో కొత్త ప్రాజెక్టులు ఏర్పాటుచేసి స్థానికులకు ఉద్యోగావకాశాలు కల్పిస్తున్నట్లు ఆయన ప్రకటించారు.

అమేథిలో నా ప్రత్యర్థికి బలంతక్కువ :- తన ప్రత్యర్థి అమేథిలో కల్లోలాలను సృష్టిస్తున్నట్లు శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. పేరు చెప్పకుండా తన ప్రత్యర్థికి

స్థానికంగా కొద్దిమందే మద్దతుదారులు ఉన్నారనీ, దానితో ఇతర ప్రాంతాలనుంచి తన ప్రత్యర్థి మద్దతుదారులను సమీకరించుకొంటున్నట్లు ఆయన చెప్పారు.

## విచ్ఛిన్నకర శక్తులకు ప్రతిపక్షాల ప్రోత్సాహం రాజీవ్

జయపూర్ః- పంజాబ్, అస్సాం, జమ్మూ-కాశ్మీర్‌లలోని వేర్పాటు శక్తులకు ప్రతిపక్షాలనుంచి ప్రోత్సాహమేకాక సహాయం కూడా లభించిందని ప్రధాని శ్రీరాజీవ్ గాంధీ ఒక బహిరంగసభలో అన్నారు. కాశ్మీర్, విజయవాడ కలకత్తాలలో జరిగిన ప్రతిపక్షనాయకుల సమావేశాలలో చేయబడిన ప్రకటనలు జాతి విద్రోహశక్తులకు దోహదం చేశాయని ఆయన అన్నారు. ప్రతిపక్షాలవారు పంజాబ్ తీవ్రవాదులకు ప్రత్యక్షంగా సహాయపడ్డారని ఆయన అన్నారు.

మూడేళ్ళకాలంలో జనతా ప్రభుత్వము తనపదవీకాలంలో వివిధ కమీషన్లను నియమించి పరిపాలనా యంత్రాంగపు నైతికబలాన్ని దిగజార్చటమేకాక రహస్య సమాచారశాఖను ఇతర ప్రభుత్వ అంగాలనూకూడా గజిబిజిచేసిందని ప్రధాని అన్నారు. కాంగ్రెస్ పాలనలో దేశం తిరిగి పట్టాలపైకి ఎక్కించబడిందని అంతేగాక వివిధ రంగాలలో విపరీతమైన అభివృద్ధి సాధించబడిందని ఆయన అన్నారు. ప్రధాని మహరాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్‌లలోని వివిధ పట్టణాలలో జరిగిన అనేక బహిరంగ సభలలో ప్రసంగించారు.

విచ్ఛినశక్తులను అణచివేసి బలీయమైన సమైక్యభారతాన్ని నిర్మించగల ఏకైక పార్టీ ఇందిరా కాంగ్రెస్‌యని, ఆపార్టీకి ఓట్లువేసి గెలిపించాలని ప్రధాని ఈ సభలలో ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ప్రతిపక్షాల అవకాశవాదాని నిశితంగా విమర్శిస్తూ శ్రీరాజీవ్‌గాంధీ ఈ పార్టీలో స్వల్పకాలిక ప్రయోజనాలకోసం విచ్ఛిన్న శక్తులను, అవినీతి శక్తులను ప్రోత్సహిస్తున్నాయని అన్నారు. భారత ఆర్థికవ్యవస్థ జనతా హయంలో నాశనం చేయబడిందనీ, అభివృద్ధి కార్యకలాపాలు తగ్గిపోయాయని ప్రధాని అన్నారు.

*

# రిజర్వేషన్లు కొనసాగుతాయ్

## ప్రధాని రాజీవ్ స్పష్టీకరణ:-

హరిజన, గిరిజన కులాల విముక్తికి, అభ్యున్నతికి తమ ప్రభుత్వం కట్టుబడి ఉన్నదని వారికి అమలుచేస్తున్న రిజర్వేషన్ల విధానాన్ని కొనసాగిస్తామని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ హామి ఇచ్చారు. రాజ్యాంగ నిర్మాత డాక్టర్.బి.ఆర్.అంబేద్కర్ నిమ్నజాతీయుల ధృవతారయని శ్రీరాజీవ్‌రత్న అభివర్ణించారు. అట్టడుగు వర్గాల వారు అన్ని రంగాలలో మిగతావారివలె అభివృద్ధి సాధించేందుకు ప్రభుత్వం అమలు చేస్తున్న చర్యలను కొనసాగిస్తామని ఆయన చెప్పారు.

## సేవాభావంతో కరువుపనులు అమలు

అధికారులకు రాజీవ్ హితవు :- కరువుబాధలతో అలమటిస్తున్న ప్రజలకు ఊరట కలిగించేందుకు సహాయపనులను చిత్తశుద్ధితో, సేవాభావంతో అమలువరచే ప్రతిభాసామర్థ్యాలుకల అధికారులను నియమించాలని రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ సూచించారు. తమకు అప్పజెప్పిన బాధ్యతలను విజయవంతం చేయడంలోనే తమకు సంతృప్తి ఆనందం ఉంటుందనే విషయాన్ని అధికారులు గుర్తించాలని ప్రధాని చెప్పారు.

ఒరిస్సాలో తీవ్రనీటి ఎద్దడి ఉంటున్న గ్రామాలలో మంచినీటి సరఫరాకోసం రాష్ట్రప్రభుత్వం చేస్తున్న కృషిని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ప్రశంసించారు. ఒరిస్సాలో తీవ్ర నీటిఎద్దడిగల కొన్ని గ్రామాలను శ్రీరాజీవ్‌గాంధీ స్వయంగా సందర్శించారు. ఒరిస్సాలోనేకాక, దేశంలోని అనేక ప్రాంతాలలో కరువు విలయతాండంచేస్తూ ఆందోళన కలిగిస్తున్నదని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పేర్కొన్నారు. కరువు బాధిత ప్రాంతాలలో పనిచేసే అధికారులకు ప్రత్యేక చెల్లింపులు, వసతి, పిల్లలకు విద్యా సదుపాయాలు కల్పించడంవంటి ప్రోత్సాహకాలు ఇవ్వాలని ప్రధాని సూచించారు. అధికారులు తమకు అప్పగించిన బాధ్యతలను విజయవంతం చేయడమే వారికి తగిన

రిపార్డు అని ప్రధాని అన్నారు. నిరుపేదలు అన్నివేళలా ప్రభుత్వ కార్యక్రమాల నుండి ప్రయోజనం పొందకపోవచ్చు అయితే పేదలు ప్రయోజనం పొందడం అనేది సహాయసంక్షేమ కార్యక్రమాలు విజయవంతం కావడంపై ఆధారపడి ఉంటుందని ప్రధాని పేర్కొన్నారు.

ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు నిస్సహాయులైన ప్రజలను ఆదుకోవడం ప్రభుత్వాలవిధి అని శ్రీరాజీవ్‌గాంధీ పేర్కొన్నారు. బాధిత ప్రాంతాలకు ప్రభుత్వాధికారులు, సిబ్బంది చొచ్చుకువెళ్ళి నిత్యావసర సరుకులు, ఆహారపొట్లాలు సక్రమంగా అందించగలిగినపుడే పేదలకు ఊరట కలుగుతుందని ఆయన అన్నారు.

ఆకలి బాధలనుండి అలమటించే ప్రజలను ఆదుకునేందుకు రాష్ట్రపాలనా యంత్రాంగం శాయశక్తులా కృషిచేస్తూ శక్తివంచన లేకుండా పని చేస్తున్నది. నిత్యావసరమైన సరుకులు బాధిత ప్రజలకు సక్రమంగా అందేలా చూడాలి. అందుకు తగిన ఏర్పాట్లు కూడా చేసుకోవాలని ప్రధాని పేర్కొన్నారు కరువు కాటకాలకు తరచు గురవుతున్న ప్రాంతాలకు సేద్యపునీటి సదుపాయాలు కల్పించడమే శరణోపాయమని ఆయన అన్నారు. రోడ్లు, వంతెనలు, కరకట్టలు వంటి నిర్మాణాలలో గ్రామీణ ఉపాధి కార్యక్రమాలను మిళితం చేయాలని ప్రధాని సూచించారు.

—o—

# రాజీవ్ విదేశీ విధానాలకు చండ్ర ప్రశంస

మీరట్:-

విదేశాలతో భారతదేశ సంబంధాల విషయంలో ప్రధాని రాజీవ్‌గాంధీ స్వతంత్ర విధానాలు అవలంబిస్తున్నందుకు భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి చంద్రరాజేశ్వరరావు ప్రధానిని అభినందించారు. అమెరికా అధ్యక్షుడు రీగన్‌తో జరిపిన చర్చల్లో ప్రధాని ప్రతిభ వెల్లడయిందని భారతదేశ విధానాన్ని చాల స్పష్టంగా ప్రకటించడాన్ని రాజేశ్వరరావు ఓ పత్రికా సమావేశంలో మాట్లాడుతూ అన్నారు. తల్లితో పోల్చితే రాజీవ్ విజయవంతంగా దేశసమస్యలపట్ల విధాన నిర్ణయాలు చేయగల్గుతున్నాడని ఆయన తెలిపారు. అయితే రాజీవ్ ఆర్థికవిధానాలు దేశంలో బహుళ కంపెనీల ఆధిపత్యాన్ని పెంచేవిగా వున్నాయని, అవి దేశంలో పేదరికాన్ని విపరీతంగా పెంచుతాయని ఆయన అన్నారు. అలాగే రాజీవ్‌గాంధీ నూతన విద్యావిధానంకూడా లోపభూయిష్ట మయిదేనని, ఇప్పుడున్న పరిస్థితిలో ఎక్కువ పాఠశాలలకన్నా వున్న పాఠశాలలకు సదుపాయాలెక్కువ కలుగజేయాల్సిన అవశ్యకత వుందని అయన స్పష్టంచేశారు.

ప్రాథమికావసరాల్ని సంతృప్తి పరచకుండా కంప్యూటర్ల ప్రవేశం పాఠశాలల్ని ఉద్ధరించదని అయన పేర్కొన్నారు. జాతీయ సమగ్రతకు హిందీ తోడ్పడగలదని రాజేశ్వరరావు ఓ ప్రశ్నకు సమాధానం తెలిపారు.

## స్త్రీ పురుష కార్మికులకు సమానవేతనం

హుబ్లి :- ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ కర్ణాటకలోని కరువు ప్రాంతాలలో పర్యటించి కార్మికుల కష్టాలను స్వయంగా తెలుసుకున్నారు. కార్మికులతో ప్రధాని మాట్లాడుతున్నప్పుడు ఉన్నతస్థాయి జిల్లా అధికారులను సైతం దూరంగా వుంచడం జరిగింది.

కొందరు మజ్జూరు గ్రామంలో మహిళా కార్మికులు తమకు చాలా తక్కువ కూలీలిస్తున్నారని ప్రధానికి ఫిర్యాదుచేశారు. ఆ వెంటనే ప్రధానమంత్రి అక్కడి

అధికారులను పిలిపించి ఆడవారికి మగవారితో సమానంగా కూలీ చెల్లించాలని అక్కడికక్కడే ఆదేశాలు జారీచేశారు.

కార్మికులతో ప్రధానమంత్రి మాట్లాడేటప్పుడు తన ప్రశ్నలను కార్మికులకు తర్జుమాచేసి చెప్పటానికి, వారుచెప్పె యిబ్బందులను తనకు అనువాదంచేసి చెప్పటానికి అధికారులనే కాక హింది, కన్నడం బాగా తెలిసిన ఒకరిని కార్మికులనుంచే ఎంపిక చేసుకున్నారు. అధికారులు దూరంగా వుంచబడ్డారు. కొన్నిసందర్భాలలో తానడిగిన ప్రశ్నలకు కార్మికులు చెప్పిన సమాధానాలపై వివరణలు యివ్వటానికి డిప్యూటి కమీషనర్, స్పెషల్ డిప్యూటి కమీషనర్ తదితర అధికారులు ముందుకు రాబోగా వారిని ప్రక్కకు త్రోసివేయడం జరిగింది.

బీజపూర్‌జిల్లాలోని ముత్తల్‌గిరిలో ప్రధానమంత్రి కరువుపనులలో నియోగించబడిన కార్మికుల హాజరుపట్టిని పరిశీలించి అందులో అనేక దొంగపేర్లు వున్నట్లు తెలుసుకున్నారు. ఈ విషయమై తీవ్ర అసంతృప్తి వ్యక్తంచేశారు.

## రాజీవ్‌పై మోజు తగ్గలేదు

భారత ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ పాలనాతీరు మెరుగ్గాఉంది. దేశములోని ఆరు ప్రధాన నగరాలైన బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, బెంగుళూరు, మద్రాస్, హైదరాబాదు లలోని 2144 మంది అభిప్రాయాలు తెలుసుకుని ఈ సర్వే ఫలితాలను ప్రచురింపుచేశారు. వీరిలో పురుషులు, స్త్రీలు సమముగా ఉన్నారు. ఈ సర్వే ప్రకారము రాజీవ్‌గాంధీ పరిపాలనను ప్రశంసించిన నగరాలలో హైదరాబాద్ ప్రథమస్థానంలో ఉంది. హైద్రాబాదులో 68 శాతము మంది, మద్రాస్‌లో 66 శాతము మంది, రాజీవ్ విధానాలను మనస్ఫూర్తిగా బలపరిచారు. ఆయన వ్యవహారసరళిలో ఢిల్లీలో 51 శాతము మంది మెరుగుదలలో ఉన్నారు.

## అస్సాంకు శుభవార్త

రాజీవ్‌గాంధీ అస్సాం సమస్యకు వీలైనంత త్వరలో ఒక పరిష్కారం జరగగలదని చెప్పారు. బ్రిగేడ్ ఫీల్డులో ఏర్పాటుచేసిన కాంగ్రెస్ శతాబ్దిరాష్ట్రసాయి ఉత్సవాల ముగింపు సభలో రాజీవ్‌గాంధీ ప్రసంగించారు. దేశపురోగతికి అడ్డముగా నిలిచిన అస్సాం సమస్యకు ఎవరూ బాధపడని, నష్టపోని రీతిలో పరిష్కారము చేయగలమని చెప్పారు.

———

# గంగానదిని రక్షించుకోండి

**ప్రధాని పిలుపు:-**

పవిత్రతకు మారుపేరుగా పేరుగాంచిన గంగానదిని కాలుష్యరహితంగా పరిశుభ్రంగా వుంచడానికి గాను ప్రజలు ఉద్యమించాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పిలుపునిచ్చారు. తరతరాల భారతీయ నాగరికతకు గంగానది తల్లిలాంటిదని ఆయన అభివర్ణించారు. ప్రపంచంలో కాలుష్యం వాతబడిన మహానదుల్లో ఒక్కటైన గంగానది జలాల శుద్ధికి ఒక బృహత్తర కార్యచరణ పథకాన్ని ఆయన ప్రారంభిస్తూ, ఈ మహానదిని మానవాళికి పనికొచ్చే, రీతిలో సంరక్షించు కోవడానికి ప్రభుత్వం అధిక ప్రాధాన్యత ఇస్తున్నట్లు తెలియజేశారు. ప్రభుత్వం గంగానది పారిశుధ్యం కోసం అన్ని చర్యలు తీసుకుంటుందని ఆయన చెప్పారు. అయితే ఈ నది పరిశుభ్రతను దరిమిలా పవిత్రతను, కాపాడటంలో ప్రజలే ఎక్కువ బాధ్యత వహించాలని ప్రధాని కోరారు.

ప్రజల నిర్లక్ష్యం వల్ల ప్రతినిత్యం ఈ నదిగర్భంలో కల్సిపోతున్న వందలాది మనుషుల, పశుపక్ష్యాదుల మృత కళేబరాలపట్ల ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. ఈ మహానది మన ఆధ్యాత్మికతకు మాత్రమే కాకుండా దేశ సమైక్యత, సమగ్రతలకు నిదర్శనంగా ఆయన వర్ణించారు. గంగానదిలో కాలుష్యానికి కారణమైన వ్యర్థపదార్థాలను నిరోధించాలని ఆయన కోరారు. దాదాపు 120 కోట్ల లీటర్ల మురికి, వ్యర్థపదార్థాలతో కూడిన నీరు ప్రతిరోజు ఈ నదిలో కలుస్తున్నదని శ్రీరాజీవ్ తెలిపారు. ఐదువేల సంవత్సరాల భారతీయ నాగరికత లౌకికత్వంపైన ఆధారపడి వుందని, ఈ సంప్రదాయలనుండి ప్రజలు స్ఫూర్తి పొందాలనీ, సంకుచిత, మతతత్వ శక్తులను గురించి ఆయన హెచ్చరిస్తూ, ఈ శక్తులు మనదేశాన్ని బలహీనపర్చడానికి యత్నిస్తున్నాయన్నారు. దేశ ప్రజల ఐక్యమత్యాన్ని పెంపొందించడమే

తమ ప్రభుత్వ ప్రధానకర్తవ్యంగా భావిస్తున్నదని ప్రధాని తెలిపారు. వారణాసి విశాల భారతానికి సంక్షిప్తరూపమని అన్నిరాష్ట్రాలకు, అన్నిమతాలకు చెందిన ప్రజలకు వారణాసి కూడలివంటిదని ఆయన అన్నారు. వారణాసి పవిత్రత అంతా అది గంగా నది తీరాన, వుండటమేననీ, తులసీదాస్, 'రామచరితమానస్' ఇక్కడే సృజించారని ఆయన వివరించారు.

'సర్వధర్మసంభవ' ను విశ్వసించే మన సంస్కృతికి గంగానది ప్రతీక అని రాజీవ్ అన్నారు. ప్రజల్లో ఏక సంస్కృతి, భిన్నత్వంలో ఏకత్వం ఈ స్ఫూర్తి వల్లనే సాధ్యపడిందని, వారణాసి ప్రాశస్త్యాన్ని వివరిస్తూ ఆయన, గౌతమబుద్ధుడు తన మొదటి ప్రార్థనలు జరిపింది ఇక్కడికి సమీపంలోనేనని వెల్లడించారు. ఇక్కడి బాబాషరీద్‌తో కల్సి గురునానక్ తమ మత బోధలు చేసినట్లు ప్రధాని తెలిపారు గురుఅర్జున్‌దేవ్, గురురవిదాస్. మీర్జాగాలిబ్, మదర్‌థెరిస్సా మనజాతి వికాసానికి కృషి చేసింది. కూడా ఇక్కడి నుంచేనని శ్రీరాజీవ్ వివరించారు. వారణాసిలోని విశ్వనాథదేవాలయానికి మహారాజా రంజిత్‌సింగ్ బంగారం, ఇతర ఆభరణాలను ప్రదానం చేశారని ఆయన చెప్పారు.

## ప్రిటోరియాపై ఐక్యకార్యాచరణ

ప్రపంచ దేశాలకు రాజీవ్ పిలుపు:- జాతి వివక్షతను అంతమొందించేందుకు శ్వేతజాతి దురహంకార దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఖచ్చితమైన తక్షణ చర్యను తీసుకోవాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ప్రపంచదేశాలకు విజ్ఞప్తిచేసారు. దక్షిణాఫ్రికాను మాటలలో ఖండించి ఇక ప్రయోజనంలేదు. జాతి వివక్షతను కొనసాగిస్తున్న ఆ వ్యవస్థను సంస్కరించడానికి చేస్తున్న యత్నాలను ప్రోత్సహించరాదు. మొత్తం ఆదుష్ట వ్యవస్థను ఆమూలాగ్రం ధ్వంసం చేయడమే తక్షణకర్తవ్యం అని ఆయన అన్నారు.

దక్షిణాఫ్రికాపై ఆంక్షలు విధించే సమస్యను చర్చించేందుకు సమావేశమైన ప్రపంచ మహాసభకు శ్రీరాజీవ్‌గాంధీ అలీన ఉద్యమ అధ్యక్షుని హోదాలో పంపిన

ఒక సందేశంలో పై విధంగా అన్నారు. దక్షిణాఫ్రికాలో మానవతా విలువలు నాశనమవుతుంటే నిస్సహాయంగా చూస్తూకూర్చోరాదని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. భారత విదేశ వ్యవహారాల సహాయమంత్రి ఎడ్యురాడో ఫెలిరో పారిస్‌లో ప్రారంభమైన సమావేశంలో చదివి వినిపించారు ఐదురోజులపాటు జరిగిన ఈ సమావేశాన్ని ఐక్యరాజ్య సమితికి చెందిన దక్షిణాఫ్రికా వ్యవహారాల ఉపసంఘం ఏర్పాటుచేసింది. 'సోకెటోలో పదేళ్ళక్రితం వందలాది అమాయక బడిపిల్లల్ని దక్షిణాఫ్రికా రాక్షస ప్రభుత్వం ఊచకోతచేసిన సంఘటనను శ్రీరాజీవ్‌గాంధీ తమ సందేశంలో గుర్తుచేశారు. ఈ సమావేశానికి దాదాపు వందదేశాల ప్రతినిధులు హాజరైనారు. అయితే బ్రిటన్, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ ప్రతినిధులు మాత్రం రాలేదు. ఈ మహాసభ ఆమోదించనున్న ప్రకటనను ఐక్యరాజ్యసమితి ప్లీనరీ సమావేశం పరిశీలించింది. జాతి వివక్షతకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో భారతదేశం ఎప్పుడు ముందుంటుందని శ్రీరాజీవ్‌గాంధీ స్పష్ట చేసారు. దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆంక్షలను విధించడం మినహా మరోమార్గంలేదని ఆయన స్పష్టంచేసారు.



# కాంగ్రెసేతర ప్రభుత్వాలపై రాజీవ్ విమర్శ

**పాట్నా:-**

కర్నాటక, పశ్చిమబెంగాల్, ఆంధ్రరాష్ట్రాలలో అధికారంలో ఉన్న పార్టీలు ప్రభుత్వ వనరులను తమ పలుకుబడి పెంచుకోడానికి ఉపయోగించు కుంటున్నాయని ప్రధాని శ్రీరాజీవ్‌రత్న ఆరోపించారు. నిరంతరం ఈ ప్రభుత్వాలు పార్టీ వ్యవహారాల్లో నిమగ్నమై ఉన్నందున ప్రజాసంక్షేమం గురించి పట్టించుకునే తీరికపీరికి లేదని బీహార్‌లో వివిధ ప్రాంతాలలో ఎన్నికల సభలలో ప్రసంగిస్తూ ఆయన అన్నారు. డాల్టనగంజ్, హజరిబాగ్, సింధ్రి, హగల్‌పూర్, కతిహార్, మధుపుర, బరౌనిలబిపురలలో బహిరంగసభలలో రాజీవ్‌గాంధీ ప్రసంగించారు. జనతా, బి.జె.పి. వంటి పార్టీల కార్యకలాపాలు, వాటి స్వరూపం ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయని అవి ఎంత దిగజారి పోయాయో ఆ కార్యకలాపాలు నిరూపిస్తున్నాయని అన్నారు.

ఇందిరాగాంధీ హంతకుడు సత్వంత్‌సింగ్ తరపున వాదించడానికి బి.జె.పి. సీనియర్ నాయకుడుని పంపిందని, మహాత్మాగాంధీని హత్యచేసిన నాథూరాంగాడ్సే తరపున కూడా ఈ న్యాయవాదే వాదించారని ప్రధాని తెలిపారు. న్యాయవాదిని పెట్టుకునే అర్హత ప్రతి ఒక్కరికి ఉన్నప్పటికి బి.జె.పి. యే ఎందుకు న్యాయవాదిని పంపిందో ప్రజలు ఆలోచించాలని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. 1977 లో జనతాపార్టీ క్యాబినెట్ మంత్రిగా ఉన్న ఒక సీనియర్ నాయకుడిని బ్రిటన్ పంపగా ఆయన తీవ్రవాదుల ఆధిపత్యంలో ఉన్న గురుద్వారాలు సందర్శించి తప్పుడు ప్రకటనలు చేశారని బాహాటంగానే దేశవిచ్ఛిత్తికోసం సలహాలిస్తున్న వేర్పాటువాద శక్తులతో ఈ నాయకుడు కుమ్మక్కయ్యారని శ్రీరాజీవ్‌గాంధీ ఆరోపించారు. ఈ పరిణామాలు అన్నిటిని దృష్టిలో పెట్టుకొని దేశరాజకీయ జీవితంలోని ఎటువంటి వ్యక్తులు ప్రవేశించారు, ఏవిధమైన కార్యకలాపాలకు పాల్పడుతున్నారో ప్రజలు ఆలోచించాలని అన్నారు.

అభివృద్ధి కార్యక్రమాలు నిరాటంకంగా కొనసాగాలంటే ఒకసారి ఎన్నికయిన ప్రభుత్వం పూర్తికాలం ముగిసేవరకు, ఐదేళ్ళపాటు కొనసాగాలని అన్నారు. ప్రతిరెండేళ్ళ కొకసారి ఎన్నికలు జరిపితే పనులేలా సాగుతాయి? అని 1977 లో కేంద్రంలో జనతాప్రభుత్వము పతనమయ్యెను, కాంగ్రెస్ హయాంలో కర్నాటక,

ఆంధ్రప్రదేశ్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో పరిపాలన ఎంతో బాగుందని, ప్రతిపక్షాల ప్రభుత్వాల పాలనలో అభివృద్ధి కార్యక్రమాలు నిలిచిపోవడమేకాక, నానాటికి ఆర్థికపరిస్థితి దిగజారి పోతోందని అన్నారు. కేంద్రం ఏ కార్యక్రమాలు, విధానాలు రూపొందించినా అవి రాష్ట్రాల రాజధానులకు చేరుతాయని, అక్కడినుంచి జిల్లాలకు, గ్రామాలకు చేర్చే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదేనని అందువల్ల కేంద్రంతో పాటు రాష్ట్రాలలో కూడా సమర్థమైన స్థిరమైన ప్రభుత్వాలు ఉండాలని అన్నారు. తమ పార్టీ మాత్రమే అటువంటి సమర్థమైన ప్రభుత్వం ఏర్పాటు చేయగలదని అన్నారు. "బండి ముందుకు సాగాలంటే రెండు ఎద్దులు ఉండాలి, ఆ విధంగా కాక ఐక ఎద్దు, మరొకటి ఒంటో. గాడిదో, కంచరగాడిదో అయితే బండి ముందుకు సాగదు" అని కేంద్ర, రాష్ట్రాలలో ఒకేసారి అధికారంలో ఉండాలన్న దృష్టితో అన్నారు. స్వచ్ఛమైన రాజకీయాలకోసం దేశంలో రాజకీయాల ప్రమాణాలు మెరుగు పరచడానికి తమ ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుందని, పాలనా యంత్రాంగాన్ని పటిష్ఠం చేసేందుకు కూడా చర్యలు తీసుకుందని చెప్పారు. ఇంకా అనేక చర్యలు తీసుకోంటున్నామని, తద్వారా దేశం శీఘ్రగతిన అభివృద్ధి సాధిస్తుందని చెప్పారు.

బీహార్‌లో అనేక ప్రాంతాలలో ఉన్న వెనకబాటుతనం గురించి తనకు తెలుసునని, రాష్ట్ర అభివృద్ధికి ప్రత్యేక పథకాలు రూపొందిస్తామని ఆయన చెప్పారు. బీహారు రైతులు పంజాబ్, హర్యానా రైతుల స్థాయికి చేరుకునేలా తగు కార్యక్రమాలు రూపొందిస్తామని తెలిపారు. ఇందిరాగాంధీ ప్రభుత్వం 1980 లో తిరిగి అధికారంలోకి వచ్చిన తర్వాత జనతా ప్రభుత్వం వల్ల నాశనమైన ప్రగతిని మళ్ళీ తీసుకు రాగలిగిందని గత ఐదేళ్ళలో అద్భుతమైన ప్రగతిని సాధించామని చెప్పారు. హజరిబాగ్ దేశంలో బాలికలకు ఉన్నతస్థాయివరకు ఉచిత విద్యాసౌకర్యం కల్పించనున్నట్లు శ్రీరాజీవ్‌గాంధీ ప్రకటించారు. మహిళల, యువకుల అభ్యున్నతికి ప్రభుత్వం కట్టుబడి వుందని ఇక్కడికి దాదావు ఐదు కిలోమీటర్ల దూరంలో నాగ్రా విమానాశ్రయం వద్ద బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఆయన చెప్పారు.

విద్యా విధానం లోప భూయిష్టంగా నున్న కారణంగా దానిని మార్చవలసిన అవసరం వుందని అన్నారు. కొత్త విద్యా విధానం స్వరూపం ముసాయిదాను తయారుచేసి, ప్రజల ఆమోదం కోసం సమర్పిస్తామని వచ్చే సంవత్సరము (1986) కొత్త విద్యా విధానాన్ని అమలు చేస్తామని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. ఇందుకోసం ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఆదివాసులు, హరిజనులు వెనుకబడ వర్గాలు. అల్పసంఖ్యాక వర్గాల సంక్షేమం కోసం సాధ్యమైన అన్ని చర్యలు తీసుకుంటున్నట్లు చెప్పారు. బీహారులో పరిశ్రమలను అభివృద్ధి చే యవలసి వుందని రాష్ట్రంలో కాంగ్రెస్(ఐ) ప్రభుత్వం ఏర్పడితేనే ఇది సాధ్యమని అన్నారు.

— o —

# 'క్రమశిక్షణ, పరిశ్రమ'

దేశ సమైక్యత, సమగ్రత పరిరక్షణకే ప్రజలు 8 వ లోకసభ ఎన్నికలలో కాంగ్రెస్-ఐ ని రికార్డుస్థాయిలో గెలిపించారని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. ఢిల్లీలోని తన నివాసగృహం సమీపంలోని మోహతీచౌక్ ప్రాంతంలో వరసగా రెండవ రోజు కూడా విజయోత్సవ సభలో ఆయన మాట్లాడుతూ పైవిధంగా అన్నారు. అత్యంత క్రమశిక్షణతో శ్రమపడి పనిచేయడం ద్వారా మన లక్ష్యాలను చేరుకోవలసి ఉంది అని ఆయన అన్నారు. అభివృద్ధి పురోగతి విషయంలో మనదేశం ఏ ఇతర దేశానికి తీసిపోదని ప్రపంచానికి మనం నిరూపించి చూపాలని శ్రీరాజీవ్ అన్నారు. ఎన్నికలలో తమ పార్టీకి చేకూరిన అఖండ విజయం తన భుజస్కందాలపై బాధ్యతల బరువు మోపిందని ఆయన తెలిపారు. ఎన్నికల వాగ్దానాలన్నీ నెరవేరుస్తానని, పార్టీ ప్రణాళికను తు చ తప్పక ఆచరించుతామనీ ఆయన అన్నారు.

భారతదేశ ప్రజలు ఎన్నో శక్తి యుక్తులు గలవారనీ, నిర్దేశిత లక్ష్యాలన్నీ నెరవేరేలా చూస్తాననీ ఆయన అన్నారు. శ్రీజగదీశ్ టైట్లర్ గెలుపొందిన ఢిల్లీలోని సాదర్ నియోజకవర్గం లోని అనేక మంది సిక్కులు ఈ విజయోత్సవ సభకు హాజరయ్యారు. రాజీవ్ ఈ సభకు రాగానే ఇతరులతో కలిసి సిక్కులు కూడా ఇందిరా గాంధీ అమర్ రహే, రాజీవ్‌గాంధీ జిందాబాద్ అని నినాదాలు ఇచ్చారు.

## 'రాజీవ్ సంఘీభావయాత్ర'

ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ నాలుగు ఆఫ్రికా దేశాల పర్యటన ఆయన విదేశ యాత్రలలో మరో కొత్త అధ్యాయంగా నిలిచిపోయింది. దక్షిణాఫ్రికా, నమీబియాల్లో సాగుతున్న స్వాతంత్ర్య పోరాటానికి భారతదేశ మద్దతును, సంఘీభావాన్ని వ్యక్తం చేయడానికి ప్రధాని పర్యటన దోహదం చేసింది. ప్రధాని ఐదురోజుల ఆఫ్రికాదేశాల పర్యటనకు ముందు కొన్ని వివరాలను విదేశీ వ్యవహారాల (పశ్చిమం) కార్యదర్శి డాక్టర్ జె.ఎస్.తేజా విలేకరులకు తెలియజేశారు.

అఫ్రికాదేశాలలో అధికార హోదాలో పర్యటించిన తొలి భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ యేనని ఆయన అన్నారు. భారత ఉన్నతాధికార ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహిస్తున్న శ్రీరాజీవ్‌గాంధీ తొలుత టాంజానియాలో పర్యటించారు. టాంజానియా అధ్యక్షుడు అలీహస్సన్ ఆయనకు స్వాగతం చెప్పారు.

దక్షిణాఫ్రికా ప్రజలు స్వాతంత్ర్యంకోసం జరుపుతున్న పోరాటానికి, సామానత్వం సాంఘిక న్యాయసాధనకు సంఘీభావం వ్యక్తంచేయడానికి శ్రీరాజీవ్‌గాంధీ పర్యటన వీలుకల్పించిందని డాక్టర్ తేజా అన్నారు. పోరాటంలో ఉన్న అఫ్రికా ప్రజలు ముఖ్యంగా దక్షిణాఫ్రికా ప్రజలతో సన్నిహితం కావడానికి పర్యటన దోహదపడిందని ఆయన చెప్పారు.

జాతిపిత మహాత్మాగాంధీ ఈ శతాబ్దం ఆరంభంలో దక్షిణాఫ్రికాలోనే తొలుత తమ పోరాటాన్ని ప్రారంభించారు. ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ దక్షిణాఫ్రికా సరిహద్దు దేశాలలో పర్యటించి అఫ్రికా ప్రజలను ఉత్తేజితులను చేసారని తేజా వివరించారు. జాతి వివక్షతకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటం, నమీబియాకు స్వాతంత్రం, సరిహద్దు దేశాల అస్థిరతకు కుట్రలు వంటి ముఖ్యమైన అంశాలు, జాంబియా, జింబాబ్వే, అంగోలా టాంజానియా దేశాల నాయకులతో ప్రధాని జరిపిన చర్చలలో ప్రస్తావనకు వచ్చాయని ఆయన అన్నారు.

అలీన ఉద్యమ అధ్యక్షస్థానం నుంచి వైదొలుగుతున్న శ్రీరాజీవ్‌గాంధీ అలీన ఉద్యమ నూతన అధ్యక్ష పదవీ బాధ్యతల్ని స్వీకరించనున్న జింబాబ్వే ప్రధాని రాబర్ట్‌ముగాబేతో అలీన ఉద్యమ వ్యవహారాలను చర్చించేందుకు ఈ పర్యటన ఉపయోగకరమైనది.

శ్రీరాజీవ్ పర్యటనా కాలం తక్కువైనప్పటికీ అఫ్రికా నాయకులతో చర్చలు జరపడానికి ఎక్కువ కాలాన్ని కేటాయించారు.

## 'కాశ్మీరు అసెంబ్లీ రద్దుచేయం'

జమ్ము కాశ్మీరు శాసనసభను రద్దు చేసే ప్రసక్తిలేదని, ఆరేళ్ళపాటు శాసనసభ మామూలుగా కొనసాగుతుందని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ స్పష్టంచేశారు. జమ్మూ కాశ్మీరులో మధ్యంతర ఎన్నికలు జరపాలని మాజీ ముఖ్యమంత్రి శ్రీఫరుక్‌అబ్దుల్లా

చేస్తున్న డిమాండ్‌ను ప్రధాని దృష్టికి తెచ్చినప్పుడు ఆయన అసెంబ్లీని రద్దు చేయ డానికి కారణం వుండాలికదా అన్నారు.

32 మంది ఫరుక్ వర్గం ఎం.ఎల్.ఎలు రాజీనామాచేస్తే అయాస్థానాల్లో మధ్యంతర ఎన్నికలు నిర్వహించవలసి రావచ్చునని మరో ప్రశ్నకు సమాధానంగా శ్రీ రాజీవ్ అన్నారు.

రాష్ట్ర అసెంబ్లీ గురించి సిఫారసు చేయవలసింది ఆ రాష్ట్ర గవర్నర్ శ్రీ జగ్‌మోహన్ మాత్రమేనని శ్రీరాజీవ్ స్పష్టంచేశారు.

పంజాబ్‌లో పరిస్థితి చక్కబడుతున్నదని ప్రధాని అభిప్రాయపడ్డారు. అకాలీ దళ్ అంతర్గత విభేదాల గురించి అడిగిన ప్రశ్నకు సమాధానం చెపుతూ ఇతరుల వ్యవహారాల్లో మేము జోక్యం చేసుకోము అని అన్నారు. తమిళ గెరిల్లాలతో పోరాడ డానికి ఆయుధాలు, విరాళాలు అందజేయాల్సిందిగా శ్రీలంక అధ్యక్షుడు శ్రీజయ వర్ధనే ప్రపంచ దేశాలకు చేసిన విజ్ఞప్తిపై వ్యాఖ్యానించడానికి ప్రధాని నిరాక రించారు. శ్రీ జయవర్ధనే ప్రకటన పాఠం తెలిస్తేగాని వ్యాఖ్యానించండం కష్టమని ఆయన అన్నారు. విదేశాంగశాఖ మాజీ కార్యదర్శిగా శ్రీ రమేష్ భండారీ, మంత్రి శ్రీ పి.చిదంబరం శ్రీలంక పర్యటన అనంతరం పరిస్థితి కొంత మెరుగు పడిందని అన్నారు. మంత్రుల ప్రమాణస్వీకారోత్సవానికి వచ్చిన శ్రీ రాజీవ్‌గాంధీ విలేకరులు అడిగిన అనేక ప్రశ్నలకు సమాధానం చెప్పారు.

నాలుగు ఆఫ్రికాదేశాల యాత్ర గురించి ప్రస్తావిస్తూ శ్రీరాజీవ్‌గాంధీ ఈ దేశాల సమస్యలను అవగాహన చేసుకోడానికే తాను ఆ దేశాలు పర్యటించానని అన్నారు. ఈ పర్యటన సమయంలో దక్షిణాఫ్రికాకు భారతదేశం మద్దతుగురించి పునరుద్ఘాటిస్తా మని ఆయన స్పష్టంచేశారు.

## భావితరాలకు బాటవేద్దాం రాజీవ్‌పిలుపు

వందేళ్ళ తర్వాతకూడా మన వారసులు సగర్వంగా చెప్పుకొనే పటిష్ఠమైన ఉత్తమమైన భారతదేశాన్ని నిర్మించుకొనేందుకు ప్రతి ఒక్కరూ నిస్వార్థంగా కంకణాబద్ధులై పాటుపడాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు.

శతాబ్ది ఉత్సవాల సందర్భంగా ప్రచురించిన హండ్రెడ్ గ్లోరియస్ ఇయర్స్ ఆఫ్ కాంగ్రెస్ అనే గ్రంథాన్ని క్లుప్తంగా రాసిన ముందు మాటలో వారిలా ని ఈ విజ్ఞప్తిచేశారు. ప్రముఖ పార్లమెంటేరియను, కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీ పార్టీ మాజీ ఉప నాయకుడు డాక్టర్ రఫీక్ జకారియా సంపాదకత్వంలో ఈ గ్రంథాన్ని వెలువరించారు. అలనాటి నాయకుల నేతృత్వంలో కాంగ్రెస్ ఎన్నెన్నో ఘన విజయా లను, సాధించిందని మనం సగర్వంగా చెప్పుకొంటున్నామని, భావితరాల వారు కూడా ఇదేవిధంగా గర్వించాలంటే ప్రతిఒక్కరూ చిత్తశుద్ధితో తమ వంతు కర్త వ్యాన్ని నిర్వర్తించాలని శ్రీరాజీవ్ ప్రజలకు సూచించారు.

దేశానికి స్వాతంత్ర్యం తెచ్చి, ఆధునాతన ప్రజాస్వామ్య వ్యవస్థకు పునాదులు వేసిన పార్టీలో ఉండటం మన అందరికి గర్వకారణం. పూర్తి చేయవలసిన వాగ్దా నాలు, సాధించవలసిన లక్ష్యాలు ఇంకా అనేకం ఉన్నాయని ఆయన పేర్కొన్నారు. మహోన్నతులైన అలనాటి నాయకులు ముందుతరాల వారికి ఎంతో ధైర్యాన్ని ఇచ్చారు. వారిబాటలో పురోగమిద్దాం అన్నారు శ్రీరాజీవ్‌గాంధీ.

కాంగ్రెస్ శతాబ్ది ఉత్సవ కమిటీ ఈ గ్రంథాన్ని ప్రచురించింది. ఏడు విభా గాలతో అధ్యాయపరంగా కాంగ్రెస్ చరిత్రను వివరించారు. శ్రీజి.ఆర్.నందా, శ్రీనిఖిల్ చక్రవర్తి, శ్రీగిరిలాల్‌జైన్, శ్రీఖుశ్వంత్‌సింగ్ డాక్టర్ ముల్క్‌రాజ్ ఆనంద్, శ్రీఆర్.కె.కరంజియా తదితర ప్రాత్రికేయులు. సంపాదకుల వ్యాసాలు ఇందులో ఉన్నాయి. కేంద్ర ఇంధనశాఖ మంత్రి శ్రీవసంతసాఠే కాంగ్రెస్-ఐ ఆవిర్భావాన్ని వివరిస్తూ ఒక వ్యాసం సమర్పించారు. కాంగ్రెస్ 1968 లో చీలిపోయినపుడు కీలక పాత్ర వహించినవారిలో ఆయన ఒక్కరు.

కాంగ్రెస్ చరిత్రను దశలవారిగా వివరిస్తూ, ప్రముఖ చిత్రకారుడు శ్రీఎమ్. ఎఫ్.హుసేన్ వేసిన రెండు చిత్రాలను ఈ గ్రంథంలో పొందుపరిచారు.

**ఐక్యమత్యం, క్రమశిక్షణ - రాజీవ్‌పిలుపు**

దేశాన్ని పటిష్టవంతం, సువ్యవస్థితం చేసేందుకు ప్రజలు ఐకమత్యాన్ని, క్రమశిక్షణను పెంపొందించాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ కోరారు.

రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా ఎన్.సి.సి. వారు నాలుగువారాలపాటు జరిపిన శిబిరం ముగింపుగా పేటా జరిపినట్లే ప్రధానమంత్రి ర్యాలీని, జరిపారు.

ఎన్.సి.సి. కేడెట్ల నుద్దేశించి ప్రసంగిస్తూ సమైక్యత-క్రమశిక్షణ అనే ఎన్.సి.సి, లక్ష్యము దేశలక్ష్యం కావాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ప్రకటించారు. విన్యాసాలు, ప్రదర్శనలు జరిపినందుకు కేడెట్లను అభినందిస్తూ, యింకా ఎక్కువమంది ఎన్.సి.సి. పాల్గొనేందుకు వీలుగా ఎన్.సి.సి, ని పటిష్టంచేసేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందని ఆయన హామి యిచ్చారు. కేడెట్ల విన్యాసాలు, ప్రదర్శనలలో దేశ ఐక్యత బాగా ప్రతిబింబించిందన్నారు. దేశంలోని అన్ని ప్రాంతాలనుండి కేడెట్లు రావడాన్ని ఆయన ప్రశంసిం చారు.

శ్రీరాజీవ్‌గాంధీ అంతకు ముందు ప్రతిష్టాకరమైన ప్రధాని ఇంటర్ డైరెక్టరేట్ చాంపియన్‌షిప్ బ్యానర్‌ను మహారాష్ట్ర డైరెక్టరేట్‌కు ప్రదానంచేశారు. రెండవ బహుమతిని కర్ణాటక, గోవా డైరెక్టరేట్ గెలుచుకుంది. మూడవ బహుమతి తమిళనాడు, పాండిచ్చేరి డైరెక్టర్‌కు పోయింది.

ఎన్.సి.సి. బాలబాలికలు శిక్షణానంతరం దేశసమైక్యతకు, పటిష్టతకు కృషి చేస్తారనే ఆశాభావాన్ని శ్రీరాజీవ్‌గాంధీ వెల్లడించారు. ఎన్.సి.సి. ర్యాలీ చూసేందుకు గారిసన్ పరేడు మైదానానికి రావడానికి ముందు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ఎన్.సి.సి. శిబిరాలను చూచారు. ఈ శిబిరాలలో 1700 మంది ఉన్నారు. వీరిలో 580 మంది బాలికలు 9 దేశాలనుండి వచ్చిన 32 కేడెట్లుకూడా ఈ శిబిరాలలో పాల్గొన్నారు.

శ్రీరాజీవ్‌గాంధీ వెంట టాపులేని జీపులో శ్రీమతి సోనియాగాంధీ కూడా వచ్చారు. రక్షణమంత్రి శ్రీపి.వి.నరసింహారావు త్రివిధ బలాధిపతులు ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీకి స్వాగతం పలికారు.

ప్రధాని ఎన్.సి.సి. వారి వందనాన్ని స్వీకరించారు.

## మరోదేశంముందు తలవంచం రాజీవ్‌గాంధీ

భారతదేశం, ఎంతటి శక్తివంతమైన దేశం ముందైనా తలవంచే ప్రసక్తి లేదనీ, దేశ ప్రతిష్టను నిలబెట్టేందుకు, ఎంతటి త్యాగానికైనా వెనుదీసేది లేదని ప్రధాని రాజీవ్‌గాంధీ స్పష్టంచేశారు. పంజాబ్ తీవ్రవాదులను బలహీన పరచడంలో ప్రభుత్వం సఫలంకాగలదన్న ఆశాభావాన్ని ప్రధాని రాజీవ్ వ్యక్తంచేశారు, తమ

ప్రభుత్వం తీవ్రవాదులను అణచివేయగలదని, సైనిక కమాండర్ల ద్వైవార్షిక సదస్సులో మాట్లాడుతూ అన్నారు.

## అప్రమత్తత నేటి అవసరం

భరత్‌పూర్: దేశంలో అస్థిరత్వం సృష్టించేందుకు ప్రయత్నిస్తున్న శక్తులపట్ల అప్రమత్తంగా ఉండాల్సిదని రాజీవ్‌గాంధీ దేశ ప్రజలకు పిలుపునిచ్చారు. దేశ సమైక్యతను పటిష్టంచేయాల్సిన సమయం అసన్నమైందని, దేశవిద్రోహ శక్తులు పన్నుతున్న కుట్రలను భగ్నం చేయాలని భరత్‌పూర్‌కు 50 కిలోమీటర్ల దూరంలోని ఒక గ్రామంలో జరిగిన బహిరంగసభలో మాట్లాడుతూ ఆయన అన్నారు.

దేశ సర్వతోముఖాభివృద్ధికి, శాంతి సామరస్యాలు తప్పనిసరని ఆయన పేర్కొన్నారు. ప్రధాని పరిసరగ్రామాలను పర్యటించి ప్రజల కష్టాలను సమస్యలను సహనంగా విన్నారు. గ్రామీణ ప్రజానీకానికి రుణాలు సులువుగా అందించేందుకు చర్యలు తీసుకున్నట్లు ఆయన చెప్పారు.

తమ ప్రభుత్వము దారిద్ర్యనిర్మూలన, నిరుపేదలకు ప్రయోజనకరంగా ఉండే తమ అనేక కొత్త పథకాలను రూపొందించుటయే ప్రభుత్వ ప్రధాన లక్ష్యమని శ్రీరాజీవ్‌గాంధీ తెలిపారు. ఆహారధాన్యాల అధికోత్పత్తికి అధునిక శాస్త్రసాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించాలని, అందుకు తమ ప్రభుత్వం ప్రోత్సహిస్తుందని ఆయన చెప్పారు. కరువు నివారణ చర్యల నిమిత్తం ప్రభుత్వం ఏడవ ప్రణాళికలో వెయ్యికోట్లు మంజూరు చేసిందని ఆయన చెప్పారు. నూతన విద్యావిధానం వృత్తి విద్యకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చిందని. మహిళలకు, బలహీనవర్గాలకు, మైనారిటీలకు చదువు విషయంలో సమానావకాశాలు కల్పించామని ఆయన తెలిపారు.

## ప్రతిపక్షాలపై చిన్నచూపులేదు

పార్లమెంటులో ప్రతిపక్షపార్టీలు సంఖ్యాబలంలో చిన్నవయినప్పటికి ప్రభుత్వం వాటిని అలక్ష్యం చేయడంలేదని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. ఫిరాయింపుల నిషేధం బిల్లుపై కొన్ని ప్రతిపక్షపార్టీల వైఖరికి సంబంధించి రాజ్యసభలో ప్రధాని చేసిన వ్యాఖ్యలను ప్రస్తావించి బి.జె.పి. పార్లమెంటరీ పార్టీ నాయకుడు శ్రీఎల్.కె.అద్వాని రాసినలేఖకు సమాధానమిస్తూ ఆయన ఈ విధంగా అన్నారు.

పార్లమెంటులో ప్రతిపక్షాల సంఖ్యాబలంతో నిమిత్తంలేకుండా ప్రభుత్వం పార్టీలను వరిగణనలోకి తీసుకొంటుందని శ్రీరాజీవ్ అన్నారు.

ఫిరాయింపుల నిషేధబిల్లులో ఓ నిర్దిష్టమైన క్లాజుకు సంబంధించి ప్రతిపక్ష పార్టీలు వ్యక్తం చేసిన భిన్నాభిప్రాయాలపై ప్రభుత్వం ఓ నిర్ణయం తీసుకుంటుం దని తాను రాజ్యసభలో అన్నానని శ్రీరాజీవ్ తమ సమాధానంలో తెలిపారు. ఒక సభ్యుడు శాసనసభ బయట ప్రవర్తనకు, సంబంధించి పార్టీచర్య తీసుకున్నా అతడు పార్లమెంటులేదా అసెంబ్లీ సభ్యత్వం కోల్పోవలసి వుంటుందన్న క్లాజును ఫిరాయింపుల నిషేధబిల్లులో చేర్చడానికే ప్రతిపక్షాల ప్రతినిధులు సుముఖంగా వున్నారని ప్రభుత్వ అంచనాలవల్ల తెలుస్తోందని ప్రధాని చెప్పారు.

## కారంచేడు బాధితులకు ప్రధాని నిధినుండి 75 వేలు

ప్రధాని సహాయ కార్యక్రమాలు నిధినుండి కారంచేడు బాధితులను 75 వేల రూపాయలను శ్రీ రాజీవ్‌గాంధీ మంజూరు చేశారు. రాష్ట్ర విధానసభలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ ఎం. బాగారెడ్డి ఈ విషయం చెప్పారు. కారంచేడులో భూస్వాముల దురంహంకారానికి బలైన హరిజన కుటుంబాలను అదుకోడానికి సహాయం అందించ వలసిందిగా ప్రధానికి రాశానని ఫలితంగా ఈ మొత్తం ప్రధాని మంజూరు చేసారని శ్రీ బాగారెడ్డి చెప్పారు.

చెక్కును ప్రకాశం జిల్లా కలెక్టర్‌కు పంపారు. ఇందులోంచి మృతుల కుటుం బాలకు ఐదేసి వేలు, గాయపడ్డవారికి రెండేసి వేల రూపాయల సహాయం అందిం చారు.

## సర్వీసు కమీషన్ల పనితీరు మెరుగుదలకు ప్రధాని సూచనలు

పబ్లిక్ సర్వీసు కమీషన్ల పనితీరును మెరుగు పర్చేందుకు అయిదు సూత్రా లతో కూడిన ఒక కార్యచరణ కార్యక్రమాన్ని ప్రధాని రాజీవ్‌గాంధీ సూచించారు ఆయన ముఖ్యమంత్రులకు రాసిన లేఖలలో, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌కు కేంద్రం అధికారులు ఇచ్చినట్లుగానే, రాష్ట్రాల పబ్లిక్ సర్వీస్ కమీషన్లకు కూడా తగిన రీతిలో ఆర్థిక, పరిపాలన పరమైన అధికారులను ప్రధానం చేయాలని సూచిం చాప. సర్వీసు కమీషన్లలోని ప్రతిశాఖలోను సమర్థులైన నీతికి కట్టుబడి ఉండే అధి

కారులు పనిచేసేలా చూడాలని ముఖ్యమంత్రులకు ప్రధానమంత్రి సలహా ఇచ్చారు. కమీషన్ల విధినిర్వహణలో కంప్యూటర్ల వ్యవస్థలాంటి అత్యంతాధునిక పద్ధతులను ప్రవేశపెట్టాలని రాజీవ్‌గాంధీ సూచించారు. ప్రతిశాఖలోను ఏ ఏ ఉద్యోగాలకు ఎన్నెన్ని ఖాళీలు ఉన్నాయో ముందుగానే ఖచ్చితంగా తెలుసుకొని, దానికి తగ్గట్టుగానే అభ్యర్థులకు పరీక్షలను నిర్వహించాలనీ, మాటిమాటికి సర్వీసు కమీషన్లను అనుబంధ జాబితాల నడిగే పద్ధతికి రాష్ట్ర ప్రభుత్వాలు స్వస్తి చెప్పాలని ప్రధాని రాజీవ్‌గాంధీ సూచించారు.

## వృద్ధురాలి ఔదార్యం

బిర్లాపూర్ :- భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ, పశ్చిమబెంగాల్‌లోని 24 పరగణాల జిల్లాలో ఎన్నికల ప్రచారానికి వెళ్ళినపుడు 97 సంవత్సరాల వృద్ధురాలు ఆయనకు ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించడానికి వచ్చింది. ఆయన సెక్యూరిటీ సిబ్బందిని పక్కకు నెట్టి ముందుకు నడిచివెళ్ళి ఆమె సమర్పించిన విజ్ఞాపన పత్రాన్ని అందుకున్నారు. ఆమె అతని మడులు, మాన్యాలు కోరలేదు. తనకు ఐదు బిగాల పొలం ఉందని, దాన్ని ప్రభుత్వానికి ఇస్తున్నానని, అందులోనుంచి అనుపతి నొక్కదాన్ని కట్టించమని కోరుతూ ఆమె శ్రీ రాజీవ్‌కు విజ్ఞాపన పత్రాన్ని అందజేసింది. చక్రాలకుర్చీలో ఆమెను తీసుకొచ్చారు. ప్రభుత్వం తగుచర్యలు తీసుకుంటుందని శ్రీ రాజీవ్ ఆమెకు హామీ ఇచ్చారు. ఆ భూమికి సంబంధించిన పత్రాలను కూడా ఆవిడ ప్రధానికి అందజేసింది.

# కాంగ్రెస్ ఉత్సవాలు

**బొంబాయి:-**

వందేళ్ళ చరిత్రగల భారత జాతీయ కాంగ్రెస్ శతాబ్ది ఉత్సవాలు డిసెంబరు 27 వ తేది (1985) నుండి మూడు రోజులపాటు భారీ ఎత్తున జరిగినవి. ఈ సందర్భంగా నృత్యాలు, దేశ భక్తిగీతాలు, సంగీత పోటీలు, తదితర సాంస్కృతిక కార్యక్రమా లెన్నింటినో ఏర్పాటుచేశారు.



శతాబ్ది ఉత్సవాల సాంస్కృతిక వ్యవహారాల కమిటీ చైర్మన్, పార్లమెంటు సభ్యుడు శ్రీ సునీల్‌దత్ పత్రికా విలేఖరులకు సాంస్కృతిక కార్యక్రమాలను వివరిస్తూ, జాతి చరిత్రలో ముఖ్యమైన ఘట్టాలతో కూడిన నృత్యనాటిక ప్రధాన ఆకర్షణ అని తెలిపారు ప్రముఖ నృత్య కళాకారిణి సినీనటి వైజయంతిమాల బృందం ఈ నృత్యనాటికను సమర్పించింది. మహేంద్రకపూర్, నితిన్‌ముఖేశ్ లాంటి ప్రముఖ గాయనీగాయకులు సుప్రసిద్ధ సంగీత దర్శకులు కళ్యాణ్‌జీ, ఆనంద్‌జీ, సోనిక్‌ఓమి, రవీంద్రజైన్ దర్శకత్వంలో దేశభక్తి గీతాలు ఆలాపించారు.



వేలాది మంది పాఠశాల విద్యార్థిని విద్యార్థులు ప్రముఖ సంగీత దర్శకులు స్వరకల్పన చేసిన వివిధ భాషల దేశభక్తి గీతాలను ఆలపించారు. చిన్నారి, పొన్నారి బాలలు ఈ శతాబ్ది ఉత్సవాలకు హాజరయిన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ, శ్రీమతి సోనియాగాంధీపై పూలవర్షం కురిపించారు. ప్రముఖ నటులు, కళాకారులు స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన అంశాలను నటన, మూకాభినయం ద్వారా ప్రదర్శిస్తూ ఆయాకార్యక్రమాలను చిత్రించారు. ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ వియత్నాం, జపాన్‌లో జరిపిన పర్యటన ఆయాదేశాలతో ఇండియా సంబంధాల పటిష్ఠతకే కాకుండా యావత్ ఆసియా ఖండమంతటా శాంతి సౌభాగ్యాలు వెల్లివిరిసేందుకు దోహదమయింది. భారత, జపాను, ప్రధానులు ద్వైపాక్షిక సంబంధాలతో పాటు, అంతర్జాతీయ సమస్యలపై పరస్పర అభిప్రాయాలను వెల్లడించుకొన్నారు. ఆర్థిక,

వాణిజ్య, శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో భారత్ జపాన్ దేశాలమధ్య సహాయ సహకారాలు మరింతగా పెరగాలని ప్రధాని శ్రీ రాజీవ్ ఉద్ఘాటించారు, సాంస్కృతిక, విద్యా వైజ్ఞానిక రంగాలలో ఉభయ దేశాల ప్రజలమధ్య సంబంధాలు ఎంతో మెరుగైనాయని ఆయన చెప్పారు. 1987-88 లో జపాన్‌లో భారతీయ ఉత్సవాలు, ఇండియాలో జపాన్ ఉత్సవాలు నిర్వహించేందుకు ఉభయ దేశాలు నిర్ణయించాయి. శ్రీ రాజీవ్‌గాంధీ వెంట శ్రీమతి సోనియాగాంధీ మార్చి (1985) 27 న హనోయి, 28 న టోక్యో, 30 న క్యోటోలో అధికార పర్యటన జరిపారు. శ్రీ రాజీవ్‌గాంధీ వియత్నాం కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి లీడ్యూన్, 'వియత్నాం' ప్రధాని ఫాంవాన్ దంగ్ తో స్నేహ సౌహార్ద్రపూరిత వాతావరణంలో చర్చలు జరిపారని, ఉభయ దేశాల నేతలు అనేక అంతార్జాతీయ ప్రధాన సమస్యలపై ఏకాభిప్రాయాలను వ్యక్తంచేశారు కంపూచియా సమస్యపై సత్వరరాజకీయ పరిష్కారాన్ని ఆశిస్తున్నట్టు వియత్నాం నాయకులు పునరుద్ఘాటించారు. తగిన రాజకీయ పరిష్కారం కుదిరిన వెంటనే 1990 నాటికి లేదా అంతకుముందుగానే వియత్నాం దళాలను కంపూచియా నుండి ఉపసంహరించుకోగలమని తెలిపారు. ఉభయ దేశాల మధ్యగల సన్నిహిత సంబంధాలను మరింత విస్తృతం చేసుకొని కలకాలం కొనసాగించుకోవాలని భారత్, వియత్నాం నేతలు ఆకాంక్ష వ్యక్తంచేసుకున్నారు.

## ముస్లింలకు రాజీవ్ హామీ

ముస్లిం మతచట్టంలో తమ ప్రభుత్వం ఎలాంటి మార్పులు చేయబోదని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ముస్లింలకు హామీ ఇచ్చారు. ముస్లిం మతచట్టంలో మార్పులు చేసే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని భారత మోమిన్ సదస్సులో ప్రసంగిస్తూ ప్రధాని స్పష్టంచేశారు. అన్నివేళలా మైనారిటీల ప్రయోజనాలను ప్రభుత్వం కాపాడుతూ వస్తున్నదని శ్రీ రాజీవ్‌గాంధీ చెప్పారు. ప్రధాని చేసిన ప్రకటన పట్ల సభలో పాల్గొన్న వేలాదిమంది ముస్లిములు హర్షధ్వానాలు చేశారు.

విడాకులు పొందిన ఒక ముస్లిం వనితకు మనోవర్తి చెల్లించవలసిందిగా ఇటీవల సుప్రీంకోర్టు చెప్పిన తీర్పు వివాదానికి దారితీసింది. ముస్లిం మతచట్టంలో సుప్రీంకోర్టు జోక్యం చేసుకోవడమేనని ముస్లిం మైనారిటీల నుండి నిరసన ధ్వనులు వినిపిస్తున్నాయి. షరియత్‌లో ఎలాంటి జోక్యం చేసుకోవలదనీ, ఇస్లామిక్ శాసనాలలో జోక్యం చేసుకోవడానికి ప్రయత్నించమని ప్రభుత్వం నుండి హామీ పొందడానికి ముస్లిం నాయకులు శాయశక్తులా కృషి చేస్తున్నారు. అవసరమైతే ఆందోళనకు సిద్ధం కాగలమని హెచ్చరించారు. అఖిల భారత ముస్లింసభకు 20 వేలమందికిపైగా ప్రతినిధులు హాజరైనారు. ముస్లిం మైనారిటీలలోని చేతివృత్తి పనివారికి, ఇతరుల అభ్యున్నతికి తీసుకోవలసిన చర్యలను ప్రభుత్వానికి ఈ సభ సిఫార్సు చేసింది.

—o—

# నవభారత నిర్మాణానికి మూలస్తంభాలు

రానున్న శతాబ్దానికి భారతదేశాన్ని సంసిద్ధం చేయాలని ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ కోరిక "21 వ శతాబ్దానికి అనుగుణంగా భారతదేశం పునర్ నిర్మాణం" అనేది అందరూ చర్చిస్తున్న విషయం. విషయం చాలా విస్తృతమైనది. దీన్ని రాజకీయంగా, సామాజికంగా ఆర్థికపరంగా, పలువిధాలుగా విశ్లేషించి చూడాలి. చిన్న వ్యాసంలో ఈ సమస్యను విశ్లేషించడం మెరుపుకాంతిలో హిమాలయాలను పరిశీలించడం వంటిది. భారతదేశం పునర్ నిర్మాణంలో ఏడంశాలు మూల స్తంభాలుగా పని చేస్తాయని నా అభిప్రాయం.

## 1) జాతీయభావము:-

ఈ ఏడు మూల స్తంభాలలో మొదటిది జాతీయభావం. మనకు స్వాతంత్ర్యం వచ్చి 40 ఏళ్ళయినా, మనదొక జాతి అనే భావం వేరనుకోలేదు. మనలో లక్షలమంది తమిళులున్నారు. మరికొన్ని లక్షలమంది మహారాష్ట్రులు ఉన్నారు. బెంగాలీలు ఇంకా కొన్ని లక్షలున్నారు. కాని భారతీయులు అనదగ్గవారే చాలా తక్కువ. ప్రాంతీయ విధేయతలు, మతసంకుచిత భావాలు రాజ్యమేలుతున్నాయి. ఇవి చాలా పెరిగిపోతే జాతి విచ్ఛిన్నమయ్యే ప్రమాదం ఉంది. భారతదేశానికి బద్ధ శత్రువులు పాకిస్తాన్‌వారో, చైనీయులో అనుకుంటే పొరపాటు. భారతీయులకు భారతీయులే మొదటి శత్రువులు. భారత ప్రజాతంత్ర వ్యవస్థను బయటినుండి ప్రమాదం ఉన్నమాట నిజమే. కాని, అసలు ప్రమాదం లోపలినుంచే ఉంది. ఆనాడు బ్రిటిష్ పాలకులు భారతదేశాన్ని విభజించి పాలిస్తున్నారని అనుకునేవారు. అలాకాదు. "విభజించే పని మనమే చేస్తున్నాము. వీరు పాలిస్తున్నారంతే" ఒక భారతీయ మేధావి చమత్కరించారు. ఇప్పటికీ అదే పరిస్థితి కొనసాగుతుంది.

## 2) శాంతిభద్రతలు:-

ఇక, భవిష్యత్ భారతికి రెండో మూల స్తంభం "శాంతి భద్రతలు" శాంతి భద్రతలను కాపాడటం ఏ ప్రభుత్వానికైనా ప్రాథమిక బాధ్యత దేశంలో పలు

ప్రాంతాలలో శాంతి భద్రతల పరిస్థితి బాగా క్షీణించింది. పార్లమెంటుకు సమర్పించిన లెక్కల ప్రకారం దేశంలో సగటున ప్రతి నాలుగురోజుల కొకసారి, ఏదో ఒక పనిపై సైన్యాన్ని ఉపయోగిస్తున్నారు. సైన్యాన్ని ఇన్ని మార్లు ఇలా ఉపయోగించటంవల్ల, సైనికాధికారుల బుర్రల్లో చేరకూడని భావాలు చేరిపోయే ప్రమాదముంది. క్రమంగా, సైన్యం ప్రమేయం లేకుండా ఆందోళనలను, రక్తపాతాన్ని ఆపలేని పరిస్థితికి చేరుకుంటాం. కాని ఇలా సైన్యాన్ని తరచు బారకాసులనుంచి ప్రజలమధ్యకు తీసుకురావటంవల్ల ప్రజాస్వామ్యం పునాదులకే ముప్పు ఏర్పడుతుంది.

సైన్యాన్ని ఉపయోగించాల్సిన మొత్తంగా నివారించలేం. కాని అలా ఉపయోగించాల్సిన పరిస్థితులు ఏర్పడకుండా చూడటం అసాధ్యంకాదు. పోలీసు బలగాన్ని మరింత సమర్థవంతంగా, నిజాయితీగా రూపొందించాలి. సైన్యం వినియోగాన్ని నివారించడానికి ఇదే సరైన మార్గం. విభజన భావాలు, క్రమశిక్షణరాహిత్యం, సహాయనిరాకరణ వంటి లక్షణాలు చోటు చేసుకున్న ఏ సమాజంలోనైనా, వృత్తి రీత్యా గౌరవమర్యాదలు సంపాదించుకున్న పోలీసు బలగం గొప్ప పాత్ర నిర్వహించ గలుగుతుంది. మనలో విభజనవాదం బాగా పేరుకుపోయింది. ఒక్క భారతీయుడైతే చాలా తెలివైనమనిషిగా ప్రవర్తిస్తాడు. అదే ఇద్దరు భారతీయులు కలిస్తే, ఒక పార్టీ పెట్టేస్తారు. అదే ముగ్గురైతే, రెండు పార్టీలు తయారవుతాయి. మనమధ్య మనం అడ్డగోడలు తయారు చేసుకోవడానికి ఏది దొరికితే దాన్ని వాడుకుంటాం. మతం, భాష, కులం.... ఏదైనాసరే. అలాంటిదేదీ తక్షణం అందుబాటులో లేకపోతే, కొత్తది కల్పించుకుంటాం. క్రమశిక్షణరాహిత్యం మనరక్తంలోనే ఉందా అనిపిస్తుంది. మనం వ్యక్తులమేగాని, సామాజిక బాధ్యతగల పౌరులం కాదనిపిస్తుంది. ప్రభుత్వ ఆస్తుల విషయంలోగాని, చివరకు రోడ్డు నిబంధనలు పాటించే విషయంలోగాని మనం ఎలా ప్రవర్తిస్తుంటామో తెలిసిందేగదా. స్థలంఉన్నసరే, ఫుట్‌పాత్‌లమీద నడవటం. నిశ్శబ్దంఅని రాసిఉన్న బోర్డులు వెలవెల బోతుంటాయి. డ్రైవర్ల చేతులెప్పుడు హారన్‌మీదే ఉంటాయి. మన క్రమశిక్షణరాహిత్యానికి ఇవికొన్ని మచ్చు తునకలు మాత్రమే.

ఇక, సహాయనిరాకరణం. మనవారికి అలవాటయి పోయిన సహజగుణాలలో మరొకటి. శాంతిభద్రతలను కాపాడేవారితో సహకరించటమంటే మనవారికి ఏ మాత్రం నచ్చదు. స్వాతంత్ర్యోద్యమ కాలంలోసరే, ఆనాడు సహాయనిరాకరణం ఒక

మైన ఆయుధంగా ఉపయోగపడింది. కాని, మనకు మనమే సార్వభౌమదేశంగా రూపొందిన తరువాత కూడా ఆ అలవాటు పోలేదు. పన్నులు ఎగ్గొట్టటం వంటి పలు రూపాలలో ఈ లక్షణం నిత్యం దర్శనమిస్తూవే ఉంటుంది.

పోలీసు బలగాన్ని రాజకీయ ప్రాబల్యానికి దూరంగా ఉండాలి. అపుడే, అది నిజాయితిగా, సమర్థంగా పనిచేయగలుగుతుంది. నిజానికి పలురాష్ట్రాలలో పోలీసు బలగానికి వృత్తిపరమైన స్వయం ప్రతిపత్తి కరువై పోయింది. పోలీసులు రాజకీయపరమైన ఆదేశాలకు, ప్రాబల్యానికి, జోక్యానికి తలవంచాల్సివస్తోంది. న్యాయవ్యవస్థ మాదిరిగానే పోలీసుబలగానికి కూడా స్వయం ప్రతిపత్తి కల్పించటం ఒక్కటే దీనికి సరైనమందు.

**కుటుంబనియంత్రణ:-**

భారతదేశం పునర్ నిర్మాణంలో కుటుంబనియంత్రణకు మూడో ప్రాధాన్యం వుంటుంది. ప్రస్తుత వేగంతో జనాభా పెరుగుతూపోతే, దేశం వాస్తవికమైన ప్రగతిని ఎన్నటికి సాధించలేదు. మన జనాభా అరగంటకు వెయ్యిమంది లెక్కన పెరిగి పోతుంది, దేశాని అభివృద్ధిచేయటమే సరయిన 'కుటుంబనియంత్రణ' అని కొందరు అంటారు. నిజమేగాని జనభా ఇలా పెరుగుతూపోతే ఆ అభివృద్ధి ఎప్పటికి సాధ్యం కాదు. ధనవంతతులు మరింత ధనవంతులవుతారు. పేదప్రజలు మరింత పిల్లల్నికని, మరింత పేదరికంలో మగ్గిపోతుంటారు. ఎక్కువమంది పిల్లలుపుడితే, ఎక్కువమంది శ్రామికులు తయారవుతారు కదా? అనుకుంచే ప్రయోజనంలేదు. వాస్తవానికి పెరిగేది శ్రామికులుకాదు, నిరుద్యోగులే. జనభా నియంత్రణకు అధిక ప్రాముఖ్యం ఇవ్వాలి. లేకుంటే పేదగుడిసెలలో ఆకలి చావులసంఖ్య పెరుగుతుందే గాని, తరగదు.

**విద్య:-**

ఇక విద్య, ఇదినాల్గవ మూలస్తంభం. పిల్లలకు పదునాలుగేళ్ళు పూర్తియ్యే వరకు, వారికి నిర్బంధ ఉచితవిద్య సమకూర్చాలి. రాజ్యాంగ ప్రకటన తరువాత పదేళ్ళలోగా ప్రభుత్వం ఈ ఆశయాన్ని పూర్తిచేయాలి. అని మన రాజ్యాంగంలో పొందుపరచుకొన్నాం. పదేళ్ళుకాదు, రాజ్యాంగం అమలులోకివచ్చి ముప్పయి

అయిదేళ్ళయింది. అయినా మన ప్రజల్లో అరవై అరుశాతం ఇప్పటికి నిరక్షరాస్యులుగానే మిగిలి పోయారు. ఫలితంగా ప్రజాస్వామ్యం అర్థరహితవిషయం అయిపోయింది. నిరక్షరాస్యతను ప్రజల అజ్ఞానాన్ని ఆసరాచేసుకుని రాజకీయ నాయకులు పబ్బం గడుపుకోగలుగుతున్నారు. అమెరికా సంస్థాపకుల్లో ఒకరయిన థామస్ జఫర్ సన్ ఇలా అన్నారు. "ఏ జాతిలోను అజ్ఞానం స్వేచ్ఛ కలిసిమెలిసి వుండవు. గతంలో అలాంటి ఉదాహరణలేదు. భవిష్యత్తులోనూ వుండదు." ఒక జాతి సార్వభౌమదేశంగా రూపొందిన మొదటిరోజులలో నాయకులే విద్య మొదలయిన వ్యవస్థలను రూపొందిస్తారు. ఆ తరువాత ఆ వ్యవస్థలనుంచే నాయకులు పుట్టుకొస్తారు. మరి మనదేశానికి రేపటి నాయకులు ఎలా తయారవుతారు? ఇదే ప్రశ్నను మరోవిధంగా వేయవచ్చు. రేపటి నాయకులను రూపొందించే విద్యా వ్యవస్థ ఎక్కడుంది. భవిష్యత్తుతరాన్ని సృష్టించే వ్యవస్థ ఎక్కడుంది. ఇక్కడ విద్యఅంటే చదవటం, వ్రాయడం మాత్రమేకాదు. జంతువులకు కూడా శిక్షణ ఇవ్వవచ్చు. మానవులకు మాత్రమే విద్య గరపలము. సామాజిక పరివర్తనలో వ్యక్తిస్వయంగా పాల్గొనటానికి దోహదంచేసేదే విద్య. మానవచరిత్ర రానురాను విద్యకు, వినాశానికి మధ్య పరుగులపోటీగా తయారవు తుందని హెచ్.జి.వెల్స్ చాలచక్కగా అన్నారు. దీన్ని బట్టి ప్రజలను విద్యావంతులను చేసుకోకుండా మనం సాగించే ప్రయాణం ఎక్కడకు తీసుకెళుతుందో సులభంగా ఊహించవచ్చు.

## 5) రాజ్యాంగ బద్ధత:-

రాజ్యాంగానికి కట్టుబడి ఉండటం అనేది భవిష్యత్ భారతికి నాల్గోమూలస్తంభం. రాజ్యాంగానికి కట్టుబడిఉంపటం, రాజ్యాంగాన్ని మొండిగా సమర్థించటం ఒక్కటేకాదు. పాకిస్తాన్ మతఛాందసవాదాన్ని అనుసరిస్తోంది. మనదేశంలో లౌకికఛాందసవాదం తయారైంది. సూత్రాల అసలు ఉద్దేశాలను గాలికివదిలేసే మాటల్ని పట్టుకొని వేలాడటంలోనే ఛాందసవాదం ఊపిరి పోసుకుంటుంది. ఛాందసవాదం మనకొక వ్యవస్థగా తయారయింది. దీనివల్ల మనజాతిలో సామరస్యం, హుందాతనం అదృశ్యమయ్యాయి: రాష్ట్రాల పరిశ్రమలు మొదలైన విషయాలలో సొంతనిర్ణయాలు తీసుకొనే హక్కునుకేంద్రంతిరస్కరించటం ఈ రాజ్యాంగ ఛాదంసవాదంలో భాగమే. రాష్ట్రాలపై కేంద్రం పెత్తనం చేయటవల్లనే పనులు బాగా జరుగుతాయని,

ప్రజాప్రయోజనాలు నెరవేరతాయని పార్లమెంటు చాలా హేతువిరుద్ధంగా ప్రకటించ గలుగుతుంది నిజమే, రాజ్యాంగ సూత్రాలను మాటల్లో గట్టిగానే పాటిస్తున్నాము. కాని మాటలవెనక అసలు ఉద్దేశాలే గాలికి ఎగిరిపోతున్నాయి. అలాగే కేంద్ర, రాష్ట్రాలలో ప్రభుత్వాలు శాసనసభలతో పనిలేకుండా రాజ్యాంగ విరుద్ధంగా ఆర్డి నెన్సులతో కాలం గడుపుతున్నాయి. శాసనసభ సమావేశంలో లేనప్పుడు, తక్షణం చర్య తీసుకోవలసిన అవసరం ఏర్పడితే ఆర్డినెన్స్‌ని ప్రకటించవచ్చునని రాజ్యాం గం స్పష్టంచేసింది. కాని, ఈ సూత్రాన్ని ఎవరూ పాటించడంలేదు. శాసనసభ రేపు, మాపు సమావేశం కాబోతుండగా అర్డినెన్స్‌లు ప్రకటిస్తున్నారు. శాసనసభలో చర్చకు వచ్చేసరికి అది అప్పటికే అమలు జరుగుతూవుంటుంది, లేదా శాసనసభ సమావేశం అయిపోయిన మరునాడే ప్రకటిస్తారు.

"ప్రోమల్గేషన్ ఆఫ్ ఇండియా అర్డినెన్స్‌స్, ఫ్రాడ్ ఆన్‌ది కాన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇండియా" పేరుతో 1988 లో డాక్టర్ డి.సి. వాద్వా ఒక పుస్తకం ప్రచు రించారు. కేవలం ఒక బీహార్ రాష్ట్రంలోనే 256 ఆర్డినెన్స్‌లను ఒక్కోదాన్ని ఒకటి నుంచి పదునాలుగేళ్ళవరకు అలాగే కొనసాగించారని ఆయన లెక్కలు చేసి చెప్పారు. రాజ్యాంగం అనేది చెక్కుచెదరకుండా కాపాడుకోవలసిన ప్రదర్శనవస్తువుకాదు. రాజకీయనాయకులు అధికారం నిలబెట్టుకోడానికి ఉపయోగపడే పనిముట్టుకూడా కాదు. దేశాన్ని చిరకాలం ఐక్యంగా పరిరక్షించుట కోసమే రాజ్యాంగం తయారయింది అది అందుకోసమే ఉపయోగపడాలి.

**సమానత్వం:-**

ఇక, సమానత్వం సమస్య భారతదేశాన్ని పునర్ నిర్మించే కార్యక్రమంలో సమానతావాదం అనేది అరోమూలసూత్రంగా పనిచేయాలి సారహీనమైన "సోషలి జానికి" ఫలవంతమైన "సమానతావాదా" నికి చాలాతేడా ఉంది. ప్రపంచంలోనే మొదటిసారిగా భారతీయులు తాము సోషలిష్టులమని కాకుండా, సమానతావాదుల మని చెప్పుకోగలగాలి. ప్రభుత్వ యాజమాన్యం, ప్రభుత్వం అదుపువంటివి సైద్ధాంతిక సోషలిజంలో భాగం సమానతావాదంలో పనిచేసే ప్రభుత్వం వీటికోసం కాకుండా, పేద ప్రజలను సముద్ధరించడం కోసం పనిచేయాలి. దానికోసం ఫలవంతమైన విధా నాలను అనుసరించాలి. చక్కగా ఆలోచించి వేసుకున్న ప్రణాళికలతో, మానవ

భౌతిక వనరులను ఉపయోగంలో పెట్టాలి. ఈ వనరులు మొత్తం జాతిజనజీవాలలో ముందడుగు వేయడానికి దోహదం చేయాలి. విశాల ప్రజానీకం జీవన ప్రమాణాలను పెంచాలి. తెలివి, జ్ఞానం, నిజాయితీ అంకితమయి పనిచేసే స్వభావంవంటి లక్షణాలు అభివృద్ధి చెందినపుడే సమానతావాదాన్ని వాస్తవకార్యాచరణలో అమలు చేయగలుగుతాం. ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నప్పుడే దేశం ఆర్థికంగా వేగంగా అభివృద్ధి చెందుతుంది. అర్థశాస్త్రంలో ఇది చాలా ముఖ్యమైన సూత్రం. పశ్చిమ-తూర్పు జర్మనీలు, దక్షిణ-ఉత్తర కొరియాలు దీనికి చక్కని ఉదాహరణ. ఒకేజాతి ప్రజలు రెండురకాల పరిస్థితులలో జీవిస్తున్నారు. ఒక విభాగం స్వేచ్ఛా ఆర్థిక పరిస్థితులలో జీవిస్తూఉంటే, మరో విభాగం ప్రభుత్వం అదుపుక్రింద ఆర్థికజీవితం కొనసాగిస్తున్నారు. దానికి తగ్గట్టుగానే, రెండు విభాగాలమధ్య అభివృద్ధిలో గూడా తేడాలు ఉన్నాయి. ఆర్థిక స్వేచ్ఛ ఉన్న దేశంలో అభివృద్ధి వేగంగా జరిగింది.

## సామాజిక బాధ్యతతో వాణిజ్యం

కనుక, "సామాజిక బాధ్యతతో జరిగే వాణిజ్యం" భారత పునర్ నిర్మాణంలో ఏదో మూలస్తంభంగా పనిచేస్తుందని చెప్పవచ్చు. మనదేశంలో సామాజిక బాధ్యత అనేది కొన్ని వాణిజ్యకుటుంబాలకే పరిమితమైంది. ఇలాంటి చోట సామాజిక ప్రవర్తన ఎలా ఉంటుందో వేరే చెప్పనవసరంలేదు. చాలామంది వ్యాపారులు అక్రమ మార్గాలు అవలంబించడంవల్ల, ప్రజలు మొత్తం వ్యాపారవర్గాన్నే వ్యతిరేకిస్తున్నారు. కొన్ని దేశాలలో వ్యాపారవర్గం నిజాయితీకి పుందాతనానికి పేరుమోసింది. ప్రజల విశ్వాసం చూరగొన్నది. మనదేశంలో వ్యాపారవర్గంకూడా వీటిని ఆదర్శంగా తీసుకోవాలి. పోగొట్టుకున్న ప్రతిష్ఠను తిరిగి సంపాదించాలి.

—నాని పాల్కీవాలా



# ఇప్పుడూ, ఎప్పుడూ మీతోనే ఉంటాం:

అలీన దేశాల మంత్రివర్గ సమన్వయసంఘ సమావేశంలో భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ చేసిన ప్రసంగం పూర్తి పాఠం మీ ముందుంచుతున్నాం.

గౌరవనీయులయిన మంత్రులారా ప్రతినిధి వర్గాల అధ్యక్షులారా, సోదరి సోదరీమణులారా.

నమీబియా యెడల తను సంఘీభావం తెలిపే ఏకైక లక్ష్యంతో ఈ రోజు వందదేశాల ప్రతినిధులు హాజరయ్యారు. సాహసోపేతమైన నమీబియా స్వాతంత్ర్యం కోసం ఎదురు చూస్తోంది. స్వాతంత్ర్య నినాదం మనకు స్ఫూర్తినిచ్చి మనల్ని మరింత ఉన్నతులుగా మారుస్తుంది. ఆమహత్తర లక్ష్యం మనల్ని ఇక్కడ సమావేశపరిచింది. మీకు ఆతిథ్యమిస్తున్నందుకు భారతదేశ ప్రజలు గర్విస్తున్నారు. వారి తరపున మీ అందరికి నా హృదయపూర్వక శుభాకాంక్షలు. స్వాపో అధ్యక్షుల శామ్ నుజోమా ఇప్పుడు మనమధ్య ఉండటం మరింత ఆనందదాయకంగా ఉంది. ఆయనకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

భారతదేశం ఆఫ్రికాకు ఎప్పుడు సన్నిహితంగానే ఉంది. శతాబ్దాలతరబడి మన సముద్ర తీరాలలో ఓడలు తిరుగాడినాయి. అవి రెండు ఖండాలమధ్య వాణిజ్య, సాంస్కృతిక సంబంధాల పెరుగుదలకు దోహదం చేశాయి.

**మనరెండు ఖండాలకు వలసవాదం శాపంగా పరిణమించింది, అది మనల్ని రాజకీయంగా ఐక్యంచేసింది. ఈ సంబంధానికి మహాత్మాగాంధీ చిహ్నంగా నిలిచారు.**

ఆయన తన అహింస అనే అమూల్యమైన పోరాట ఆయుధాన్ని దక్షిణాఫ్రికాలోనే సానపట్టారు.

1955 లో బాండుంగ్‌లో జరిగిన ఆఫ్రో ఆసియా దేశాల మహాసభ ముప్పయ్యవ వార్షికోత్సవం త్వరలో జరగబోతోంది. ముప్పయి ఏళ్ళనాడు జవహ

గ్గాల్ నెహూ్రి అన్న మాటలు నా చెవుల్లో ఈనాటికి వినిపిస్తున్నాయి. "గత వందే ళ్ళలో ఆఫ్రికా అనుభవించిన దానికంటే విషాదకరమైన దేదిలేదు" అని ఆయన పేర్కొన్నారు.

ఈ విషాదం ఇంకా కొనసాగుతూనే ఉంది. బాండుంగ్ మహాసభ తర్వాత ఆఫ్రికాలో ఒక దేశం తర్వాత మరోదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సమపార్జించుకొన్నాయి. అయినా పాశవికమైన ఆర్థిక దోపిడి ఇంకా కొనసాగుతూనే ఉంది. మానవ ఆత్మను తరతరాలుగా అణచివుంచిన ఆనవాలు ఇంకా కనిపిస్తూనే ఉంది. ఇవ్వాళ ఆఫ్రికాను పీడిస్తున్న బాధలు కేవలం దయలేని వాతావరణంవల్ల తల్లెత్తినవి కావు. ప్రభుత్వాల వైఫల్యం అంతకంటే కాదు. ఈనాటి ఆఫ్రికా బాధలకు మూలం దాని వందేళ్ళ వలస శృంఖలాల్లో ఉంది. కొత్తగా స్వాతంత్ర్యం పొందినదేశాలు ఆర్థికంగా బలవంతం కాకుండా ధనికదేశాలు అడ్డుకొంటున్నాయి. వలస వాదదోపిడీ దృష్టి ఇంకా అంతంకాలేదు. వ్యూహాత్మక వనరులను దోచుకోడానికి ఇప్పుడు మరింత తీవ్రంగా వారు, ప్రయత్నిస్తున్నారు. దానితోపాటు నమీబియా, దక్షిణాఫ్రికాలో వలసవాదం, వర్ణవివక్షత. ప్రత్యక్షంగా, వర్తిస్తూన్నాయి. ఆలీన ఉద్యమంలో ఉన్న మనమందరం వలసవాదానికి వ్యతిరేకంగా మన ఉద్యమాన్ని కొనసాగిద్దాము. సామ్రాజ్యవాదం నమీబియాపై తన విషపు దృష్టిని సారించి వందేళ్ళుకూడా కాలేదు.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత దక్షిణాఫ్రికా నైరుతి ఆఫ్రికాను కబళించి తన ఐదో రాష్ట్రంగా మల్చుకోటానికి ప్రయత్నించింది. నమీబియాలో దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వము ఒడిగట్టిన దారుణాలు ఎవరికైనా అర్థమౌతాయి. అది నమీబియాను ఆక్రమించుకొని 70 ఏళ్ళు కావస్తోంది. అనాటినుండి సిగ్గులేని వంచనకు, చట్టరాహిత్యానికి పాల్పడింది. దాని చర్యలను మొదటి లీగ్ ఆఫ్ నేషన్స్ ఖండించింది. తర్వాత ఐక్యరాజ్యసమితి దాని చర్యలను ఎన్నోసార్లు బట్టబయలు చేసింది. ప్రపంచ ప్రజల అభీష్టాన్ని ఉల్లంఘించి నమీబియాను సైనికీ కరించింది. ఇప్పుడు నమీబియాలో దక్షిణాఫ్రికా సైనికీకరణ శిఖరాగ్ర దశకి చేరుకొంది. అక్కడున్న ప్రతి డజను మంది పౌరులకీ ఒక సైనికుడున్నాడు. బహుశా వలసవాద చరిత్రలోనే ఇదిరికార్డు కావచ్చు. ఈ సైనిక బలంతో నమీబియా ప్రజలను భయభ్రాంతులనుచేసి వారు

స్వాపోకు ఇవ్వకుండా చూడాలని దక్షిణాఫ్రికా భావిస్తోంది. అంతేగాక అది ఈ బలంతో పక్క దేశాలను కూడా చూస్తోంది.

ప్రపంచ ప్రజాభీష్టాన్ని ఒక మైనారిటి ప్రభుత్వం ఇంతకాలం ఎలా ఉల్లంఘించ గలిగింది? ఇతరులు దానికి కావలసిన మద్దతు ఇస్తున్నారు. గనకనే అదిసాధ్యమైంది. ఒకవైపున జాతులమధ్య సమానతని బోధిస్తునే రెండోవైపున దక్షిణాఫ్రికాకు మద్దతిస్తున్న దేశాలున్నాయి. రాజకీయ, ఆర్థిక, సైనిక, అణ్వాయుధరంగాల్లో ఆ దేశాలు దానికి మద్దతు ఇస్తున్నాయి. కనుకనే దాని దురాక్రమణ తత్వం నానాటికి పెచ్చు పెరుగుతుంది. ఐక్యరాజ్యసమితి అనేకసార్లు దక్షిణాఫ్రికాను బహిష్కరించాలని కోరింది. ప్రతిసారి దాని ఆకాంక్షలు వృధా అవుతూవచ్చాయి. వాస్తవిక నిర్మాణాత్మక దృక్పథాన్ని అనుసరించాలని వారు మనకు సలహా చెపుతూవచ్చారు.

దక్షిణాఫ్రికాలోను, నమీబియాలోను బహుళజాతి సంస్థలు ఎందుకు పాల్గొనాలి. అని మనం అడిగితే అవి ఆదేశాలలోని నల్లజాతి ప్రజలకు మేలుచేయడానికే అన్నట్లు వారు సమాధానం చెపుతున్నారు.

నిజానికి వారినుండి ఆఫ్రికన్లకు లభిస్తోంది బుల్లెట్లు, బూటుమడమలు మాత్రమే.

యుటెనేజ్‌లో అమాయక ప్రజలపై సాగిన హత్యాకాండ ఇంకా కొనసాగుతున్న వర్ణ వివక్షతకు మరో ఉదాహరణ మాత్రమే.

కొద్దికాలం క్రితం నమీబియా స్వాతంత్ర్యం ఖాయం అనిపించింది. ఈ రోజు అది మళ్ళీ మొదటికొచ్చింది. రాజకీయ జూదానికి, బహుళజాతి కంపెనీల లాభాలకు అది బలైపోయింది ఈ క్రమంలో నమీబియా స్వాతంత్ర్యానికి హామీ ఇచ్చిన భద్రతామండలి ప్రతిష్టకే భంగం వాటిల్లుతోంది. అన్యాయం జరిగిన ప్రజలకు అది మద్దతిస్తుందా లేదా అనే ప్రశ్న ముందుకొచ్చింది. ఆ రకంగా ఇది ఐక్యరాజ్యసమితికే సవాలుగా పరిణమించింది. తన నలభయ్యవ ఏట ఐక్యరాజ్యసమితి తన నైతిక రాజకీయ బాధ్యతలను నిర్వహిస్తుందా లేక పశుబలానిదే రాజ్యమవుతుందా?

నమీబియా స్వాతంత్ర్యం విషయంలో ఐక్యరాజ్య సమితికున్న బాధ్యతను మరోసారి నొక్కి చెప్పాలి. ఐక్యరాజ్యసమితి పాత్రను పూర్వరంగంలోకి నెట్టివేయ డానికి దక్షిణాఫ్రికా చేస్తున్న కుటిల యత్నాలను ప్రతిఘటించాలి. నమీబియా స్వాతంత్ర్యము అనేది ఐక్యరాజ్య సమితి ప్రత్యక్ష బాధ్యత అని అలీనదేశాల సమా వేశం నొక్కి చెపుతోంది.

435 వ తీర్మానం (1978) అమలుకు భద్రతా సంఘం కొత్తమార్గాలను అన్వేషించాలి. నమీబియా సమస్యకు శాంతియుత పరిష్కారం జరగటానికి ఆ తీర్మానం ఒక్కటే ఆమోదయోగ్యమైన ప్రాతిపదిక. ఐక్యరాజ్య సమితిని కాదని నకిలీ ఒప్పందాలకోసం జరిగే ప్రయత్నాలన్నింటిని మేం వ్యతిరేకిస్తాం.

25 ఏళ్ళ స్వాపో చరిత్ర నమీబియా ప్రజల పోరాటాల చరిత్ర. స్వాపో పీరుల ఏకాగ్రతకు వారి ధైర్య సాహసాలకు మేము జేజేలు పలుకుతున్నాం. ఉత్తేజా న్నిచ్చే నుజోమా నాయకత్వంలో స్వాపో రాజకీయ, దౌత్యరంగాల్లో తన దూర దృష్టిని, కృతనిశ్చయాన్ని, ప్రదర్శించింది.

సంప్రదింపుల ద్వారా పరిష్కారం సాధించటానికి అనేక విధాల ప్రయత్నిం చింది. దక్షిణాఫ్రికాలోని మైనారిటీ ప్రభుత్వ వైఖరి పూర్తిగా భిన్నంగా వుంది. 'బహుళపార్టీ సంఘటన" తో ఒక "తాత్కాలిక ప్రభుత్వాన్ని" ఏర్పర్చడానికి అది' ప్రయత్నం చేస్తోంది. ఒక కీలుబొమ్మ ప్రభుత్వానికి ఆ రకంగా అది అధికారం చేజిక్కించు కోవాలనుకొంటోంది. దీన్నిమనం ఎట్టి పరిస్థితుల్లోను సాగనివ్వకూడదు.

స్వాపో నమీబియా ప్రజల ఏకైక ప్రతినిధి సంస్థ. దానికి మనం మరింత రాజకీయ ఆర్థిక సహకారం అందించాలి. ఈనాడు మనం స్వాపో 25 వ వార్షికోత్స వాన్ని జరుపుకొంటున్నాము. నమీబియా విముక్తికోసం మనమంతా నిర్దిష్ట వాగ్దానాల ద్వారా స్వాపోకు మన సంఘీ భావాన్ని ప్రదర్శించాల్సి ఉంది. భారత ప్రభుత్వం స్వాపోకు పూర్తిస్థాయి దౌత్యహోదా ప్రదానం చేయడానికి నిర్ణయించుకుందని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాను.

అంతర్జాతీయంగా ఎన్నో ఆందోళనలున్న సమయంలో మన సమావేశం జరుగుతోంది. ఆయుధాల పోటీని నివారించచటానికి అగ్రరాజ్యాల మధ్య సంప్రదిం పులు జరుగుతున్నాయి. ఈ సందర్భంగా వారి ప్రకటనలు ప్రోత్సాహకరంగా

ఉన్నాయి. ఈ పరిణామాలకు స్వాగతం. అయితే ఇవి ఒకడుగు ముందుకు, రెండడుగులు వెనక్కి కారాదు. ఎందుకంటే ప్రతి శాంతివచనం వెనక మరో శాంతికి విఘాతం కల్గించే చర్య యిమిడి ఉంటోంది. ఈ లోగా కొత్తరకాల మారణాయుధాల తయారీకోసం నిరంతరాయంగా పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. జీవితం పేరుతో మృత్యువుని ఆహ్వానించడం జరుగుతోంది, ఈ వినాశకర పరిస్థితులవల్ల మనుగడకే ముప్పు వాటిల్లుతోంది. అందుకే నిరాయుధీకరణ ఈనాడు యింతటి ప్రాధాన్యాన్ని సంతరించుకొంది.

కనుకనే నిరాయుధీకరణకు తోడ్పడే ఏ చర్యనయినా అలీన ఉద్యమం హృదయ పూర్వకంగా బలపరుస్తోంది. ప్రపంచాన్ని జీవించడానికి అనువైన ప్రదేశంగా మార్చాలి. అదే సమయంలో ప్రతి ప్రాంతం శాంతికోసం, ఆత్మ గౌరవం కోసం ఆకాంక్షిస్తోంది. పాలస్తీనా ప్రజల బాధల ఎడల తమ స్వదేశాన్ని సాధించుకోడానికి వారు సాగిస్తున్న పోరాటం ఎడల ఏ అలీనదేశాల సమావేశం మౌనంగా ఉండజాలదు. పాలస్తీనా విమోచన సంస్థకు మరోసారి మన మద్దతు ప్రకటిస్తున్నాము. నైరుతి ఆసియాలోను, ఆగ్నేయాసియాలోను ఎంతో ఉద్రిక్తత ఉంది ఎన్నో ఘర్షణలున్నాయి. మధ్య అమెరికా ప్రజల ప్రశాంతత, స్వాతంత్ర్యం ఎంతో కాలంగా ప్రమాదంలోనే ఉంది.

మధ్య అమెరికా దేశాలు తమ దేశాలలో జోక్యరహితమైన సామాజిక, ఆర్థిక రాజకీయ ప్రగతికోసం చేస్తున్న కృషికి మన మద్దతు ఉంటుందని మరోసారి ప్రకటిస్తున్నాం. క్రమంగా భద్రతా రాహిత్యాన్ని ఎదుర్కొంటున్న ప్రాంతం హిందూ మహాసముద్ర ప్రాంతం. అక్కడే సైనిక పాటవాని కొన్ని శక్తులు పిచ్చెత్తినట్టు పెంచుకొంటూ పోతున్నాయి. హిందూ మహాసముద్రం శాంతిమండలం కావాలి

శాంతిని భగ్నంచేసే ప్రతిది జాతుల స్వాతంత్ర్యాన్ని కబళించే ప్రతిదీ,అంతర్జాతీయ ఆర్థిక సమానతల్ని పెంచే ప్రతిదీ అలీన ఉద్యమానికి ఆందోళన కల్గించే విషయమే. అయితే ఇవ్వాళ మనం తక్షణం దృష్టి సారించాల్సిన సమస్య నమీబియా. దానికి స్వాతంత్ర్యం కావాలి. భూమధ్యరేఖకు దక్షిణాన అలీనదేశాల సమా

వేళం ఒకే ఒకసారి జరిగింది. అది లుకాసాలో, అక్కడ తాను ఆఫ్రికాగుండె చప్పుళ్ళను వినగలుగుతున్నానని ఆ నాడు స్వర్గీయ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి పేర్కొన్నారు. ఇవ్వాళ్ళ నమీబియా, దక్షిణాఫ్రికా ప్రజలగుండె చప్పుళ్ళు ఇక్కడ న్యూఢిల్లీలో మనకు వినిపిస్తున్నాయి. మనం ఇక్కడ ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని రూపొందించాలి. అలీనదేశాల ఉద్యమం వ్యవహార దక్షతగల ఉద్యమం అని నమీబియా ప్రజలు విశ్వసించేలా మనం ప్రవర్తించాలి. "మీరు మాలో ఒకరు- ఇప్పుడూ, ఎప్పుడూ మేము మీతోనే ఉంటాం" అనే సందేశాన్ని నమీబియా, దక్షిణాఫ్రికా సోదర, సోదరీమణులకు పంపటానికి నన్ను అనుమతించాలని కోరుతున్నాను.

ఈ సమావేశాన్ని ప్రారంభిస్తున్నందుకు నాకు సంతోషంగా ఉంది.

---

# విజయవంతమైన శ్రీ రాజీవ్ ఫ్రాన్స్ పర్యటన

ఫ్రాన్స్‌లో ఉన్న అయిదు రోజుల్లోను ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ అందరి కళ్ళనూ ఆకట్టుకొన్నారు. యువకుడిగా స్ఫురద్రూపిగా గాంభీర్యత ఉట్టిపడుతున్న శ్రీ రాజీవ్ రూపమే కాక జాతీయ, అంతర్జాతీయ విషయాల్లో ఆయనకున్న స్పష్టమైన అవగాహనకూడా ఫ్రాన్స్ అధ్యక్షుడు మిట్టరాండ్‌ను ఇతర ప్రముఖులను ఆకర్షితులను చేసింది. ఫ్రాన్సు భారతదేశం ప్రత్యేక సంబంధాలను పటిష్టం చేసుకోవాలనుకుంటుందన్న ఆకాంక్ష శ్రీ రాజీవ్ వెలిబుచ్చిన తీరుతో ఇరుదేశాల మధ్య సహకారానికి కొత్తమార్గాలు తెరిచినట్లయింది.

భారతదేశంలో సంచలనం కలిగించిన విదేశీ గూఢచార కుంభకోణంలో ఫ్రాన్స్ పాత్ర ఉందని బయట పడటంతో భారత ఫ్రాన్స్ సంబంధాలు చెడిపోయినట్లేనని దౌత్య పరిశీలకులు భావించారు. కాని వారిని ఆశ్చర్యములో ముంచేస్తూ శ్రీ రాజీవ్‌గాంధీ ఫ్రాన్స్‌లో ఆ ప్రసక్తే ఎత్తలేదు. ఈ సంఘటనను శ్రీ రాజీవ్ మిట్టరాండ్‌లు మరచిపోయినట్లే కనిపించటంతో ఇరుదేశాల మధ్య సంబంధాల పునరుద్ధరణలో ఆ ప్రసక్తి తీసుకురాకూడదని ఇరువర్గాలు భావించినట్లు అర్థమైంది.

శ్రీ రాజీవ్‌గాంధీకి అంతర్జాతీయ విషయాలపై ఉన్న అవగాహనకు మేమెంతో ఆకర్షితులయాం. ఆయన స్పష్టంగాను, ఖచ్చితంగాను ప్రతివిషయాన్ని చక్కగా తూచితూచి మాట్లాడరని ఒక సీనియర్ ఫ్రెంచి అధికారి వ్యాఖ్యానించారు.

అంతేకాక శ్రీ రాజీవ్ మిట్టరాండ్‌తో మంచి వ్యక్తిగత సంబంధాలను నెలకొలిపారు. ఉన్న అయిదురోజుల్లో ప్రతిరోజు ఆయన మిట్టరాండ్‌ను కలుసుకునే వారు. వారిద్దరి సమావేశాలు అత్యంత విజయవంతమైనట్లు ప్రయోజన కరంగా ఉండినట్లు ఇరుదేశాల అధికారులు భావించారు. శ్రీ రాజీవ్‌గాంధీ ఫ్రాన్స్‌లో అడుగు పెట్టినప్పటి నుంచి, తిరిగివెళ్ళేవరకు మిట్టరాండ్ ఆయనపట్ల వ్యక్తిగత ఆసక్తి చూపించారు.

శ్రీ రాజీవ్‌గాంధీ పర్యటనవల్ల భారతదేశానికి ఫ్రాన్స్ డాల్ఫిన్ హెలికాప్టర్లు, మిరేజ్ యుద్ధ విమానాలు పంపిణీ చేయడంపై కొన్ని ప్రధాన రక్షణ కంట్రాక్టులు

కుతిరే అవకాశం ఏర్పడింది. భారతదేశం ఫ్రాన్స్‌నుంచి కొన్ని ఎయిర్ బస్ విమానాలను కూడా కొనుగోలు చేస్తున్నది. తన చర్చల సందర్భంలో ఇరుదేశాల మధ్య ఏర్పడిన ఎగుమతి, దిగుమతుల అసమతుల్య స్థితిపై శ్రీ రాజీవ్ తన అసంతృప్తిని తెలియజేసినట్లు ఈ విబేధాన్ని తగ్గించడానికి ఫ్రాన్స్ హామీ ఇచ్చినట్లు తెలుస్తున్నది.

ఉత్తర, దక్షిణ దేశాల సమస్యపై ఇరుదేశాల మధ్య ఏకాభిప్రాయం ఏర్పడింది. కొత్త అంతర్జాతీయ ఆర్థిక విధానం ఏర్పడాల్సిన అవసరంపై ఫ్రాన్స్‌కూడా భారతదేశం, ఇతర వర్ధమాన దేశాల అభిప్రాయంతో ఏకీభవించింది. పాకిస్తాన్ అణుబాంబు తయారు చేయడంవల్ల ఏర్పడే ఆయుధపోటీ గురించి శ్రీ రాజీవ్ మిట్టరాండ్ కు వివరించినట్లు అణుబాంబు తయారు చేయడంలో ఫ్రాన్స్ ఎట్టి సహాయం చేయబోదని మిట్టరాండ్ హామీ ఇచ్చినట్లు తెలిసింది.

పారిస్‌లో జరిగిన పత్రికా సమావేశంలో ఇరువురు ప్రసంగించారు. తన అయిదురోజుల సమావేశం విజయవంతమైందని, తన పర్యటనవల్ల ఇరుదేశాల మధ్య కొత్త సంబంధాలు పటిష్టవంతంగా ఏర్పడ్డాయని శ్రీ రాజీవ్ ఆ సమావేశంలో తెలిపారు. తమిదరి మధ్య జరిగిన చర్చలు ఎన్నో విషయాల మధ్య ఏకాభిప్రాయం నెలకొల్పేందుకు తోడ్పడ్డాయని మిట్టరాండ్ శ్రీ రాజీవ్‌లు ఇద్దరు ప్రకటించారు.

ఫ్రాన్స్‌నుంచి హెలికాప్టర్లు ఎయిర్ బస్ విమానాలు కొనటానికి తాను యే ఒప్పందం కుదుర్చుకోలేదని ఆ విషయం చూసుకోవడానికి వేరే అధికారులున్నారని శ్రీ రాజీవ్ ఈ సందర్భంగా తెలిపారు. స్టార్‌వార్స్ విషయమై భారతదేశానికి ఫ్రాన్స్‌కు మధ్య కొన్ని భేదాభిప్రాయాలున్నప్పటికి మౌలికంగా రెండు దేశాలు స్టార్‌వార్స్‌ను వ్యతిరేకిస్తున్నాయని శ్రీ రాజీవ్ తెలిపారు.

అనంతరం మిట్టరాండ్ శ్రీ రాజీవ్‌లు భారత రాయబారి లతీఫ్ అధికార గృహంలో డిన్నర్‌కు హాజరయ్యారు. ఒక రాయబారి గృహంలో ఫ్రాన్స్ అధ్యక్షుడు విందుకు హాజరుకావడం ఇదే మొదటిసారి. మొత్తానికి శ్రీ రాజీవ్‌గాంధీ ఫ్రాన్స్ పర్యటన అత్యంత విజయవంతంగా ముగిసిందని చెప్పవచ్చు.

## భారత రష్యా మైత్రి శాంతికి దోహదకారి :
## (రాజీవ్ పునరుద్ఘాటన)

మాస్కో :- భారత్ - రష్యా మైత్రి ఇరుదేశాల అభివృద్ధికి ప్రయోజనకరంగా రూపుదిద్దుకున్నదని. ప్రపంచం మొత్తంలో ముఖ్యంగా భారత్, రష్యా ప్రాంతములో శాంతి సుస్థిరతలకు అది దోహదకారి అని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ పునరుద్ఘాటించారు. ప్రధానిగా తిరిగి ఎన్నికైన తనను అభినందిస్తూ రష్యా అధ్యక్షుడు చెర్నెంకో. ప్రధాని పంపిన సందేశాలకు ఒక టెలిగ్రాంలో కృతజ్ఞతలు తెలుపుతూ శ్రీ రాజీవ్ పై విధంగా అన్నారు।

ప్రావ్దా దినపత్రిక ఈ టెలిగ్రాంను ప్రచురించింది. రాజకీయ ఆర్థిక శాస్త్ర విజ్ఞానరంగాలలో భారత రష్యాల సంబంధాలు చాలాకాలంగా దృఢపడ్డాయని, సహకారం పెరుగుతున్నదని కూడా శ్రీ రాజీవ్ పేర్కొన్నారు.

## శ్రీ రాజీవ్‌గాంధీ లక్ష్యం స్నేహం

పారిస్ :- అణుబాంబు తయారీకి పూనుకోమని పాకిస్తాన్ హామీ ఇచ్చిన పక్షంలో అణ్వాయుధ వ్యాప్తి నిరోధక ఒప్పందంమీద సంతకం చేసేందుకు ఇండియా సిద్ధంగా వున్నట్లు వచ్చిన వార్తలను ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ఖండించారు. ఒప్పందంమీద సంతకంచేస్తే నష్టపోయేది ఇండియాయేనని తాను స్పష్టంగా చెప్పినట్లు శ్రీ రాజీవ్‌గాంధీ ఒక ఇంటర్వ్యూలో పేర్కొన్నారు. అణ్వాయుధ దేశాల ప్రయోజనాలను పరిరక్షించే ఒప్పందంమీద ఇండియా సంతకం చేసే ప్రసక్తిలేదని ఆయన అన్నారు.

తన ఫ్రాన్స్ పర్యటన ఒప్పందాలమీద సంతకాలు చేసేందుకు ఉద్దేశించింది కాదని ఆయన అన్నారు.

ఫ్రాన్స్‌నుంచి కొనుగోలు చేయనున్న యుద్ధ విమానాలగురించి, ఇతర రక్షణ సామగ్రి గురించి, చెప్పేందుకు ఆయన నిరాకరించారు. తొలి విడత మిరాజ్ - 2000 యుద్ధ విమానాలు ఇండియా చేరకున్నాయని రెండు దేశాలమధ్య స్నేహ సంబంధాలను దృఢతరం చేయడం తన ఫ్రాన్స్ పర్యటన ప్రధాన లక్ష్యమని ఆయనతెలిపారు.

అమెరికా "స్టార్ వార్స్, కార్యక్రమం గురించి ఫ్రాన్స్ నాయకులతో చర్చించినట్లు ఆయన చెప్పారు. దేశాలను ఆయుధగారాలుగా మార్చడాన్ని, రెండు దేశాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయని ఆయన తెలిపారు.

ఒక దేశంలో స్నేహాన్ని పెంపొందించుకునేందుకు, మరో దేశాన్ని దూరం చేసుకోవలసిన అవసరం లేదని, ఫ్రాన్స్‌తో స్నేహం ఇండియాకు ఇతర దేశాలతో వున్న సంబంధాలను దెబ్బ తీసే ప్రసక్తి లేదని ఒక విలేకరి అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆయన చెప్పారు

ద్వైపాక్షిక సంబంధాలమీద, అంతర్జాతీయ సమస్యలమీద ఫ్రాన్స్ నేతలతో జరిపిన చర్చలు సత్ఫలితాలను ఇచ్చినట్లు ఆయన పేర్కొన్నారు.

ఢిల్లీలో ఇండో - ఫ్రెంచ్ సెంటర్ ఏర్పాటు విషయమై కూడా ఒప్పందం కుదిరినట్లు ఆయన తెలిపారు.

## రాజీవ్ ఖండన

పాలస్తీనా విమోచనా సంస్థ :- ప్రధాని కార్యాలయంపై ఇజ్రేల్ జరిపిన దాడిని ప్రధాని రాజీవ్‌గాంధి తీవ్రంగా ఖండించారు. పి.ఎల్.ఓ. అధ్యక్షుడు అరాఫత్‌కు పంపిన సందేశంలో ప్రధాని. పాలస్తీనా ప్రజల పోరాటాలకు విజయం చేకూర్చడానికి అరాఫత్ నిరంతరం ఆరోగ్యంగా ఉండాలని అభిలషించారు. దాడి నుంచి అరాఫత్ తప్పుకున్నందుకు రాజీవ్ సంతోషాన్ని వ్యక్తపరిచారు. కాగా. విదేశీ వ్యవహారాల మంత్రి బలిరాం భగత్ . ఇజ్రేల్ దాడిని దురాక్రమణ, విస్తరణ వాదవిధానాల రూపంగా అభి వర్ణించారు. అలీన ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ, ఇదిశాంతికి భద్రతకు తీవ్రవిఘాతం కలిగిస్తుందని ఆయన పేర్కొన్నారు. తమ సొంత దేశంలో పాలస్తీనియాన్లు ఒక క్రమపద్ధతిలో, హింసాకాండకు గురవుతున్నారని ఆయన అన్నారు. వివిధ రకాల వేధింపులకు లోనవుతున్న సాహసపాలస్తీనా ప్రజలకు అలీనోద్యమం అండదండలు కొనసాగించాల్సి ఉందని ఆయన అన్నారు.

## విశాల పంజాబ్ ప్రతిపాదనకు రాజీవ్ తిరస్కృతి

అమేథి :- పంజాబ్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్‌లతో కలిపి విశాలపంజాబ్‌ను ఏర్పాటు చేయలన్న హర్యానా ముఖ్యమంత్రి శ్రీభజన్‌లాల్ ప్రతిపాదనను

ప్రధాని శ్రీరాజీవ్ గాంధీ తిరస్కరించారు. ఆయన ఒక పత్రికా ప్రతినిధుల సమావేశంలో మాట్లాడుతు పంజాబ్ సమస్య సాధనకై ప్రభుత్వం చేయవల్సినదంతా చేస్తున్నదనీ, అందరితో చర్చలు జరిపి ఒక నిర్ణయానికి వస్తుందనీ. అన్నారు. ఈ సమస్యపై ఏర్పాటు చేసిన క్యాబినెట్ కమిటి సమర్పించే నివేదికకై ఎదురు చూస్తున్నట్లు శ్రీ రాజీవ్ గాంధీ తెలిపారు.

## తెలుగులో మాట్లాడిన రాజీవ్ గాంధీ

వరంగల్ 24 12-1984 :- సుస్థిర ప్రభుత్వాన్ని అందించే సమైక్యత, సమగ్రతలను కాపాడగల శక్తిసామర్థ్యాలు గల పార్టీ కాంగ్రెస్ (ఐ)ఒక్కటేనని ప్రధాన మంత్రి శ్రీరాజీవ్ గాంధీ బ్రహ్మాండమైన బహిరంగ సభలో ప్రసంగిస్తూ స్పష్టం చేశారు. దేశవిచ్ఛిన్నానికి ఇంట బయటా కుట్రలు పన్నుతున్న ప్రస్తుత తరుణములో అప్రమత్తంగా మెలగాలని ప్రజలను ఆయన హెచ్చరించారు. అధికార దాహమే తప్ప తెలుగు దేశం పార్టీకి దాని మిత్రపక్షాలయిన ప్రతిపక్ష పార్టీలకు విశిష్టమైన సిద్ధాంతాలంటూ లేవని శ్రీరాజీవ్ గాంధీ విమర్శించారు.

వరంగల్ సభలో ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ హస్తం గుర్తుకే మీ వోటు వేయాలని తెలుగులోనే అభ్యర్థించినపుడు జనసమూహము నుండి హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. కిలో బియ్యం రెండు రూపాయలకే ఇస్తున్నామని, మధ్యాహ్న భోజన పథకం అమలు పరుస్తున్నామని తెలుగు దేశం ప్రభుత్వము గొప్పలు చెప్పుకుంటున్నదని, అయితే ఆంధ్రప్రదేశ్‌లో ఆ రెండు పథకాలకు కాంగ్రెస్ (ఐ) ప్రభుత్వమే శ్రీకారం చుట్టిందని, వాటిలో కొత్తదనమేదిలేదని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. పండిత జవాహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ హయాంలో శాస్త్ర, సాంకేతిక రంగాలలో దేశం ఎనలేని ప్రగతిని సాధించిందని వాటి అభివృద్ధి ఫలితాలను పేదప్రజల ప్రయోజనార్థం గ్రామీణ ప్రాంతాలకు తీసుకు వెళ్ళడానికి కాంగ్రెస్ ప్రభుత్వం నిర్ణయించిందని ఆయన చెప్పారు.

పాల్కొండ బహిరంగ సభలో ప్రసంగిస్తూ సమైక్యతా భారతావనిని గురించి ఆలోచించాలని ప్రజలకు ఆయన విజ్ఞప్తి చేశారు. చాలా కాలంనుండి వర్ధమాన దేశంగా ఉంటున్నదనీ ఇప్పుడు అభివృద్ధి చెందిన దేశంగా మలచుకోవాలని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు, నవభారతానికి పునాదులు పడిన బాటలోనే ఆధునిక భారతావనిని

నిర్మించుకోవాలని ప్రధానమంత్రి చెప్పారు. ప్రపంచ దేశాలన్నీ ఒకవైపు అభివృద్ధిని సాధిస్తు ఉంటే భారత దేశము వెనుకబడి ఉండజాలదని, ఇందుకోసం విద్యా తదితర కీలకరంగాలలో అవసరమైన మార్పులు కాంగ్రెస్ (ఐ) తీసుకు రాగలదని శ్రీరాజీవ్ గాంధీ చెప్పారు. దేశాభివృద్ధిలో మహిళలకు సమాన భాగస్వామ్యము కల్పించవలసి ఉందని, ఇందుకు అవసరమైతే చట్టాలను, శాసనాలను మార్చుకోవలసి ఉందని, అలాగే హరిజనులు, ఆదివాసులు, మైనారిటీల అత్యున్నతికి పటిష్ఠమైన చర్యలు తీసుకోవడం జరుగుతుందని శ్రీరాజీవ్‌గాంధీ హామీ ఇచ్చారు.

## ఢిల్లీ వెళ్ళి వోటువేసి వచ్చిన శ్రీరాజీవ్‌గాంధీ

న్యూఢిల్లీ : 24-12-1984 :- ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ తన భార్య సోనియాతో కలిసి దక్షిణ ఢిల్లీ రేస్‌కోర్స్ వద్ద మునిసిపల్ ప్రైమరి స్కూల్ ఆవరణలోని పోలింగ్ కేంద్రంలో వోటు వేసారు. ఎన్నికల పర్యటనపై వెళ్ళిన శ్రీరాజీవ్‌గాంధీ ఉత్తర ప్రదేశ్ బాదాన్‌నుంచి ఉదయం ఇక్కడకువచ్చారు, ఉత్తర్ ప్రదేశ్, ఆంధ్ర ప్రదేశ్, మహారాష్ట్రలలో తిరిగి ఎన్నికల ప్రచారాని కొనసాగించేందుకు ఆయన బయలుదేరి వెళ్ళారు. తెల్లటికుర్తా, పైజామా,నెహూ్రజాకెట్ ధరించిన శ్రీగాంధీ సరిగా ఉదయం 10 గంటల 5 నిమిషాలకు పోలింగ్ కేంద్రం వద్దకు వచ్చారు. న్యూఢిల్లీ నుంచిపోటి చేస్తున్న కాంగ్రెస్ -ఐ అభ్యర్థి శ్రీ కె. సి. పంత్ పోలింగ్ కేంద్రంవద్ద శ్రీరాజీవ్‌కు సాదరంగా స్వాగతం చెప్పారు.

వోటు వేసిన అనంతరం విలేకరులు అడిగిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ మెజారిటికంటే ఎక్కువ వోట్లు తాము గెలుచుకుంటామని శ్రీరాజీవ్ ధీమాగా అన్నారు.

## అణుయుద్ధ ప్రమాద నివారణ యత్నాలు ఆగవు

ఆగ్రా 11-2-1985 :- అణుయుద్ధముప్పును తప్పించి ప్రపంచ శాంతిసాధన కోసం భారతదేశం యత్నాలను కొనసాగించగలదని ప్రధాన మంత్రి శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. అణ్వస్త్రవ్యాప్తి నిరోధంపై ఢిల్లీలో జరిగిన ఆరుదేశాల శిఖరాగ్రసభ ఈ ప్రయత్నాలలో భాగమేనని కాంగ్రెస్ ఐ ఎన్నికల ప్రచారాన్ని ప్రారంభిస్తూ శ్రీ రాజీవ్‌గాంధీ చెప్పారు ప్రపంచశాంతికోసం అణ్వాయుధాల తయారీని తక్షణం ఆపి వేయాలని అగ్రరాజ్యాలకు ఆరు దేశాలసభ ఇచ్చిన పిలుపుకు ప్రతిస్పందన చాలా

తక్కువగా ఉందని అనేక దేశాలు పిలుపుకు సమాధానమిచ్చినప్పటికి అనుకున్నంత ఆశాజనకంగా లేదని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. అయితే ఈ విషయంలో మరిన్ని దేశాలు నిర్దిష్టమైన ప్రతిపాదనలతో ముందుకు, రాగలవని ఆశిస్తున్నాని ఆయన చెప్పారు

అణుయుద్ధంవల్ల ఏర్పడే భయోత్పాలను గురించి వివరిస్తూ స్వల్ప అణుయుద్ధమైనా వాతావరణం 50 డిగ్రీలకు పడిపోయి తత్ఫలితంగా దేశప్రజానీక యావత్తు అస్తవ్యస్తంకాగలదనీ ఆయన చెప్పారు. ప్రపంచశాంతి భారతదేశ పటిష్ఠత ఒక దానితో ఒకటి ముడిపడి ఉన్నాయని ప్రపంచ శాంతి సాధనతో ఇండియా మరింత పటిష్ఠం కాగలదని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. అణుయుద్ధ ప్రమాదం ముంచుకువస్తే సమస్త మానవాళి సర్వనాశనం కాగలదని ఆయన అన్నారు.

లోక్‌సభ ఎన్నికల సందర్భంలో చేసిన వాగ్దానాలను తమ ప్రభుత్వం మన్నించగలదని, వాగ్దానానికి కట్టుబడి దేశరాజకీయాల ప్రక్షాళన కోసం ఫిరాయింపులనిషేధ బిల్లును తీసుకు రావడం జరిగిందని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. ఫిరాయింపుల నిషేధం రాజకీయ వ్యవస్థ బలపడడానికి తోడ్పడ గలదని ఆయన చెప్పారు. తమ ప్రభుత్వం ప్రారంభించిన కార్యక్రమాలను అమలు పరచేందుకు రాష్ట్ర ప్రభుత్వాలు పటిష్టంగా ఉండవలసిన అవసరం కలదని ఆయన చెప్పారు. ఒక బృహత్తర పథకాన్ని కేంద్రంరూపొందిస్తే దానిని పటిష్టంగా అమలుపరచి ప్రజలదగ్గరకు తీసుకు వెళ్ళే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలపై వుంటుందని, రాష్ట్రంలో బలమైన ప్రభుత్వం వున్నప్పుడే పథకాలను విజయవంతంగా అమలు పరచడం సాధ్యమవుతుందని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు.

కొత్త విద్యావిధానం రూపొందించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, రైతులు, కార్మికులు, సమాజంలోని ఇతర బలహీన వర్గాల వారిప్రయోజనంకోసం వివిధ పథకాల రూపకల్పనకు ప్రణాళిక సంఘంకృషి చేస్తున్నదని ఆయన చెప్పారు. మహిళలు, మైనారిటీలు దళితులకు సంఘంలో గౌరవ ప్రతిపత్తుల స్థానం కల్పించేందుకు తమప్రభుత్వం కృషి చేయగలదని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు.

ఏడవ ప్రణాళికకాలం ముగసేనాటికి కొత్త రూపురేఖలతో నవభారత నిర్మాణం జరగ గలదని ఆశిస్తున్నామని ఆయన చెప్పారు. అభివృద్ధి ఫలితాలను స్వార్థ పరశక్తులు

హాతింపచేయ కుండా పేదప్రజలకు అందేలా తమ ప్రభుత్వం శ్రద్ధగై కొనగలదని, ఇందుకోసం పటిష్టమైన చర్యలు తీసుకోగలదని ప్రధాన మంత్రి హామీ ఇచ్చారు.

## శ్రీరాజీవ్ ఆస్ట్రియన్ మాజీ ఛాన్సలర్ క్రీస్కీసమావేశం

డాక్టర్ బ్రూనోక్రిస్కీ ఆస్ట్రియన్ మాజీఛాన్సలర్ ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీని కలుసుకున్నారు.

జవహర్‌లాల్‌నెహ్రూ అంతర్జాతీయ సదవగాహన అవార్డును అందుకు నెందుకై వచ్చిన మాజీ ఛాన్సిలర్ ఎన్నికలలో శ్రీ రాజీవ్‌గాంధీకి, ఐ కి లభించిన అఖండ విజయం పట్ల హర్షం ప్రకటిస్తూ అభినందనలు తెలిపారు.

## 'నెహ్రూ' పుస్తకం ఆవిష్కరణ

యువపాఠకులకై ఉద్దేశించిన "నెహ్రూ" అనే పుస్తకాన్ని ప్రధాన మంత్రి రాజీవ్‌గాంధీ ఆవిష్కరించారు ఈ పుస్తకాన్ని "విద్యావిషయ పరిశోధన, శిక్షణా జాతీయసమితి" ( ఎన్. సి. ఇ. ఆర్. టి ) వారు ప్రచురించారు.

పాఠశాలల్లో, కళాశాలలో, కొత్తతరం విద్యార్థులకు నెహ్రూ గురించి తెలిసింది చాలాతక్కువని ఇలాంటి సమయంలో ఈ పుస్తకం ప్రచురించడం చాలా ఉపయోగకరమనీ రాజీవ్‌రత్నగాంధీ పేర్కొన్నారు.

భారతదేశ ఆధునీకరణ గురించి ప్రస్తావిస్తూ, ప్రధానిరాజీవ్ - నెహ్రూ ఆలోచనలను అవగాహన చేసుకోవలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు. నెహ్రూ భావాలను ఈ నాటి ఆలోచనలకు. ఈనాటి మనపనరులకు అనుగుణంగా మలుచుకోవాలని ఉద్బోధించారు. ఈ పుస్తకానికి డా. పి. ఎల్ మల్హోత్రా సంపాదకత్వం వహించారు.

## కాంగ్రెస్ - ఐ కార్యవర్గంలో ముగ్గురు స్త్రీలు

కాంగ్రెస్ - ఐ పార్లమెంటరిపార్టీ కార్యవర్గం ఎన్నికలలో అరవైతొమ్మిది వోట్లతో సమంగాగెల్చిన ముగ్గురు మహిళా అభ్యర్థులకు ఎగ్జిక్యూటివ్‌లో స్థానం కల్పిస్తూ ప్రధాని రాజీవ్‌గాంధీ, ఒకనిర్ణయం తీసుకొన్నారు. వీరిలో మొదటి ఇద్దరు అభ్యర్థులయిన శ్రీమతి మనికాదాస్ శ్రీమతి సుభాజోషిల్ని నామినేట్ చేయగా మూడో అభ్యర్థి అయిన శ్రీమతి ఉష మల్హోత్రా ఎన్నికైనారు.

## సంబంధంలేని విషయాల్లో ఏదేశం జోక్యంచేసికోరాదు.

మాస్కో:- ఏదేశం తనకు సంబంధంలేని విషయాల్లో జోక్యంచేసుకోరాదని భారతదేశం గట్టిగా భావిస్తున్నదని భారత ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ పత్రికా గోష్టిలో చెప్పారు. హిందూమహా. సముద్రాన్ని అణ్వస్త్రరహిత మండలంగా మార్చాలని భారతదేశం చేసిన ప్రతిపాదనను ఆయన స్పష్టంచేశారు.

ఆసియా భద్రత గురించి ఒక సమావేశం జరగాలని సోవియట్ నాయకుడు శ్రీ గోర్బచెవ్ చేసిన సూచన గురించి పత్రికా విలేకరులు భారతప్రధానిని ప్రశ్నించారు,

ఆసియా భద్రత" అనేది పాత ప్రతిపాదనేనని, అయితే కొత్త యుద్ధాలలో చిక్కుకోరాదని ఆసియా దేశాలు కోరుకుంటున్నాయని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు తన తీరప్రాంతాల్లో అణ్వస్త్రనౌకలు నిల్వవుంచడానికి భారతదేశం వ్యతిరేకించడాన్ని భారత ఉపఖండం అణ్వస్త్రరహిత మండలంగా మార్చాలని కొన్ని దేశాలు చేస్తున్న ప్రతిపాదనను ఆయన ప్రస్తావించారు.

ఇరాన్ - ఇరాక్ యుద్ధంగురించి, శ్రీలంక సమస్య గురించి సోవియట్ నాయకులతో జరిపిన చర్చలలో ప్రస్తావనకు వచ్చిందని శ్రీరాజీవ్‌గాంధీ తెలిపారు.

శ్రీలంకలో తమిళుల సమస్యకు సైనిక పరిష్కారం సాధ్యం కాదని, దానికి ఏదో ఒకరకమైన రాజకీయ పరిష్కారం సాధించాలని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. పొరుగుదేశాలతో భారత్ సంబంధాలు మెరుగువడ్డాయని, ఉద్రిక్తత తగ్గిందని ఆయన చెప్పారు.

## పాక్ పర్యటనకు రాజీవ్ షరత్

బరోడా:- ఇండియాతో సత్సంబంధాలు ఏర్పరచుకోవడానికి తగిన వాతావరణం, కల్పించవలసిందిగా ప్రధాని రాజీవ్‌గాంధీ పత్రికా గోష్టిలో అన్నారు. కాశ్మీర్, ఇండియాలో అంతర్భాగం కనుకనే, అంతర్జాతీయ వేదికలో కాశ్మీర్ వివాదాన్ని పదేపదే ప్రస్తావించనని జియా ప్రభుత్వం హామీ ఇచ్చిన పక్షంలోనే తాను పాకిస్తాన్ సందర్శించడం సాధ్యపడుతుందని ఆయన స్పష్టం చేశారు.

సిక్కు ఉగ్రవాదులకు శిక్షణగాని, ఆశ్రయంగాని, ఇవ్వమని కూడా ఇండియాకు పాకిస్తాన్ నిర్ద్వంద్వంగా హామీ ఇవ్వవలసి ఉంటుందని ప్రధాని అన్నారు. జియా ఉల్ హక్ ఆహ్వానం మన్నించి పాకిస్తాన్ ఎప్పుడు వెళ్తారని విలే కరులు ప్రశ్నించగా పాకిస్తాన్ మాకు "ఎప్పుడు హామీలుఇస్తే అప్పుడు, అని ఆయన సమాధానం మిచ్చారు.

పంజాబ్‌లో ఉగ్రవాదుల కార్యకలాపాలను అదుపుచేయడంలో బర్నాలా ప్రభుత్వము కృతకృతమయిందా అని అడగ్గా, పంజాబ్‌లో ఏం జరుగుతున్నదో అందరికి తెలుసు. "అక్కడి పరిస్థితి అందరికి విసుగు పుట్టిస్తున్నది'' అని ఆయన సమాధానమిచ్చారు. పంజాబ్ ఒప్పందాన్ని సర్వప్రయోజనార్థం అమలు చేయాలన్నదే తన ఆకాంక్షయని, అయితే కమిషన్ నివేదిక కారణంగా ఒప్పందాన్ని పూర్తిగా అమలుచేయడం సాధ్యం కాలేదని రాజీవ్‌గాంధీ అన్నారు.

### తీవ్రవాదుల అణచివేతకు యత్నిస్తాం

బ్రిటన్‌లోని సిక్కు తీవ్రవాదుల కార్యకలాపాలను అణచివేయడానికి తమ ప్రభుత్వం సాధ్యమైనన్ని చర్యలన్నింటిని తీసుకొంటుందని ప్రధాని రాజీవ్‌గాంధీ బ్రిటన్ ప్రధాని మార్గరెట్ థాచర్‌కు హామీ ఇచ్చారు.ఇండియాలో ఒకరోజుపర్యటనకై వచ్చిన థాచర్ రాజీవ్‌గాంధీతో 90 నిముషాల సేపు చర్చలు జరిపారు. బ్రిటన్‌లోని కొంతమంది సిక్కులు ఖలిస్తాన్ ఏర్పాటు చేయాలని బాహటంగా డిమాండ్ చేయడం పంజాబ్‌లోని వేర్పాటు శక్తులకు వారు ఆర్థికంగా ఇతత్రాతోడ్పడడంతో రాజీవ్‌గాంధీ చర్చల సందర్భంగా అపప్రస్తావన తెచ్చారు. బ్రిటన్ సిక్కులు ఎటువంటి కార్యకల పాలపై రాజీవ్. థాచర్ చర్చించారో అధికార ప్రతినిధి విడమరచి చెప్పలేదు సిక్కులు తమదేశంలోని చట్టాలను ఉల్లంఘిస్తేనే వారిపై చర్యతీసుకుంటామని బ్రిటన్ ప్రభుత్వం ఇన్నాళ్లుగా అంటున్నాది.

మార్గరెట్ థాచర్, రాజీవ్‌గాంధీ ప్రశాంతంగా చర్చలు జరిపారు. తర్వాత అరగంటసేపు ఉభయులు, సహాయకులు కూడా చర్చలలో పాల్గొన్నారు. విదేశ వ్యవహారాల శాఖ సహాయ మంత్రి ఖుర్షిద్. ఆష్ఖాన్, విదేశాంగ కార్యదర్శి రమేశ్ బండారి, సమాచారసలహాదారు శారదాప్రసాద్ చర్చలలో రాజీవ్‌గాంధీకి సహ కరించారు. థాచర్‌కు విదేశాంగ ఉపమంత్రి అంటోనీ అక్లాండ్. ఇండియాలో బ్రిటిష్

షాక మిషనర్ రాబర్ట్ లాడ్గెరీ చర్చలలో తోడ్పడ్డారు. శ్రీలంక తమిళుల సమస్యకు శాంతియుతమైన పరిష్కారం కనుగొనవలసిన ఆవశ్యకత ఉన్నదని రాజీవ్, థాచర్ ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు. ఇందుకు సంప్రదింపులే ఏకైక మార్గమని కూడా వారు అంగీకరించారు.

శ్రీలంక తమిళుల సమస్యపై ఉభయ దేశాల ప్రధానులు వివరంగా చర్చించారు. ఉభయదేశాల మధ్య మరింత సహకారం జరుపుకోవాలని రాజీవ్, థాచర్ అభిప్రాయ పడ్డారు. రాజీవ్ ప్రభుత్వం అనుసరిస్తున్న కొత్త ఆర్థిక విధానాలని థాచర్ అడిగి తెలుసుకున్నారు. ప్రపంచ దేశాల మధ్య ఆర్థికసంబంధాలు ధనిక సమస్యల గురించి కూడా ఉభయ ప్రధానులు చర్చించారు.

చర్చల అనంతరం థాచర్ గౌరవార్థం రాజీవ్‌గాంధీ విందు ఏర్పాటు చేశారు. తొలుత థాచర్‌కు విమానాశ్రయంలో రాజీవ్‌గాంధీ, ఆయన మంత్రివర్గ సహచరులు కొందరు స్వాగతం చెప్పారు.



# గుండె నిబ్బరంతో కలసి సాగుదాం
# దేశప్రజలకు రాజీవ్ విజ్ఞప్తి

తన తల్లి మరణానికి తనకు అందించిన సానుభూతికి ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ ప్రజలందరికీ కృతజ్ఞతలు తెలిపారు. "నాకు మీకు కలిగిన నష్టం ఎప్పటికీ పూడ్చ రానిది. శ్రీమతి ఇందిరాగాంధీ అసంపూర్ణంగా వదిలిన కార్యాలు కొనసాగించడా నికి మనముకలసి పనిచేయాలి''

ధైర్యానికి మారుపేరుగా నిర్భయంగా శ్రీమతి ఇందిరాగాంధీ జీవించారు. అలాగే మరణించారు ఆమె. మరణం అమృతత్వానికి దర్పమని పవిత్రగ్రంధాలు చెప్తున్నాయి. అయితే ఈ భౌతిక కాయం మరణించక తప్పదు. పంచభూతాల్లో అది కలుసుకోక తప్పదు.

"ఇందిరాగాంధీ హిమాలయాలను ప్రేమించేవారు. ఆరాధించేవారు. వాటినుంచి ఆమె ఉత్సాహం పొందేవారు. ఎక్కడ గడపాలని మీ కోరికని ఎవరు ప్రశ్నించిన హిమపర్వతంపైన అని ఆమె చెప్పేవారు. ఇతరులకు అది కష్టం కావచ్చుకాని ఆమెకు అది ఆనందాయకం.

"భారతీయులమైన మనకు హిమాలయాలు కేవలం గొప్ప పర్వత శ్రేణి మాత్రమే కాదు. భారతీయుల ఆత్మలో విడదీయలేని భాగము. మరణానంతరము తన చితాభస్మాన్ని హిమాలయాలపై వెదజల్లాలని ఇందిరాగాంధీ కోరుకున్నారు.

మాతల్లి భౌతిక అవశేషాలను గౌరీశంకరునికి అర్పించాను, కొంత భాగాన్ని గంగోత్రివద్ద వెదజల్లాను అని రాజీవ్‌గాంధీ చెప్పారు.

"దీనితో ఇందిరాగాంధీ లౌకిక జీవనం ముగుస్తుంది. అయితే దేశం ముందుకు సాగుతూనే వుంటుంది. గుండెనిబ్బరంతో, లక్ష్యశుద్ధితో, దృఢమైన అడుగులతో కలిసి పయనిద్దాం అని శ్రీరాజీవ్‌గాంధీ తన సందేశంలో" చెప్పారు

**నిర్వాసితులకు మరోచోట పునరావాసం ప్రధాని హామీ:-**

దేశంలో అల్లర్లలో బాధలకు గురయి ఇళ్ళకు తిరిగివెళ్ళడానికి నిరాకరించే నిర్వాసితులకు మరోచోట పునరావాసం కల్పించే విషయం పరిశీలించగలమని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు.

తమ ఇండ్లకు తిరిగిపోదలచిన వారి భద్రతకు ఏర్పాట్లు చేయగలమని, సౌకర్యాలు కల్పిస్తామని ప్రతిపక్షనాయకులతో జరిపిన సమావేశంలో ప్రధానితెలియ చేశారు. అల్లర్లలో దోచుకోబడ్డ ఆస్తుల స్వాధీనానికి పోలీసులు అన్ని చర్యలు తీసుకోవాలని ప్రభుత్వం స్పష్టంగా ఆదేశించిందని ఈ విషయంలో ఏలాంటి రాజకీయ జోక్యంలేకుండా చూస్తామని ఆయన ప్రతిపక్షాల నాయకులకు హామీ ఇచ్చారు. అల్లర్లలో దెబ్బతిన్న ప్రార్థనా మందిరాలు, విద్యాసంస్థలకు ప్రభుత్వం ఖర్చుతో మరమ్మతు చేయమని ఆదేశించామని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ తెలియజేశారు.

**భరత ఖండంలో సిక్కులకు ఉజ్వల భవిష్యత్తు రాజీవ్:-**

భారతదేశంలో సిక్కులకు ఉజ్వల భవిష్యత్తు ఉందని,వారు వెలి వేయబడినట్లు భావించరాదని, ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. కన్వల్ జితసింగ్ రాసిన బహిరంగ లేఖకు సమాధానమిస్తూ మనదిమతాతీత రాజ్యం ఏమతానికి చెందిన పౌరుడైనా చట్ట రీత్యా తమ ప్రయోజనాలను సాధించు కోవచ్చని ప్రధాని పేర్కొన్నారు. దేశంలో సిక్కులు ఎదుర్కొంటున్న సమస్యలను కన్వల్ జిత్ తమ లేఖలో ప్రస్తావించారు. మిగతా అన్ని వర్గాల లాగనే సిక్కులు కూడా భారతదేశంలో ఒక భాగమేనని రాజీవ్‌రత్న చెప్పారు.

"మీపిల్లలకు మంచి భవిష్యత్తు ఉంది. శాంతి సాధనే ఆశయంగా, మీపిల్లలు చక్కటి దేశభక్తులుగా వర్ధిలి మాతృదేశా భివృద్ధిలో తమవంతు పాత్రను నిర్వహిస్తారు." అని ప్రధాని ఆకాంక్షించారు.

సిక్కులకు మతం పట్ల ఉన్న అభిమానం మెచ్చుకోదగిందే అయితే మతాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం ఉపయోగించుకునే వారి పట్ల జాగ్రత్తగా మెలగాలని ప్రధాని సూచించారు.

**అద్భుత అవకాశాలు - క్లిష్ట సవాళ్ళు రాజీవ్ వివరణ:-**

ఇదివరకెన్నడూ లేనంత శ్రీఘ్రంగా భారత్‌ను ప్రగతి పథంలో ముందుకు నడిపించడానికి ప్రధానిగా తనకు అద్భుత అవకాశాలున్నాయని శ్రీరాజీవ్‌గాంధీ అన్నారు. అదేవిధంగా ఈ కార్య సాధనలో తన ముందు ఎనలేని సవాళ్ళు కూడా వున్నాయని శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. లండన్‌లోని బి. బి. సి. ఎన్ బిసి వాషింగ్టన్ లోని ఎబిసి సంస్థలకు ఉపగ్రహ టెలివిజన్ ద్వారా ఢిల్లీనుంచి వేర్వేరుగా ఇచ్చిన ఇంటర్వ్యూల్లో ప్రధాని ఈ విషయాలు చెప్పారు. ప్రధానిగా తన బాధ్యతలు వ్యక్తిత్వానికి సంబంధించి ఈ సంస్థల విలేకరులు అడిగిన అనేక ప్రశ్నలకు ఆయన సమాధానాలు ఇచ్చారు.

"పైలెట్ ఉద్యోగాన్ని వదిలిపెట్టివచ్చి ప్రధానిగా పదవీ బాధ్యలు స్వీకరించిన మీరు ఎలా భావిస్తున్నారు" అని బి బిసి విలేకరి ఆయనను అడిగారు. మాములుగా అయితే మీ అంతట మీరు ప్రధాని పదవిని ఎన్నుకొని వుండేవారా? అని ఎన్. బి. సి విలేకరి ప్రశ్నించారు. ఈ ప్రశ్నలకు సమాధానామిస్తూ శ్రీరాజీవ్‌గాంధీ ''ఎయిర్‌లైన్స్ పైలెట్ ఉద్యోగిగా చాలాసంతోషంగా గడిపాను. అయితే పరిస్థితులు ప్రాబల్యంవల్ల నేనీపదవిలోనికి వచ్చాను. మామూలుగా అయితే ఈ పదవిని ఎన్నుకొని వుంటే వాడ్నో కాదో నాకు తెలియదు'' అని అన్నారు.

ప్రధాని పదవిచేపట్టగానే మీకు ఎదురైన అతిక్లిష్టమైన సవాళ్ళు ఏ పాటని ఎ. బి. సి. విలేకరి అడిగిన ప్రశ్నకు శ్రీమతి ఇందిరాగాంధీ హత్యానంతరం తలెత్తిన అల్లర్లను అణచివేయడం తాను ఎదుర్కొన్న మొదటి సవాలు అని శ్రీ రాజీవ్‌గాంధీ సమాధానమిచ్చారు. శ్రీమతి ఇందిరాగాంధీ హత్య తర్వాత పెద్దపెట్టున మొదలైన అల్లర్లను ఎదుర్కొనడానికి సత్వర చర్యలు తీసుకున్నాం. పెద్దసంఖ్యలో సైనిక తదితర బలగాలను రంగంలోనికి దింపి అల్లర్లను అణచివేయగలిగాం లేక పోతే భారత స్వాతం త్యానికి ముందు జరిగిన అల్లర్లకంటే పరిస్థితి ఘోరంగా వుండేది. కాని మేము చాలా స్వల్పవ్యవధిలోనే పరిస్థితిని అదుపులోనికి తెచ్చి మళ్ళి మామూలు పరిస్థితులు నెలకొల్పగలిగాం" అని ప్రధాని వివరించారు.

దేశ అభివృద్ధి, దేశసమగ్రతత పెరిగిపోతున్న ...... జనాభాను అరికట్టడం తనముందున్న మరికొన్ని సమస్యలని మరో ప్రశ్నకు సమ దానంగా ఆయన చెప్పారు.

## అసలు సమస్య విదేశీ సిక్కుల వల్లే

పంజాబ్ సమస్యకు మూలకారణం విదేశాల్లో నివసిస్తున్న సిక్కులనీ, విదేశాల్లోని ఈసిక్కులు ప్రోత్సహిస్తున్న తీవ్రవాదాన్ని అరికట్టడంలో ఆయాదేశాలు సహకరించాలని శ్రీరాజీవ్‌గాంధీ కోరారు. పంజాబ్ సమస్య పరిష్కారానికి కొన్ని చర్యలు తీసుకున్నామని అయితే ఆ చర్యలను చెప్పడానికి ఇది తగిన సమయం కాదని ఆయన తన ఇంటర్వ్యూలో తెలిపారు. పంజాబ్ సమస్య విషయంలో భారత దేశంలోని సిక్కులవల్ల పెద్ద చిక్కేమీ లేదని, ఈ సమస్యలో విదేశాల్లోని సిక్కుల నుంచే పెద్ద ఇబ్బంది ఎదురవుతున్నదని, కాని ఆయా విదేశ ప్రభుత్వాలు ఈప్రవాస సిక్కుల తీవ్రవాదాన్ని అరికట్టడంలో చేయవలసింది చేయడములేదని రాజీవ్ చెప్పారు.

పంజాబ్ సమస్యను పరిష్కరింపడానికి భారత రాజ్యాంగ పరిధులకు లోబడి చర్చలు జరపడానికి తామెప్పుడైనా సిద్ధమేనని ఆయన తెలిపారు. అణ్వాయుధ పోటీని ఆపి వేయవలసిందిగా ఢిల్లీ శిఖరాగ్ర సమావేశం ఇచ్చిన పిలుపు అణ్వాయుధదేశాల దృష్టికి పోగలదన్న ఆశాభావాన్ని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ వ్యక్తం చేశారు.

## వ్యవసాయరంగానికి అత్యధిక ప్రాధాన్యత ప్రధాని రాజీవ్‌గాంధీ

న్యూఢిల్లీ:- ప్రణాళికా రచయితలు వ్యవసాయ రంగానికి అత్యధిక ప్రాధాన్యత యివ్వాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ కోరారు. పారిశ్రామిక విధానాన్ని రూపొందించే సందర్భంగా క్రొత్తసాంకేతిక విషయాలను దృష్టిలో వుంచుకోవాలని అన్నారు. తమ అధ్యక్షతన కొత్తగా పునర్నిర్మించబడిన ప్రణాళిక సంఘము పూర్తిస్థాయి. సమావేశంలో ప్రధాని ప్రసంగించారు.

ఉత్పత్తిని నిలకడగా వుంచి ప్రోత్సహించే విషయములో వ్యవసాయధరలు కీలకపాత్ర వహించగలవని, వ్యవసాయధరల రంగమునుండి కృత్రిమత్వాన్ని తొలగించాలని ప్రధాని అన్నారు. మన విధానాలు ధరల వ్యవస్థను అస్తవ్యస్తత చేసేవిగా ఉండరాదన్నారు. ప్రారంభించిన ప్రాజెక్టులు సకాలములో పూర్తి అయ్యేట్లు చూడడం ఎంతయినా అవసరమని చెప్పుతూ, ప్రధానమంత్రి మరి ఎక్కువ పనులు

చేపట్టి వనరులును పలచన చేసుకోవడము విజ్ఞత కాదని అన్నారు. ఒక ప్రాజెక్టును సంవత్సరాల తరబడి సాగదీస్తే ఆప్రాజెక్టువల్ల లభించే ప్రయోజనం మృగ్యమని ప్రధాని అన్నారు. కేంద్రంలోను, రాష్ట్రాలలోను మరింత ఆర్థిక క్రమశిక్షణ అవసర మని ప్రధాని అన్నారు. పారిశ్రామిక విధాన రచయితలు రంగములో 1950 దశాబ్దం మధ్యకాలం నుంచి వచ్చిన ప్రధానమైన మార్పులను సాంకేతిక విషయాలను గణనలోకి తీసుకోవాలని ప్రధాని కోరారు.

ప్రజలు సత్వర ఫలితాలు కోరుతున్నారన్న విషయము ఇటివలి ఎన్నికలలో ప్రజలు యిచ్చిన తీర్పునుబట్టి విదిత మౌతున్నదని, మనము వేగంగా వెళ్తున్నట్లు సాక్ష్యాధారాలు చూసినంత కాలము ప్రజలు మనతో సహకరించటానికి సిద్ధంగా ఉన్నారని ప్రధాని అన్నారు. దేశాన్ని ఒక్కటిగా వుంచడానికి అభివృద్ధి అవసరము అన్నారు. దారిద్ర్యనిర్మూలన, సామాజికన్యాయము అభివృద్ధికి ప్రోత్సాహము అన్న లక్ష్యాలసాధనకు ప్రభుత్వము వద్దవున్న పనిముట్లు సక్రమముగా వినియోగించ బడుతున్నయా లేదా అన్న విషయాన్ని పరిశీలించవలసివుందని ఆయన అన్నారు. తగినంత అభివృద్ధి సాధించి ప్రజలకు చూపాలని స్థిరత్వానికి భంగం రానీయ కుండా పరిపాలనా వ్యవస్థలో తగిన మార్పులు తీసుకురావాలని ఆయన కోరారు. ప్రజలనుండి నిస్పృహను తొలగించటము అభివృద్ధిద్వారా మాత్రమే సాధ్యంకాగలదని ఆయన అన్నారు. వ్యవసాయానికి ప్రథమ స్థానము యివ్వాలనీ, వ్యవసాయోత్పత్తులు పెరుగుతూపోయేట్లు చూడాలనీ, అందుకు తగినట్టుగా వ్యవసాయోత్పత్తుల ధరలను నిర్ణయించాలని ప్రధాని అన్నారు. సుక్షేత్రాలు దుర్వినియోగము కాకుండా చూడాలని. గోధుమ పండే భూములలో యూకలిప్టస్ చెట్లు నాటబడుతున్న విషయాన్ని ప్రధాని ఉదాహరణగా ప్రస్తావించారు.

శాంతి భద్రతలు సక్రమంగా పరిరక్షించబడని పక్షంలో దేశంలో ఉత్పత్తి అభివృద్ధి స్తంభించి పోగలదని ప్రధాని అన్నారు. గత నాలుగు సంవత్సరాలలో 20 అంశాల కార్యక్రమం విజయవంతము కావటంతో అనేక కొత్తడిమాండులు ఎదు రౌతున్నయనీ. వాటిని తీర్చవలసివుందనీ ప్రధాని అన్నారు. మిగిలిన ప్రపంచంతో సమదీటుగా వుండటానికి మనము ఎలెక్ట్రానిక్స్ పరిశ్రమకు ప్రోత్సాహం ఇవ్వవలసి వుందని కూడా ప్రధాని అన్నారు.

**బావామరదలు సవాల్**

తేది 4-12-1984 అమెథి:- ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ పోటిచేస్తున్న అమెథి నియోజకవర్గంలో ఆయన గెలుస్తారా లేక ఆయన మరదలు మేనకాగాంధీ గెలుస్తారా అనేఆలోచనలు చర్చనియాంశమేకాదు. శ్రీమతి మేనకాగాంధీ తనబావగారు గతఎన్నికలో సాధించిన మెజారిటిని ఏ కాస్త తగ్గించగలిగినా అది తన ఘనవిజయంగానే భావించవచ్చు. పాలకపక్షాన్ని ఇరకాటంలో పడేయడమే తప్ప గెలవడం ఆమె ఉద్దేశ్యంకాదని, శ్రీరాజీవ్‌గాంధీ మెజారిటిని ఏమాత్రం తగ్గించగలిగిన ఆవిడ లక్ష్యం నెరవేరినట్లేనని కొందరు పరిశీలకులు అనుకున్నారు.

ఈ నియోజకవర్గంలో శ్రీరాజీవ్‌గాంధీ కన్నా ఎక్కువగా శ్రీమతి మేనకాగాంధీయే పనిచేసిందని, ఇంటింటికి వెళ్ళి ప్రచారం సాగించడం ద్వారా ప్రజల్లో కొంత సానుభూతిని కూడా సంపాదించుకోగలిగిందని, కొందరు ఇందిరా కాంగ్రెస్ మద్దతుదారులే అంగీకరించారు. అయినా ఆవిడ విజయాన్ని సాధించడం మాత్రం అసాధ్యమని, శ్రీరాజీవ్‌గాంధీ ప్రత్యర్థులు కూడా ఒప్పుకున్నారు.

ఈ నియోజకవర్గంలో మొత్తం వోటర్లలో స్త్రీలు 35-40 శాతం వరకు ఉన్నారు. అందువల్ల వారి వోటుకు విలువుంది. అయినా వారి మాటకు విలువలేదు. స్త్రీలు సంప్రదించి భర్తల నిర్ణయాలకు విరుద్ధంగా వోటు వేసే అవకాశం ఎం మాత్రం లేదని పరిశీలకులు అనుకున్నారు.

స్త్రీలలో శ్రీమతి మేనకాగాంధీ పట్ల కొంత సానుభూతివున్నా దానివల్ల ఆమెకు కలిగే ప్రయోజనం దాదాపు శూన్యమని చెప్పుకున్నారు. మేనకాగాంధీ స్త్రీల సానుభూతి పొందగలిగారు. అయినా అక్కడ భర్తను ఎదిరించి అతను వొద్దన్న వారికి వోటువేసే సంప్రదాయంలేదు. నేను ఇందిరా కాంగ్రెస్ కార్యకర్తను నా భార్య తప్పని సరిగా శ్రీరాజీవ్‌గాంధీకే వోటు వేస్తుంది అని పార్టీ కార్యకర్త ఒకరు చెప్పారు.

ఈ నియోజకవర్గంలో ప్రజలందర్ని భయోత్పాహానికి గురి చేశారనేది శ్రీమతి మేనకాగాంధీ ఆరోపణ. ప్రజల్లో కొంతభయం కనిపించే మాట వాస్తవమేగాని ఇది ఎవరోకొడతారనో, తిడతారనో ఏర్పడిన భయంగా కనిపించదు. ఇది ఈ దేశ ప్రధాని నియోజకవర్గం. ఏపొరపాటు మాట జారినా ఏమవుతుందోననే భయం

మాత్రం ప్రజల్లో లేకపోలేదు. ఎవరికి వోటు వేస్తావని విలేకరులు ప్రజలను అడిగితే బాహాటంగా చెప్పినప్పటికి వారెవరికి వోటు వేస్తారో చెప్పకుండానే తెలిసిపోతుంది

శ్రీమతి మేనకాగాంధీని దళిత మజ్దూర్ పార్టీ ఇతర ప్రతిపక్షాలు సమర్థించాయి. ఆమె తనకు డబ్బులేదని అందుకే ప్రచారం ఎక్కువగా చేసుకోలేకుండా వున్నానని, ఈ లోపాన్ని సరిదిద్దుకోడానికి ఇంటింటికి వెళ్ళి వోటడుగుతున్నానని చెప్పుతున్నారు. అది చాలా వెనుకబడిన ప్రాంతం. కీ. శే. సంజయ్‌గాంధీ ఈ నియోజకవర్గం నుంచి ఎన్నికైన తరువాతే అభివృద్ధి అంటూ ఏమయినా జరిగితే అది జరిగింది. కొన్నాళ్ళ క్రితం ఒక పక్కారోడ్డు కూడా లేని ఆమేథిలో ఇప్పుడు మంచి రోడ్లున్నాయి. చక్కని రైల్వేస్టేషన్ వుంది. (ఈ రైల్వేస్టేషన్‌ను శ్రీరాజీవ్‌గాంధీ ప్రజలకు అంకితం చేశారు. ఈ నియోజకవర్గంలో ఒక బిహెచ్, ఇఎల్ కర్మాగారం ఒక హెచ్ ఎ. ఎల్. కర్మాగారం వున్నాయి.

కాంగ్రెస్ మద్దతుదారులు ఈ అభివృద్ధి అంతా సంజయ్‌గాంధీ, రాజీవ్‌గాంధీ కృషివల్లనే జరిగిందని చెప్పుకున్నారు. అయితే ఈ నియోజకవర్గం ఇంత కాలం అభివృద్ధి చెందక పోవడానికి కూడా కాంగ్రెస్‌దే బాధ్యత. సంజయ్‌గాంధీ కన్నాముందు కూడా ఈ నియోజకవర్గానికి కాంగ్రెస్ పార్టీవారే ప్రాతినిధ్యం వహించారని ప్రతిపక్షాల వారుచెప్పారు. జరిగిన అభివృద్ధి అంతాకాగితాల మీదనేనని, నిజంగా సాధించింది ఏమిలేదని, ఒకవేళ ఏకాస్తయినా వున్నా దాని ఫలితాలు అనుభవిస్తున్నది, స్థానిక ప్రజలు మాత్రం కాదని మేనకాగాంధీ అన్నారు. ఈనియోజకవర్గంలో వెనుకబడిన తనం పేదరికం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. కాంగ్రెస్ హయంలో జరిగిన అభివృద్ధి అంతగాలేదనే నిరాశ ప్రజల్లోవుంది. అయినా కాంగ్రెస్‌ను కాదని ఎవరికి వోటు వేయాలి అని వారు అడిగారు. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పగల స్థితిలో ప్రతిపక్షం లేదు. కష్టము, నిష్ఠురమో కాంగ్రెస్ పార్టీకి వోటువేస్తేనే ఎంతో కొంత మేలు జరుగుతుందని భావించారు. అంతేకాక ఈ నియోజకవర్గం, ప్రధాన మంత్రి నియోజవర్గం కావడంతో సత్వరా అభివృద్ధి చెందుతుందనే ఆశకూడా ప్రజల్లో వుంది.

ప్రధానమంత్రి నియోజక వర్గంలో వోటరుగా వున్నామనే వుత్సాహం ప్రజల్లో కనిపించింది. ఇందిరా కాంగ్రెస్‌ని వ్యతిరేకించే వారిలో కూడా తాము ప్రధాని నియో

జక వర్గంలోని వారమని గర్వం కనిపించింది. ఇక్కడ బి.జె పి. అభ్యర్థిలేదు.అందు చేత మేమంతా రాజీవ్‌గాంధీకే వోటు వేస్తాం. అని ఒక బి. జె. పి మద్దతుదారు చెప్పాడు. శ్రీమతి మేనకాగాంధీని దళిత్‌మజ్దూర్ కిసాన్ పార్టీ వారు బలపరచినప్పటికి దళితులంతా తాము ప్రధాన మంత్రిజీకే వోటు వేస్తామని బాహాటంగా చెప్పారు.

అమెథీ లోక్‌సభ నియోజకవర్గంలో అమెథీ పట్టణం గోరిగంజ, జగదీశ్‌పూర్, సరాన్ శాసనసభ నియోజకవర్గాలున్నాయి. 1980 ఎన్నికలలో యిక్కడ వోటర్ల సంఖ్య 375891. అప్పుడు స్వర్గీయ సంజయ్‌గాంధీ 128,000 వోట్ల ఆధిక్యతతో గెలిచారు ఆయన మరణానంతరం జరిగిన ఉప ఎన్నికలలో శ్రీరాజీవ్‌గాంధీ కూడ అంతే మెజారిటీతో గెలిచారు.

శ్రీరాజీవ్‌గాంధీ నామినేషన్ వేసిన అనంతరం ఏగోడ చూచిన ఏమేడచూచిన ఆయనే కనిపించారు. పోస్టర్ల అతికించారు. గోడల నిండా ఆయన్ని గెలిపించమని కోరుతూ వ్రాశారు. కొన్ని పోస్టర్లలో ఆయన ఫోటోతోపాటు ఆయన భార్య శ్రీమతి సోనియాగాంధీ చిత్రాన్ని కూడా ముద్రించారు.

దాదాపు ప్రతి ఇంటిమీద అప్‌కా దహినాహాత్ రాజీవ్‌కే సాత్, మీకుడి చెయ్యి రాజీవ్‌కు అండ. అభ్యుదయ మార్గమే రాజీవ్ మార్గం. ఇందిరాగాంధీ జ్ఞాపకంతో రాజీవ్‌ను బలపరచండి మొదలైన నినాదాలు కనిపించాయి.

## అకాలీల నిజాయితీని నిరూపించుకోవాలి తేది (2-3-85) ఫతేపూర్:-

ఉగ్రవాదులవలె తాము కాదని అకాలీలు నిరూపించుకోవాలని, శ్రీగంగా నగర్, ఫతేపూర్‌లో జరిగిన ఎన్నికల సభలలో ఆయన ప్రసంగిస్తూ అన్నారు. రాజ్యాంగ నిబంధనలకు లోబడి పంజాబ్ సమస్యపై అకాలీలతో త్వరలో చర్చలు జరుపగలమని ఆయన అన్నారు. ఉగ్రవాదులతో తాము చేతులు కలుపలేదని సిక్కులు ప్రపంచానికి నిరూపించుకోవాలని ఆయన అన్నారు. అకాలీలతో చర్చలు జరుపడానికి తాము కొన్ని షరతులను విధించామని, శ్రీరాజీవ్‌గాంధీ చెప్పారు. దేశ సమైక్యత,సమగ్రతను దెబ్బతీసే ఏలాంటి చర్యలకు అకాలీలు పాల్పడవద్దని,సిక్కు సోదరిసోదరుల సమస్యల పరిష్కారానికి కేంద్రం తగు చర్యలు తీసుకుంటుందని

ఆయన హామీ ఇచ్చారు. అకాలీలతో చర్చలకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని,అందువల్ల తాము విధించిన షరతులను అకాలీలు పరిశీలించాలని ఆయనకోరారు. కేవలంకాంగ్రెస్ (ఐ)మాత్రమేసుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయగలదని ఆయన అన్నారు.కాంగ్రెసే తర ప్రభుత్వాలు అనేకం అధికారంలోకి వచ్చినప్పటికి అవి రెండేళ్ళలోనే కుప్ప కూలిపోయాయని ఆయన అన్నారు. లోక సభ ఎన్నికలలో మాదిరిగా ఈ అసెంబ్లీ ఎన్నికలలో కూడా ప్రజలు కాంగ్రెస్ - ఐని గెలిపించాలని శ్రీరాజీవ్‌గాంధీ విజ్ఞప్తిచేసారు.

## ప్రధాన మంత్రి సందేశం

దేశపురోగతికి, అభివృద్ధికి కుటుంబ నియంత్రణా కార్యక్రమ విజయం అత్యంత ఆవశ్యకమైనది.

మనం కోరుకుంటున్న లక్ష్యమేమిటంటే ప్రతి పౌరుడు పనపూర్తి శక్తిని సాధించటానికి వీలుకల్పించే ఒక పటిష్టమైన జనాభా విధానాన్ని రూపొందించటం. మన ప్రజాస్వామ్య సాంప్రదాయానుసారంగా మనది ఒక స్వచ్ఛంద కార్యక్రమం. ప్రతికుటుంబపు సంక్షేమాన్ని పెంపొందించటం దీని ధ్యేయం. ప్రజలు దీనిని తమ స్వంత ఉద్యమంగా తప్పని సరిగా రూపొందింపవలసి యున్నది.

ఈ కార్యక్రమం అమలును మెరుగు పరచే ఉద్దేశంతో ఆరోగ్య కుటుంబ సంక్షేమ మంత్రిత్వశాఖ ఒక ఉద్యమాన్ని ప్రారంభిస్తున్నందుకు నేను ఆనందిస్తున్నాను. ఈ ఉద్యమం కొరకై కృషి చేస్తున్న కార్యకర్తలందరికి నాశుభాకాంక్షలు

న్యూఢిల్లీ

14 మార్చి 1985

శ్రీరాజీవ్‌గాంధీ

# పాకిస్తాన్‌కు స్నేహ హస్తం ఇండియా లక్ష్యంపై రాజీవ్ వివరణ 3-11-85

(డెహ్రాడూన్) శీలసంపదను పెంపొందించే విధంగా సరికొత్త రీతిలో విద్యా విధానాన్ని తీర్చిదిద్దవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని, చిన్నతనంలో తను చదువుకున్న డెహ్రాడూన్ పబ్లిక్‌స్కూల్ స్వర్ణోత్సవాల సందర్భంగా ప్రసంగిస్తూ, ఆలనాటి రోజులను గుర్తుకు తెచ్చుకున్నారు. భిన్నత్వంలో ఏకత్వం, సుసంపన్న సాంస్కృతిక వారసత్వం, సెక్యులర్ విధానాలుగల మాప్రదేశం గురించి సగర్వంగా చెప్పుకునే రీతిలో విద్యార్థిని, విద్యార్థులను తయారుచేయాలని ఆయన అన్నారు.

పాకిస్తాన్ నుంచి వచ్చిన మాజీవిద్యార్థులను కూడా కలుసుకొని దాదాపు గంట సేపు వారితో గడిపారు.

ఇండియాకు, పాకిస్తాన్‌కు మధ్య ఏర్పడిన కృత్రిమ అడ్డుగోడలను ఛేదించి గట్టి స్నేహాన్ని పెంపొదించుకోవాలని కాంక్షిస్తున్నామని శ్రీరాజీవ్‌గాంధీ వారితో అన్నారు. తొలగిపోయిన విశ్వాసం మళ్ళీ నెలకొంటే ఇక అన్ని సవ్యంగా జరగగలవనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు. సాంస్కృతిక. వాణిజ్య తదితర వివిధ రంగాలలో పరస్పర సహకారం పెంపొందాలని ఆశిస్తున్నామని ఆయన అన్నారు.

శ్రీరాజీవ్‌గాంధీ ప్రసంగసందర్భంగా ఒక జోకును చెప్పి సభికులను నవ్వించారు.

"డూన్ స్కూల్ చిహ్నంలో విజ్ఞాన జ్యోతి" బొమ్మ ఉంటుంది. ఒక విద్యార్థి ఆ స్కూలు బ్యాడ్జీతో యూనివర్సిటి ట్యూటర్ దగ్గరకు వెళ్ళాడు. ఆయన ఆ విద్యార్థిని చూచి నువ్వు అక్కడ ఉన్నప్పుడు ఆ జ్యోతిని ఎవరు వెలిగించినట్టు లేదు "అని చమత్కరించారు."

శ్రీరాజీవ్ ఈ జోకు వివరించి, విజ్ఞానదీపం నిరంతరం వెలుగుతూ ఉండాలని ముక్తాయింపు చెప్పారు.

స్వర్ణోత్సవానికి హాజరైన శ్రీమతి విజయలక్ష్మి పండిత్‌ను కూడా ఆయన కలుసుకున్నారు. ఆమె నెహ్రూ సోదరి. ఆమె ఆనందంతో శ్రీరాజీవ్‌ను హత్తుకొన్నారు.

## 20 సూత్రాలకు కొత్త ముసాయిదా

"ప్రధాని రాజీవ్‌గాంధీ'' సరికొత్తగా సవరించిన ఇరవై సూత్రాల పథకాన్ని" ప్రకటించారు. ఇంతకుముందే ఈ పథకం సారాంశాన్ని ముఖ్యమంత్రుల పరిశీలనకై పంపించారు. ముఖ్యమంత్రులు ఒక్కొక్కరితో, వారందరితో ఉమ్మడిగా ఈవిషయమై ప్రధాని చర్చించారు. శ్రీమతి ఇందిరాగాంధీ ఈ పథకాని మొదటిసారి ప్రకటించారు. దీన్నె మరింత ప్రయోజనకరంగా మార్చి కొత్త రూపం ఇచ్చారు. స్వర్గీయ సంజయ్ గాంధీ ''ఐదుసూత్రాల పథకాన్ని" కూడా దీనిలోనే ఇమిడ్చారు.

కొన్నినెలలకిత్రమే కొత్త పథకం ముసాయిదా తయారయింది. దేశంలో గ్రామీణ పేదలు, గిరిజనుల స్థితిగతులను తాము స్వయంగా చూసి తెలుసుకొన్న విషయలలో ప్రధాని రాజీవ్ ఈపథకానికి మరికొన్ని సవరణలు చేశారు. ఇటీవలే ఆయన పలురాష్ట్రాల్లో పర్యటించినపుడు, సంక్షేమ పథకాల అమలులో జరుగుతున్న లోటుపాట్లను స్వయంగా గమనించారు. అధికారుల అసమర్థత రాజకీయనాయకుల నిర్లక్ష్యం ఎంతహాని చేస్తున్నాయో చూశారు. లెక్కల్లో, వివరాల్లో జరుగుతున్న అవకతవకలు తెలుసుకొన్నారు. పథకాల వైఫల్యానికిగాను స్థానిక మంత్రులను మందలించరు కూడా. వివిధ ప్రాంతాల్లో కరువు నివారణకై ఉద్దేశించిన పథకాలను త్వరితంగా అమలు చేయాలని కేంద్రంనుంచి ఆదేశాలు పంపారు. ముఖ్యంశాలు:-

—o—

# పేదరిక నిర్మూలన - ఉపాధి అవకాశాలు (సవరించిన 20 సూత్రాల కార్యక్రమం)

**ముఖ్యాంశాలు :**

నిరాశా, నిస్పృహలకు లోనవుతున్న యువకులకు ఆకర్షణంగా అదనపు ఉపాధిని-కేంద్ర ప్రభుత్వము ఈ కొత్త ఆర్థిక కార్యక్రమాని శ్రీరాజీవ్‌గాంధీ పరిపాలనలో చేపట్టారు.

ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమం ముఖ్యాంశాలు -(1) గ్రామీణప్రాంతాలలో దారిద్ర్య నిర్మూలన, (2)మెట్టప్రాంతాలలో పంటల దిగుబడి పెంచేందుకు వ్యూహం (3) సేద్యపు జలాల సక్రమ వినియోగం, (4) ఆహారధాన్యాల గరిష్ఠోత్పత్తి, (5) భూసంస్కరణలు పటిష్టంగా అమలు,(6) గ్రామీణకార్మికుల ఉపాధి ప్రత్యేక కార్యక్రమం,(7) పరిశుభ్రమైన మంచినీటి సరఫరా, (8) అందరికి ఆరోగ్యం, (9) ఇద్దరు పిల్లలతో కుటుంబ సంక్షేమం, (10) విద్యావకాశాల విస్తరణ, (11) షెడ్యూల్డుకులాలు, తెగల వారికి న్యాయం చేకూర్చడం, (12) మహిళలకు సమానత్వం, (13) యువకులకు కొత్త అవకాశాలు, (14) ప్రజల వసతికి గృహ నిర్మాణం, (15) మురికి వాడల అభ్యున్నతి, (16) అడవులను పెంచేందుకు సరికొత్త వ్యూహం,(17) పరిసరాలు కాపాడుకోవడం, (18) వినియోగదారులకు సరసమైన ధరలకు సరకులు సరఫరా, (19) పల్లియులకు ఇంధన సరఫరా. (20) బాధ్యతగల పాలనా యంత్రాంగం చిత్తశుద్ధితో సేవలు అందించేట్టు చూడడం.

## భారంగా మారిన ప్రభుత్వ రంగం

రాజీవ్ - ప్రభుత్వ రంగసంస్థల నష్టాలను పూడ్చడానికి చాలా డబ్బువృధా అవుతున్నదని, ఈ అంశంపై దేశ వ్యాప్తంగా చర్చ జరగాలని ఆయన సూచించారు. యువ పార్లమెంటేరియన్లకు కాంగ్రెస్ తొలి సేవాదళ్ శిక్షణ శిబిరానికి ప్రారంభో

త్సవం చేస్తూ శ్రీరాజీవ్‌గాంధీ ఆందోళన వ్రకటించారు. కార్మికులు వేతనాలు కోల్పో వడము వ్రభుత్వం అభిమతంకాదని ప్రధాని తెలిపారు.

300 మంది పార్లమెంటేరియన్లు సేవాదళవాలంటీర్లు, కాంగ్రెస్ కార్యకర్తలు ఈ శిబిరాంలో పాల్గొన్నారు. వ్రభుత్వరంగ సంస్థలు చాలావరకు కాయిలావడి ప్రభుత్వ యజమాన్యంలో నడుస్తునే అన్ని వ్రభుత్వరంగ వరిశ్రమలు ఇలా కాయిలావడితే దేశాభివృద్ధి ఎలాసాధ్యవడుతుందని ఆయన వ్రశ్నించారు. ప్రభుత్వ రంగమీద దబ్బుగుర్పిస్తూ ఉన్నాం, కాని ఇలా శాశ్వతంగా సాగదు. ఇక "దబ్బు గుప్పించదందుర్లభము అయ్యేరోజు వస్తుందని'' అని ఆయన అన్నారు.

ఉగ్రవాదం గురించి మాట్లాడుతు ఉగ్రవాదంతో ధైర్యస్థయిర్యాలు ప్రదర్శించి మనం పోరాడాలి. మనం భయపడితే చట్టసభలలో మన ఉనికి చెల్లదు అని ఆయన యువపార్లమెంటేరియన్లను ఉద్దేశించి అన్నారు. పేదరిక నిర్మూలన కూడా సేవదళ్ వలంటీర్ల బాధ్యతలలో ఒకటని ఆయన చెప్పారు. దేశంలో పేదరికం తగ్గుతోందని ఇందుకెన్నో వ్రత్యేక నిదర్శనలున్నాయని శ్రీరాజీవ్ చెప్పారు. స్వాతంత్ర్యం సాధించినప్పటి జీవన వ్రమాణం 28 ఏళ్ళయితే 58 ఏళ్ళకు పెరిగిందని ఆయన ఉదహరించారు.

## ప్రధాని కారుణ్యం

భారత వ్రధాని శ్రీరాజీవ్ కరుణార్ద్ర హృదయాన్ని చాటిచెప్పె సంఘటన ఒకటి త్రివేండంలో జరిగింది. ఒక పేదింటి బాలిక హృద్రోగంతో బాధపడుతుంది. చికిత్సచేయించడం తల్లిదండ్రులకు ఆర్థికంగా బలిమిగాకుండా ఉంది. ఆ జబ్బునకు ఓపెన్‌హార్ట్ సర్జరీ చేయించాలి.

దిక్కుతోచక కొట్టుమిట్టాడుతున్న ఈ బాలిక విషాదగాధ శ్రీరాజీవ్‌గాంధీ కేరళ పర్యటన సమయంలో ఆయనదృష్టికి వచ్చింది. ఆబాలిక దుస్థితికి చలించి పోయిన శ్రీరాజీవ్ తక్షణమే ప్రధానమంత్రి సహాయనిధినుండి పదివేల రూపాయలు ప్రకటించారు. ఆ బాలిక తల్లిదండ్రుల ఆశలు చిగురించాయి. ఓపెన్‌హార్ట్‌సర్జరీ చేయించేందుకు సన్నాహాలు చేసినారు. కేరళ గ్రామాభివృద్ధి శాఖమంత్రి శ్రీరమేష్ చెన్నితాల బాలిక పరిస్థితిని వ్రధాని దృష్టికి తెచ్చి పుణ్యం కట్టుకున్నారు.

## నిష్కల్మశ హృదయుడు రాజీవ్

ఆఫ్రికా దేశాలలో అధికార హోదాలో పర్యటించిన తొలి ప్రధాని శ్రీరాజీవ్ గాంధీయే ఒక్కడు. అలీన దేశాల బృందం చైర్మన్‌కూడా శ్రీరాజీవ్‌గాంధీ.

శ్రీమతి ఇందిరాగాంధీ లాగా శ్రీరాజీవ్‌గాంధీ గొప్పవక్తకాదు ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ జాతీయ ప్రతిపక్షనాయకు లందరిని దేశంలో శాంతి స్థాపనకు, మత సామరస్యానికి, సమైక్యంగా కృషి చేయాలని ఆహ్వానించారు.

బాపూజీ కలలు గన్న సర్వమత సామరస్యం కోసం, నెహ్రూజీ ఆశించిన నవభారత మహోదయం కోసం, ఇందిరాజీ అసువు లర్పించిన సమైక్య భారతం కోసం ప్రతి భారతీయుడు దృఢ దీక్షతో నడుం కట్టాలని ఉద్బోధించిన కడుసమర్థుడు.

—o—

## ఉమ్మడి ప్రతిఘటన

ప్రతిపక్షాలకు రాజీవ్ పిలుపు:- పంజాబ్‌లో ఉగ్రవాదుల నుండి ఎదుర వుతున్న ముప్పును ఎదురుక్కొనేందుకు అన్ని రాజకీయ పార్టీలు ఉమ్మడి కృషి జరపాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ విజ్ఞప్తి చేశారు. పంజాబ్‌లోని ప్రస్తుత హింసాత్మక పరిస్థితిని అసరగా చేసుకొని రాజకీయ స్వప్రయోజనాల సాధన కోసం పాల్పడరాదని ప్రతిపక్ష పార్టీలను ప్రధాని కోరారు. బిలాస్‌పూర్‌లో ఏర్పాటైన 15 రోజుల కాంగ్రెస్ శిక్షణా శిబిరానికి శ్రీరాజీవ్‌గాంధీ ప్రారంభోత్సవం చేశారు. పంజాబ్‌లో జరుగుతున్న సంఘటనలు ఒక వర్గానికి చెందిన ప్రజలను బుద్ధిపూర్వకంగా హత్యలు చేయడమే లక్ష్యంగా పెట్టుకున్నట్లు సూచిస్తున్నాయని ప్రధాని చెప్పారు.

ఇదివరకు కూడా పంజాబ్‌లో ఇలాగే జరిగిందని, అయితే అక్కడి ప్రజలు ఎంతో శాంతిని చూపుతూన్నారని ఆయన అన్నారు. పంజాబ్‌లో ఇటీవల మళ్ళీ పెరుగుతున్న హింసాకాండ, హత్యలు, దోపిడివంటి సంఘటనలనుండి ఏ పార్టీకూడా రాజకీయ ప్రయోజనాలు పొందడానికి ప్రయత్నించరాదని, అలా చేయడం వల్ల పరిస్థితి మరింత విషమించగలదని ప్రధాని హెచ్చరించారు. పంజాబ్‌లోని హింసను తెలివితోను, ఐక్యతతోను అణగార్చేందుకు ప్రతి ఒక్కరు కృషి చేయాలని అన్ని వర్గాల ప్రజలకు ప్రధాని విజ్ఞప్తి చేశారు. కీలకసరిహద్దు రాష్ట్రమైన పంజాబ్‌లో పరిస్థితి ఉద్రిక్తంగా మారితే అదిమొత్తం దేశానికే తీవ్రమైన ముప్పుగా పరిణమించగలదనే విషయాన్ని గుర్తుంచుకోవాలనీ, ఇది దేశాన్ని బలహీనపరచడానికే తోడ్పడుతుందని ప్రధాని చెప్పారు. ఎటువంటి సవాళనైనా ఎదుర్కొనేందుకు జాతి అప్రమత్తంగా, సన్నద్ధంగా ఉండాలని ఆయన పిలుపునిచ్చారు. అగ్రరాజ్యాలను కాదని స్వతంత్రంగా వ్యవహరించే ధైర్యసాహసాలు కొరవడిన వర్ధమాన దేశాలు అనేకం ఉన్నాయనీ, భారతదేశం ఎలాంటి పరిస్థితులలోను లొంగుబాటును ప్రదర్శించబోదని ప్రధాని హామీ ఇచ్చారు. రమ పెత్తనానికి గండిపడుతుందనే భయంతో దక్షిణాఫ్రికా సమస్య నిరాయుధీకరణ, అలీనోద్యమం వంటి వాటిని ఇండియావదేపదే ప్రస్తావించడం కొన్ని అగ్రరాజ్యాలకు ఇష్టంలేదని ప్రధాని చెప్పారు. భారత ప్రజలను విడదీయడానికి నిరంతరం కుయుక్తులు పన్నడానికి ఇదే కారణమని కూడా

ఆయన అన్నారు. భారతదేశం శక్తి ప్రజాబలమేనని గుర్తుంచుకోవాలని కూడా పార్టీ నాయకులను, కార్యకర్తలను శ్రీరాజీవ్‌గాంధీ హెచ్చరించారు. ఈ తరుణంలో "ఐక్యత" అత్యావశ్యకమని ఆయన అన్నారు.

దేశాన్ని బలహీనపరచడానికి విద్రోహ శక్తులు పన్నుతున్న కుట్రలపట్ల అప్రమత్తంగా ఉండాలని దేశప్రజలను శ్రీరాజీవ్‌గాంధీ హెచ్చరించారు. విచ్ఛినకర శక్తులు ఇంట బయట చురుకుగా పనిచేస్తున్నాయని ఆయన అన్నారు. భారతదేశం, స్వతంత్రంగా మనుగడ సాగిస్తూ శక్తివంతమైన వర్తమానదేశంగా రూపొందడం చూసి సహించలేని విదేశీశక్తులు చురుకుగా పనిచేస్తున్నాయని తరచూ శ్రీమతి ఇందిరాగాంధీ చెప్పేవారని అదివాస్తవమని నిరూపితమైందని కూడా ప్రధాని శ్రీరాజీగాంధీ అన్నారు.

—o—

# ప్రజల మనసుల్లో హింసా భావనే లేకుండా చేయాలి

## (సమసమాజస్థాపనలో సకల పక్షాల సహకారానికి రాజీవ్‌గాంధీ అభ్యర్థన)

న్యూఢిల్లీ (23 1.1985) ప్రజల మనసులనుండి హింసా దౌర్జన్యాల భావనను తుడిచిపెట్టి దేశాన్ని ప్రగతిపథంలో నడిపించడానికి ప్రతిపక్షాలు సంపూర్ణ సహకారం ఇవ్వాలని ప్రధాని శ్రీరాజీవ్‌గాంధీ కోరారు.

రాష్ట్రపతి ప్రసంగానికి ధన్యవాదాలు తెలిపే తీర్మానంపై రాజ్యసభలో రెండు రోజుల పాటు జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ ఆయన పైవిధంగా అన్నారు. హింసావాదం, వేర్పాటువాదంపైన పోరాటం జరపవలసి ఉన్నదని ఆయన చెప్పారు. మహాత్మాగాంధీ అహింసావాదాన్ని ఆచరించడమే కాక ప్రజలు హింసావాదాన్ని విడిచిపెట్టాలని ఆశించారని దాన్ని మనం ఆదర్శంగా తీసుకోవాలని ప్రధాని సూచించారు. గత కొలది ఏళ్ళలో హింసావాదం పెరగడం గురించి ప్రస్తావిస్తూ, ఆర్థిక అసమానతలవల్ల మతతత్వం లేదా ప్రాంతీయతత్వంవల్ల సంకుచిత వేర్పాటు వాద ధోరణులవల్ల ఈ దౌర్జన్యకాండ చెలరేగిందని దీనిపైన మనం పోరాటం కొనసాగించాలని ఆయన కోరారు. హింసాదౌర్జన్యాలు అరికట్టినపుడే అభివృద్ధి కార్యక్రమాలు త్వరితంగా అమలు జరుగుతాయని దేశం శీఘ్రగతిన పురోగతి సాధిస్తుందని శ్రీరాజీవ్ అన్నారు.

భారతదేశం సెక్యులర్ వాదాన్ని అవలంబిస్తున్నందున పటిష్టంగా ఉన్నదని ఆయన అన్నారు. భారతదేశానికి పటిష్టమైన న్యాయవ్యవస్థ అవసరమని, రాజకీయలకు లొంగిపోనిపటిష్టమైన అధికార యంత్రాంగం అవసరమని ఆయన అభిప్రాయపడ్డారు. దురదృష్టవశాత్తు ప్రాంతీయ తత్వం పేరుతో ప్రత్యేక అస్తిత్వం ముసుగు కొన్నిరాష్ట్రాలు అధికార యంత్రాంగాన్ని కలుషితం చేసాయని, వివిధస్థాం

జోక్యం కారణంగా మొత్తం వ్యవస్థ దెబ్బతిన్నదని పేర్కొంటు ఈ పరిస్థితిని తాము సరిదిద్దుతామని ఆయన చెప్పారు.

విద్యారంగాన్ని కూడా పునర్వ్యవస్థీకరించడం అవసరమని ప్రధాని అన్నారు. దేశాన్ని ఐకమత్యంగా, పటిష్ఠంగా ముందుకు నడిపించగల మౌలికజాతీయ ప్రణాళిక రూపొందాలని ఆయన సూచించారు. పశ్చిమబెంగాల్ ప్రభుత్వాని అన్యా ప్రదేశంగా ప్రస్తావిస్తూ కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మార్క్సిస్టు సిద్ధాంతాలను పార్టీ ప్రణాళికలో జొప్పించాయని, కొన్ని రాజకీయ పార్టీలు విద్యా వ్యవస్థను హస్తగతం చేసుకోవడాన్ని తాము అనుమతించమని ఆయన అన్నారు. లోక్‌సభ ఎన్నికల ఫలితాలు ప్రజలు కాంగ్రెస్ పాలన కొనసాగాలని కోరుతున్నారనడానికి నిదర్శనమని ఆయన చెప్పారు. కాంగ్రెస్ సిద్ధాంతాలు, సాంఘిక న్యాయసాధనకు సాగిస్తున్న పోరాటాలు, దేశం స్వయం సమృద్ధికోసం ఈ పార్టీ చేస్తున కృషికి, సెక్యులరిజం అలీన విధానం, అహింసావాదానికి ప్రజలు మద్దతు ఇస్తున్నారనడానికి ఎన్నికల ఫలితాలు తార్కాణమని ఆయన అన్నారు.

దేశాన్ని శీఘ్రగతిన ముందుకు తీసుకువెళ్ళడం ఎలా అన్నదే ఇప్పటి సమస్య అని శ్రీరాజీవ్ చెప్పారు. గతంలో జరిగిన దానికి ఎన్నికల ఫలితాలే జవాబు అని ఆయన అన్నారు. ప్రతిపక్షాలు గతాన్ని చూస్తున్నాయి. మేముభవిష్యత్‌గురించి ఆలోచిస్తున్నాము. దేశాన్ని పటిష్ఠంగా ప్రగతి పథంలో ఎలానడిపించాలి అన్నదే మా ఆలోచన. ఈ కృషిలో అన్ని రాజకీయపార్టీలు, సభలోలేని పార్టీల నాయకులు కూడా తమకు సంపూర్ణ సహకారాన్ని ఇవ్వాలని ఆయన విజ్ఞప్తిచేసారు.

దేశంముందున్న సమస్యలను గురించి ప్రస్తావిస్తూ దేశాన్ని ఆధునీకరించడం ప్రథమ లక్ష్యమని ఆయన ప్రకటించారు. అన్నిరంగాల్లో దేశాన్ని స్వయం సమృద్ధం గావించి చురుగ్గా ప్రగతిసాధించే వాతావరణాన్ని నెలకొల్పడానికి ఇందుకు అనువుగా ప్రజల ఆలోచనా సరళిని మార్చడానికి తాము కృషిచేస్తామని ఆయన అన్నారు. ఐక్యతతో మనం దీనిని సాధించవచ్చు. అనుమానాలకు అస్కారంలేదు. కాలయాపనకు వీలులేదు. మనందరం శక్తియుక్తులను ఏకంచేస్తే సాధించలేనిది ఏది లేదు. ఇందుకు మనమంతా కృతనిశ్చయం కావాలి అని ఆయన అన్నారు.

అంతర్జాతీయ రంగాన్ని గురించి కూడా ప్రధాని క్లుప్తంగా ప్రస్తావించారు. సాధారణ సంబంధాలు పునరుద్ధరించు కోవాలన్న భారతదేశం ఆకాంక్షకు పాకిస్తాన్ అనుకూలంగా వ్యవహరించగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు. శ్రీలంక తమిళుల సమస్యకు ఒక రాజకీయ పరిష్కారం కోసం ఆ ప్రభుత్వం కృషిచేయగల దన్న విశ్వాసాన్ని కూడా ఆయన వ్యక్తం చేశారు. ఢిల్లీలో జరిగిన ఆరు దేశాల శిఖరాగ్ర సభ చర్చలు ప్రపంచ శాంతికి నిరాయుధీకరణకు ఉపకరించగల వన్ననమ్మకాన్ని ఆయన వెల్లడించారు.

లోక్‌సభలో ప్రసంగిచినప్పుడు ప్రధాని విదేశీ గూఢచారి ముఠా గురించిగాని, ఆర్థిక సమస్యలగురించిగాని తమ ప్రసంగంలో ప్రస్తావించలేదు. లోక్ సభలో అర్ధగంటసేపు మాట్లాడారు. రాజ్య సభలో 15 నిముషాలు మాత్రమే ప్రసంగించారు పాలక పక్షల సభ్యులు మధ్య మధ్య హర్షధ్వానాలు చేయడంతప్పితే సభ్యులంతా నిశ్శబ్దంగా ఆయన ప్రసంగం విన్నారు. ప్రధాని సమాధానం తర్వాత ప్రతిపక్షాల సవరణలను త్రోసిపుచ్చి సభ తీర్మానాన్ని ఆమోదించింది.

## అవినీతికి పాల్పడే పోలీసు సిబ్బంది పై కఠిన చర్యలు : ప్రధాని హెచ్చరిక.

న్యూఢిల్లీ: పోలీస్ శాఖలో అవినీతిని, రాజకీయాలను ప్రధాని శ్రీరాజీవ్ గాంధీ గర్హించారు. రాజకీయనాయకులు పోలీస్ శాఖలో జోక్యంకలుగచేసుకోనుట, శాఖ అంతర్గత రాజకీయాల్లో కూడా ద్యోతక మౌతున్నయని ఈ రెండు రకాల రాజకీయాలు, అంతంకావాలని ఆయన అన్నారు.

అవినీతి సహించబడగనే సందేశం అన్నిస్థాయిల్లోని పోలీసులకు స్పష్టం కావాలని, అవినీతికి పాల్పడే పోలీసులపై తీసుకునే చర్య కఠినమైనదిగాను, ఇతరులు అవినీతికి పూనుకోకుండా నిరోధించేదిగాను వుండాలని ప్రధాని అన్నారు.

పోలీసు డైరెక్టర్ జనర్‌ల, ఇన్‌స్పెక్టర్ జనరల్‌ల రహస్యసమాచార శాఖల అధిపతుల సమావేశంలో ప్రధాని ప్రసంగించారు బయటివారి జోక్యాని అంతర్గతంగా జరిగే మోసాన్ని అంతంచేయడానికి సమర్థమైన చర్యలు తీసుకోవాలని ప్రధాని కోరారు.

దేశంలో నేరాలు, బీభత్సకాండ పెరిగి పోతున్నాయని, రహస్య సమాచార శాఖ సేకరించిన సమాచారాన్ని సక్రమముగా మదింపువేయటం ద్వారా ఈ పెరుగుదలను అరికట్టాలని ప్రధాని అన్నారు.

ఇంతవరకు పోలీసులు నిర్వహిస్తూ వచ్చిన పనులను నిర్వహించడానికి యిప్పుడు సెంట్రల్ రిజర్వ్ దళాలను, సరిహద్దు భద్రితా దళాలను, ఆఖరికి సైన్యాన్ని సైతం పిలిపిస్తున్నారని, ఆందోళనకరమైన, అవాంఛనీయమైన ఈ పరిస్థితి అంతంకావాలని ప్రధాని అన్నారు.

పోలీసులు సమర్థంగా పనిచేయాలంటే వారికి ఆత్మవిశ్వాసం అవసరం అని ప్రధాని అన్నారు. చక్కని ఉద్యోగ పరిస్థితులు, మేలైన వేతనాలు, గృహవసతి సంక్షేమ చర్యలు మున్నగువాని ద్వారా పోలీసులలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించాలని ప్రధాని కోరారు.

రహస్య సమాచార శాఖవారు సరియైన సమాచారాన్ని సకాలంలో సేకరిస్తే ఏ పరిస్థితినైనా అదుపు చేయటానికి అంతగా బలప్రయోగం అవసరం వుండదని ప్రధాని అన్నారు.

ఒక రాష్ట్రపు నేరస్థులు, మరో రాష్ట్రంలో ఆశ్రయం పొందకుండా వివిధ రాష్ట్రాల పోలీసు శాఖల మధ్య సమన్వయం మరింత పెంపొందాలని ప్రధాని సూచించారు.

సమాజంలోని అన్ని వర్గాలవారు పోలీసులు ప్రజాబంధువులు అని భావించే స్థితి రావాలని ప్రధాని అన్నారు.

పోలీసు వ్యవస్థమొత్తం బీటుకాన్‌స్టేబుల్‌పై ఆధారపడి వుంటుందని, అతడి సమస్యలను, ఇబ్బందులను, అతడు ఉపయోగించే పద్ధతులను అత్యున్నతస్థాయిలో వుండే పోలీసు అధికారులు పూర్తిగా అవగాహన చేసుకోవాలని ప్రధాని కోరారు.

పోలీసులకు అత్యాధునిక పరికరాలు సమకూర్చటం చాలా అవసరమని ప్రధాని అభిప్రాయపడ్డారు.

అయితే అంతకన్నా ముఖ్యమైనది పోలీసులకు ఎప్పటికప్పుడు మేలైన పద్ధతులలో శిక్షణ యివ్వటం మంచిదని ఆయన అన్నారు. శిక్షణ యిచ్చేందుకు మేలైన పోలీసు అధికారులను ఎంపికచేసుకోవాలని అన్నారు.

# వృద్ధుని కోసం ఆగిన ప్రధాని

కడప :- భారతప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ కడపకు రాత్రి తొమ్మిదిగంటల కొస్తారని పట్టణంలోని ముఖ్యరహదార్లలో జనం గుమిగూడారు. కానీ శ్రీ రాజీవ్‌గాంధీ రెండున్నర గంటలు ఆలస్యంగా రా 9 11.30 గం॥కు కడప వచ్చారు. కృష్ణా థియెటర్ కూడలివద్దజనం మార్గానికిరు వైపులక్రిక్కిరిసి వున్నారు. ఆవరుసలో ఒకవైపు యాభై పైబడిన వృద్ధుడు ఒకడు అందరిలా నిలబడి వున్నాడు. మాసిపోయినా పంచ, చొక్కాతో వెయ్యికళ్ళతో వేచివున్నాడు. ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ మెడలో వేసేందుకు పూలహారం చేతపట్టుకొని నిలబడి నిరీక్షిస్తున్నాడు.

జనంలో శ్రీ రాజీవ్‌గాంధీ వచ్చేస్తున్నారని కలకలం, హర్షధ్వానాలు బయలు దేరాయి ప్రధానీ మంత్రిని పూల మాలాలంకృతిని చేసేందుకు నిలుచున్న పెద్దాయన పూలహారం పైకెత్తి పట్టి నిలబడినాడు

భారత ప్రధాని శ్రీ రాజీవ్‌రత్నగాంధీ జీపులో వచ్చేశారు. కూడలిదాటి వెడలిపోతున్నారు. పూలహారం చేతపట్టుకొని నిలిచివున్న ఆపేదవాడు బాధ ఆపు కోలేక బిగ్గరగా కేకలేశాడు. అంతే - ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ అటుతిరిగారు. డ్రైవరిని జీపు ఆపాల్సిందిగా కోరారు. చెయ్యెత్తి రమ్మన్నట్లు పిలిచారు. పోలీసులు ప్రక్కకు తప్పుకున్నారు. ఆనందబాష్పాలు రాలుస్తూ - ఆపెద్దాయన శ్రీ రాజీవ్ గాంధీ మెడలో పూలమాలవేసి దీవించాడు. ప్రధాని కృతజ్ఞతా పూర్వకనమస్సులు తెలిపి కదిలిపోయారు. ఆపేదవాడు శ్రీ రాజీవ్ ప్రసంగించే మునిసిపల్ స్టేడియం సమీపానికి వెళ్ళిపోయాడు. శ్రీ రాజీవ్‌గాంధీ ఉపన్యాసం వింటూ అవధులు లేని ఆనందాన్ని పొందాడు.

తనలో తనే ఆనందపడుతూ పైకి నవ్వుతూ ఉండే - ఒక అధికారి "ఏమిటి అలా ఆనందపడిపోతున్నావు?" అని అడిగాడు,

"అవును! నేను శ్రీ రాజీవ్‌గాంధీకి పూలమాల స్వయంగా వేశాను. తెలుసా?" అని చెప్పాడు.

పాపం ఆపేదవానికి శ్రీ రాజీవ్‌గాంధీ పట్ల - ఎన్ని ఆశలు ఉన్నాయో! అలాంటి వారెందరో ఈ రత్నగర్భ భారతావనిలో.

—o—

